సంపుటి : 5

# చతుర

సంచిక : 6

జూలై 1982

## ఈ నెల సమగ్ర నవల

యవ్వనంలోకి అడుగిడుతూనే జీవితం గురించి అందమైన ఊహలు అల్లుకుందామె. జీవితం నందనవనంలా గడవకున్నా కనీసం వీధి పాలు కాబోదని ఆశించిందామె. కాని, బాహ్య ప్రపంచంలోకి వెళ్ళిన మరుక్షణం నుండి ఎదురయిన పచ్చి నిజాలు ఈ సమాజంలో ఆ ఊహలు ఏనాటికీ నిజం కాబోవని తేల్చి చెప్పాయి. నీతిని, నిజాయితీని దాచుకొమ్మని ఆదేశించాయి. ఫలితంగా తనంత తానుగా అందరూ అసహ్యించుకునే వృత్తిలోనే మహారాణిలా ప్రవేశించింది. ఆ రాజసాన్ని నిలబెట్టుకుంటూనే తనతోటి అభాగ్యులను ఆ పాప పంకం నుండి బయటకు లాగి ఆరోగ్యవంతమైన ప్రపంచంలోకి నడిపించాలని తాపత్రయపడింది. ఆ కలలు పాక్షికంగానైనా ఫలించే వేళకు తనకు అండదండగా ఉన్న సహచరుడే అన్నీ తెలిసికూడా ఆహ్వానించాడామెను తన జీవితంలోకి.



# రేపటి మనిషి

గా అప్పటికే అభాగినుల మెప్పు పొందిన ఆమె ఆ సమయంలో తీసుకున్న నిర్ణయం ఎలాంటిది?
స్వతహా తాను 'పంకజ' కాకపోయినా, పాప పంకంలోకి అడుగిడవలసి వచ్చినా నిలదొక్కుకోజూచిన ఆమె ఆ సహచరుని ఆహ్వానాన్నంగీకరించిందా!

**జి. హేమంత**

కొత్తకోణం నుండి పరిశీలించిన యదార్థ జీవనవేదనా కావ్యం 'రేపటి మనిషి' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : [illegible] శివన్నారాయణ
రెండవ కవరు : కె. రాజేంద్రప్రసాద్
మూడవ కవరు : బ్రహ్మదేవ్
నవల బొమ్మలు : ఆనంద్. ఎ.వి.బి.ఎస్.

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకొని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్తాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.

# న్యూట్రమూల్ 'మొనగాడ'వండి
# బలానికి దారాసింగ్ చెప్పే పాఠాలు

**పొడుగును పెంచే కసరత్తు.**
కుడిభుజాన్ని గోడకు ఎదురుగా పెట్టి నిలబడండి. ఊపిరి పీలుస్తూ వేళ్ళ మీద పైకిలేస్తూ, ఎడమ ముంజేతిని పైకి విసరుతూ వీలైనంత ఎత్తుగా గోడను తాకండి. ముందటి స్థానానికి తిరిగివస్తూ ఊపిరి వదలండి. దీన్నే, ఎడమ ముంజేతితో 10 సార్లు కుడి ముంజేతితో 10 సార్లూ చెయ్యండి.



పాదాల మధ్య 10 అంగుళాల దూరం వుండేలా నిల్చోండి. ఊపిరి పీలుస్తూ, వేళ్ళ పైన పైకి లేస్తూ, ముంజేతుల్ని, వేళ్లు తలపైకి వచ్చేదాకా వీలైనంత ఎత్తుగా విసరండి. ముందటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్ని 10 సార్లు చెయ్యండి.



కాళ్ళను విస్తృగా పెట్టి నేల మీద కూర్చోండి. కాళ్ళను వీలైనంత ఎక్కువ ఎడంగా పెట్టండి. ఊపిరి వీల్చే టప్పుడు ముందుకు వంగండి. చల చేస్తూ, ఎడమ మోకాళ్ళకు తగిలేలా పాదాన్ని రెండు చేతులతో తాకడానికి ప్రయత్నించండి. మొదటి స్థాయికి తిరిగి వస్తూ ఊపిరి వదలండి. దీన్నే 10 సార్లు ఎడమ పాదంలో 10 సార్లు కుడి పాదంతో చెయ్యండి.



ప్రతి రోజూ ఒక కప్పు న్యూట్రమూల్ తాగి బలాన్ని పొందండి. న్యూట్రమూల్ లో మీరు యిష్టపడే సమృద్ధి అయిన అమూల్ పాలు, మేలైన మాల్ట్ ఆరోగ్యాన్నిచ్చే విటమిన్లు ప్రొటీన్లు ఖనిజాలు. అదికూడా చాక్లెట్ రుచితో. తల్లులు తెలుసుకోవలసిందేమిటంటే. న్యూట్రమూల్ ధర, బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవాకన్నా తక్కువ అని.





daCunha/GCM/69/82/TL

గట్టితనం పొందే మార్గంలో న్యూట్రమూల్ మీకు సహాయం చేయనీండి– ఆరోగ్యంగా, మీరు చేసేవన్నీ గొప్పగా కనిపించేలా, గొప్పగా చేసేలా కూడా. న్యూట్రమూల్ మొనగాడవడం అంటే అదేమరి.




అమూల్ వారి
# న్యూట్రమూల్

అమ్మకందారులు :
గుజరాత్ కో–ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్ ఆనంద్, గుజరాత్.



# గూండా వానరాలు

భారత రాజధాని నగరం న్యూఢిల్లీ లోని చాణక్యపురి ప్రాంతంలో ఒక సినిమా థియేటరుపై 'ఒక వానరద్వయం' 'కాపురం' వెలిగిస్తూ ఆ ప్రాంతంలోని జనాన్ని దడదడలాడిస్తోంది. వీటిలో ఒకటి మగకోతి. రెండోది దాని చెలికత్తె.



భార్యాభర్తల మాదిరిగానే సహజీవనం సాగిస్తోన్న వాటికి అక్కడి పిల్లలు ఫాటొస్సె, ఫాట్సీ అని పేర్లు పెట్టారు. ఈ రెండూ అక్కడి ప్రజానీకం జేబులు కొడుతూ, వాహనాలను ధ్వంసం చేస్తూ, కంట కనబడిన ఆహార పదార్థాలను కాజేస్తూ నానా రకాలుగా గొడవ సృష్టిస్తున్నాయి. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆ థియేటరును అవి వదిలిపోలేదు. ఒకసారి మత్తు జల్లి పట్టుకు పోదాం అని వచ్చినవారు, మత్తు పూసిన బాణం వదలగానే అది ఒక దానికి తగిలింది. వెంటనే కొంతసేపు ఆ కోతి కనబడలేదు. మత్తులో పడిందని ఇవతలివారు సంబరపడుతుండగా తటాలున మరోచోట ప్రత్యక్షమై ఆ బాణాన్ని తీసి నేల మీద విసిరికొట్టింది.

ఈ రెండు ఆ ప్రాంతంలోనే ఉన్న ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టు అథారిటీ కార్యాలయంలో తరచు అడుగుపెడుతూ ఆఫీసర్ పాత్రను అద్భుతంగా పోషిస్తున్నాయి. ఆ కుర్చీలో కూర్చుని, ఫైళ్ళను అటూఇటూ చెరిగేసి, పెన్నులు పాడు చేస్తున్నాయని కార్యాలయం సిబ్బంది ఆక్రోశిస్తోంది. అసలు మొట్టమొదట ఒక్కకోతే వచ్చింది. తర్వాత రెండోది కూడా వచ్చి చేరడంతో జంటగా సంసారం సాగిస్తూ ఇలా ఆగడాలను రెట్టింపు చేశాయి. ఇహ వీటిని వదిలించుకోక తప్పదనే నిర్ణయానికివచ్చి కిరాయి మనుషలను నియమించగా, ఆ ప్రాంతంవారే అయిన ఆ మనుషలు కిరాయి మొత్తం అందుకుని ఆహార పదార్థాలలో మత్తుకలిపి





# ప్రపంచం

వల విసిరారు. ఏమీ తెలియని ఆ జంట వలలో పడింది. ఆ పైన వాటిని తీసుకు వెళ్లి 'జూ'లో వదలి 'హమ్మయ్య' అనుకుంటూ ఇంటికి చేరిన పెద్దమనుషులను అప్పటికే అక్కడికి వెళ్లిపోయిన ఫాటోస్, దాని భార్యా 'ఇంటి'మీంచి వీరవంక ఇకిలిస్తూ చూశాయట.

## అబ్బాయే పుడతాడు

'ఆరుమాసాలాగు, పుడతాడు మనకో బాబు...' అని మలేషియాలో కాబోయే




తండ్రులంతా జోరుగా పాడుకుంటున్నారు. వాళ్ళంత ఖచ్చితంగా పాడుకోవడం వెనక ఓ చిదంబరరహస్యం వుంది.

ఆగస్టు, సెప్టెంబరు నెలల్లో అక్కడ దొరికే పనసపండులాంటి పండొకటి గర్భిణీస్త్రీలు తింటే వారికి మగపిల్లవాడు పుడతాడని వారి నమ్మకం. మంచి వాసన, రుచిగల ఈ పండు ఒకే సీజన్లో తప్ప ఇతరసమయంలో ,దొరకకపోవడం వల్ల ఖరీదెక్కువ. సీజన్లో మాత్రం ఈ పండు నుండి వచ్చే కమ్మని వాసనలు మలేషియాను చుట్టుముడుతాయి.

లక్షాధికారులు, కోటీశ్వరులు సైతం కార్లలో మార్కెట్ కొచ్చి కార్లను ఓ పక్కన ఆపివుంచి ఆ పండును కొనుక్కొని తింటూ వుంటారు. పెద్దసైజు పండు ఖరీదు యాభై రూపాయల దాకా వుంటుంది.

మొట్టమొదటిసారి ఈపండు తినేవారికి దాని రుచి, వాసన అంతగా రుచించకపోగా వాంతి వచ్చినంత పనౌతుంది. కానీ ఒక్కసారి ఈ పండు తినడానికి అలవాటుపడితే మాత్రం మళ్ళీ సీజన్లో దొరికేదాకా జిహ్వ పీకుతుంటుంది.

ఈ పండులో వేడి చేసే గుణముంది. బాగా మద్యం తాగిన తర్వాత ఈ పండును తింటే మరణం కూడా సంభవించే అవకాశాలున్నాయి.

మలేషియాలో నివసిస్తున్న చైనా స్త్రీలు, ముఖ్యంగా గర్భిణీ స్త్రీలు ఈ పండును మహాప్రీతిగా తింటారు. మగ పిల్లవాడు పుడతాడన్న నమ్మకమే అందుకు కారణం.

## దేశభక్తి

భారతీయులకి విదేశాల మీదున్న మోజు మరే దేశవాసులకీ వుండదని ఓ నానుడి. స్వదేశంలో పని, తిండి దొరక్క



పొట్ట చేత బట్టుకొని కష్టనష్టాలు భరించాల్సి వస్తుందని తెలిసి కూడా ధైర్యంచేసి ఓ సంస్థ ద్వారా సౌదీ అరేబియా వెళ్లాడు అబ్దుల్ అనే ఓ భారతీయుడు. అక్కడ ఓ ఆఫీసరుగారింట్లో నౌకరీ కుదిరింది అబ్దుల్‌కి.

ఆ ఆఫీసరుగారికి భార్య గాక ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు. డబ్బు కూడా దండిగానేవుంది. అబ్దుల్ ఆ ఇంట్లో గాడిద చాకిరీ చేసేవాడు. నెలకి పదిహేను వందలు జీతం. అయితేనేం ఆఫీసరు గారింట్లో కుక్కపిల్లకున్న విలువ కూడా అతనికుండేదికాదు.

ఓ రోజురాత్రి ఇంటిల్లిపాది సుష్టుగా భోంచేసి ముసుగుతన్ని పడుకున్నారు. తెల్లారి లేచి ఆఫీసుకు చిందులు తొక్కుతాడని అర్ధరాత్రి దాటుతున్నాగాని చిందరవందరగావున్న ఇల్లు సర్దడంలో నిమగ్నమయ్యాడు అబ్దుల్. ఓ గదిలో కార్పెట్ శుభ్రంచేస్తుంటే కారమ్స్ బోర్డు కనబడింది.

అంతా నిద్రపోతున్నారుకదా, సరదాగా ఓ గేమ్ వేసి చూద్దామని ఆట మొదలెట్టాడో లేదో ఆ శబ్దానికి ఆఫీసరుగారి ఆఖరి కొడుకు లేచి "నా కారమ్ బోర్డ్ ముట్టుకున్నాడు బాబోయ్!" అంటూ పెద్దగా రాగాలు పెట్టాడు.

ఫ్యాక్టరీ సైరన్లాంటి వాడి గొంతు విని అందరూ లేచి అబ్దుల్‌ని చుట్టుముట్టారు. "అఫ్టారాల్ పనివాడివి. నీకు కారమ్స్ తక్కువొచ్చిందా! ఇండియాలో కారమ్ బోర్డు మొహమైనా చూశావా!

# ్రియ తోడుగా ఉంటే చాలు...
# మరింత సంతృప్తి!






తీసుకొనేవేళ పక్కన 'ప్రియ' ఉంటే
దయం రుచులమయం. అదే 'ప్రియ'
ని రహస్యం. నోరూరించే పలురకాల
లో మీకు కావలసింది ఎన్నుకోండి.

ల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ 300,
650 గ్రాముల సీసాల్లో దొరుకుతాయి.

మామిడికాయ * నిమ్మకాయ * టొమాటో
* గోంగూర * ఉసిరికాయ * చింతకాయ
* పండు మిరపకాయ * వంకాయ
తీపిరకాలు : * మామిడికాయ * అల్లం

రుచి... ఎంతో రుచి... ప్రియ

ప్రియ ఫుడ్స్
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
MARGADARSI
MARKETING
PRIVATE LIMITED
Eenadu Compound
Hyderabad - 500 004.

KIRON-PL-81211

"కనీసం పేరైనా విన్నావా?" అని ఈసడించారు.

వ్యక్తిగతంగా ఎన్ని దుర్భాషలాడినా ఇన్నాళ్లు పడివున్నాడు. దేశాన్ని కించపరిచేసరికి అబ్దుల్‌లోని దేశాభిమానం పడగ విప్పి బుసలుకొట్టింది. "మీ బోర్డుతో ఆడడం తప్పే. అంత చిన్న విషయానికి అంతంత మాటలు ఉపయోగించడం మంచిదికాదు. బోర్డు తిప్పి చూడండి" అంటూ బోర్డు మీదున్న 'మేడ్-ఇన్ ఇండియా' అనే అక్షరాలు చూపించాడు. తనతో ఓ ఆట ఆడిచూడమని, తను ఓడిపోతే ఓ నెల జీతం వదలేసుకుంటానని ఆ కుటుంబాన్ని ఛాలెంజ్ చేశాడు. ఆఫీసరుగారి పెద్ద కొడుకు ఛాలెంజ్ అందుకుని గేమ్‌వేసి అబ్దుల్ చేతిలో చిత్తుగా ఓడిపోయాడు. అతనికి ఎనిమిది పాయింట్లు, అబ్దుల్‌కి 29 పాయింట్లు వచ్చేయి.

గబగబా ఆఫీసరుగారి భార్య మేడమీదికెళ్లి 1500 పట్టుకొచ్చి అబ్దుల్‌కివ్వబోయింది కానీ "నా పరువు, నా దేశం పరువు దక్కింది. అంతేచాలు. నాకీ డబ్బొద్దు" అన్నాడు అబ్దుల్. అయినా ఆవిడ "పందెం పందెమే, నువ్వీడబ్బు తీసుకోకపోతే అల్లా మమ్మల్ని శిక్షిస్తాడు" అంటూ డబ్బు తీసుకునేదాకా వదల్లేదు.

మర్నాటినుండి అంతా మారిపోయింది. అబ్దుల్‌ని తమ కుటుంబంలో ఒకడిగా చూసుకుంటూ మర్యాద చేస్తున్నారు. కారమ్స్ చేసిన మేలుని తల్చుకుని మహదానందపడిపోయాడు అబ్దుల్.

## పరోపకారార్థి

తమిళనాడుకి చెందిన శ్రీనివాసన్ వృత్తిరీత్యా ఇంజనీరు. డబ్బు బాగానే సంపాదించినా అమాయకుడైన సగటు మానవుడే అతను. ఈర్ష్యాసూయలకు పెట్టింది పేరైన వ్యాపారస్తుల చేతుల్లో మోసపోవడం భరించలేని వ్యక్తిత్వం శ్రీనివాసన్‌ది.

అందరిలాగే శ్రీనివాసన్ కూడా మార్వాడీలవద్ద డబ్బు అప్పుతీసుకోవాల్సి వచ్చింది.



దాంతో వాళ్ళ చక్రవడ్డీ రేట్లు ఎంత ఎక్కువగా వుంటాయో తెలిసి వచ్చింది.

ఎంతమంది అమాయక ప్రజలు ఈ వడ్డీ వ్యాపారస్థుల కోరల్లో చిక్కుకుని అష్టకష్టాలు పడుతున్నారో అతనికి తెలిసి వచ్చింది.

అందుకు పరిష్కారంగా అతనో ఫ్లయింగ్ స్క్వాడ్ ఏర్పాటు చేశాడు. ఎక్కడన్నా అన్యాయం జరుగుతోందన్న వార్త తెలిస్తే చాలు శ్రీనివాసన్ ఫ్లయింగ్ స్క్వాడ్ హుటాహుటిన బయల్దేరి వెళ్తుంది. అదీ ఏ మార్వాడీయో అయితే అతని షాపు ముందు గాంధేయ పద్ధతిలో సత్యాగ్రహం చేసి విజయం సాధిస్తుంది స్క్వాడ్. ఒక్కోసారి అంత అవసరం కూడా వుండదు. శ్రీనివాసన్ ఓ ఫోన్ చేస్తే చాలు అన్నీ సర్దుకుంటాయి.

ఇంజనీరింగ్ చదువుకునే రోజుల్లో ఓ పెద్ద భవంతి కూలి 14 మంది మరణించడం కళ్ళారా చూసిన శ్రీనివాసన్ మిగతా అందరిలా వూరుకోక ఆ భవంతి కూలడానికి వెనకనున్న కారణాన్ని వెలికి తీశాడు.

బిల్డింగ్ పడడానికి కారణం దాన్ని కట్టించిన ఇంజనీరు కాదనీ, సిమెంటులోని కల్తీవల్లే కట్టుదిట్టంలేకుండా పోయిందనీ తెల్సుకున్నాడు. నేరస్థుల్ని కోర్టుకెక్కించడానికి కూడా సిద్ధపడ్డాడు. కానీ న్యాయశాస్త్రంలో వున్న అవకతవకల వల్ల వాళ్ళు తప్పించుకున్నారు.

ఆకాశహర్మ్యాలు, వివిధ అంతస్థుల భవనాల నిర్మాణానికి శ్రీనివాసన్ పూర్తి వ్యతిరేకి. వాటిమూలంగానే సిమెంట్‌కి గిరాకీ పెరిగి అవసరానికి అందుబాట్లో లేకుండా పోతోందన్నది అతని వాదన. కంట్రాక్టర్లు సిమెంటు రంగురాళ్ళను తెచ్చి పొడిచేసి సిమెంటులో కలిపి డబ్బు చేసుకొంటున్నారు. కానీ నష్టపోయేది సామాన్య మానవుడేగాని కంట్రాక్టరు కాదుగదా!

ఇంత నిస్వార్థ సేవచేస్తున్న శ్రీనివాసన్ తను చేసిన సహాయనికి ప్రతిఫలంగా ఒక్క పైసా కూడా తీసుకోడు. ఎవరెన్ని విధాలా ప్రతిఫలం ముట్టజెప్పబోయినా అతను ప్రలోభపడలేదు. తన సహచరుల నిజాయితీతో కూడిన సమిష్టికృషే తన విజయానికి కారణమంటాడు శ్రీనివాసన్.

హోటల్ తిండిరేట్ల తగ్గింపుకు మద్దతుగా ఉద్యమించడం, పర్కాటు రూల్ అన్న బ్యాంకు సిద్ధాంతానికి వ్యతిరేకంగా ప్రదర్శనలు జరపడం, దొంగ రేషన్ కార్డుల సరఫరా, తప్పు తూనికరాళ్ళను వాడి సరుకును తక్కువ తూచడం వంటి వాటిని ఓ కంట కనిపెట్టడం శ్రీనివాసన్ సాధించిన విజయాల్లో కొన్ని.

సిమెంటు కోటా విషయంలో తహశీల్‌దార్ ఆఫీసులో జరిగే అవినీతిని అరికట్టడానికి పెద్దఎత్తున చర్యలు తీసుకోడానికి పథకం వేస్తున్నాడు.

శ్రీనివాసన్ కూతురు అపరాజిత తమిళనాడులో పేరున్న మంచి క్రీడాకారిణి.

శ్రీనివాసన్ ఆదాయంలో ఎక్కువ భాగం సంక్షేమ కార్యక్రమాలకే పోతుంది. అచ్చు పాఠ్య పుస్తకాలను కొనిచ్చి వందలాది విద్యార్థులకు సహాయం చేస్తున్నాడు.

*




రేపటి
మనిషి
జి.హేమంత

జలపాతపు హోరులా స్మిత నవ్వు ఒక్కసారిగా ఆ గదంతా వ్యాపించ టంతో ఉలికిపాటుతో చూసాడు అరవింద్.

"నీకు వేళాకోళంగా ఉందా స్మితా! కాస ఆలోచించు..." అంటూ అంత లోనే తగ్గిపోయిన అరవింద్ వంక నిశి తంగా చూసింది స్మిత.

"అరవింద్! వేళాకోళంకాదు. నిజం గానే నీ మాటలు నవ్వు తెప్పిస్తున్నాయ్. లేకపోతే ఏమిటి చెప్పు. నన్ను పెళ్లి చేసుకొంటావా? అలా అని నన్ను నమ్మ మంటావా? నువ్వెందుకలా అంటున్నావో తెలుసుకోలేనంత మూర్ఖురాలనైతే ఇలా ఎలా బతకగలుగుతాను చెప్పు. అయినా ఎందుకొచ్చిన మాటలివి. యు ఆర్ ఆల్వేస్ వెల్‌కమ్ అరవింద్! నన్ను నన్నుగా ఇలాగే ఉండనీ... అందువలన నీకొచ్చిన నష్టమేమిటో నాకు తెలుసు. నీలాభం కోసం పెట్టుబడిని కాలేను నేను. నీలాంటి వాళ్ళని ఎలా చూడాలో, ఎలా రిసీవ్ చేసుకోవాలో నాకు గాక మరెవరికి బాగా తెలుస్తుంది. ఇహ ఆ విషయం మరచిపోయి, హాయిగా జీవితాన్ని ఎంజాయ్ చెయ్యి" పదునుగా ఉన్న ఆ మాటల్లోని నిశ్చలత అతణ్ని బెదిరిపోయేటట్లు చేసింది.

"స్మితా! మరోసారి ఆలోచించుకో! కోరివస్తున్న అవకాశం వదులుకోకు. తరువాత విచారిస్తావ్" కోపంగా లేస్తూ అన్నాడు.

"నాట్ ఎటాల్! ఇంతవరకూ నాకా అవసరం రాలేదు. ఇకముందు రాదని నిశ్చయంగా చెప్పగలను. ఇప్పుడు నీవన్నదానికి ఒప్పుకుంటే మాత్రం తప్ప కుండా ఆ పరిస్థితి వస్తుంది. అయినా నాకు తెలియక అడుగుతాను నువ్వి అవ కాశాన్ని మరొకరికెందుకివ్వకూడదు?" హేళనగా అడుగుతున్న స్మితను చూసి ఒళ్లు మండి బూటు కాళ్లతో గట్టిగా నేలను తాటిస్తూ వెళ్లిపోయాడు అరవింద్.

'పూర్ మాన్!' స్వగతంగా అనుకుని అలసటగా మంచం మీద వాలిపోయింది. స్మిత.

* * *

టాక్సీ వచ్చి ఆగడంతో ఆ వీధిలోని వారు దాని చుట్టూ మూగిపోయారు. కొంత మంది గుమ్మం దగ్గరే నిలబడి చూడటం మొదలుపెట్టారు. వెనుక డోర్ తెరుచు కుని ఓ అందమైన అమ్మాయి...ఆ వెనుక మెడలో స్టెత్‌తో, చేతిలో మెడికల్ కిట్‌తో ఓ డాక్టరు దిగారు.

ఏ సినిమా యాక్టరో, ఏ జమిందా రిణియో దారి తప్పి ఇటు వచ్చినట్లు అంతా ఆశ్చర్యంతో నోళ్లు వెళ్లబెట్టి చూస్తున్నారు. వీధి వరండాల్లో కూర్చుని ఇదే చూస్తున్న మగవాళ్ళను పిల్చి ఏదో మాట్లాడింది. వాళ్లు ఆశ్చర్యపోతూ వినయంగా తలూపుతున్నారు.

తర్వాత వాళ్లే లోపలికి వెళ్ళి ఆడ వాళ్లను తీసుకు వచ్చారు. కొంతమంది అనుమానంగా చూస్తుంటే, మరికొంత మంది ఆశ్చర్యంగా విన్నారు. "కమాన్ డాక్టర్!" అంటూ ఓ ఇంటిలోకి నడి చిందామె. ఆ ఇంటి యజమానురాలు వారిని అనుసరించింది.

ఒకొక్కర్నే పరీక్షించి మందులు రాస్తున్నాడు డాక్టర్ నిర్వికారంగా.

"డాక్టర్! మీదగ్గరున్న మందులివ్వండి. రాసి ఇచ్చి వెళ్లిపోతే అంతే అవి" అంది స్మిత అనబడే ఆవిడ. డాక్టర్ పేరు మిత్రా.





కొన్ని జతల కళ్ళు కృతజ్ఞతగా చూసాయి స్మిత వైపు. అందులో కాస్త చామన ఛాయగా, వత్తయిన తలకట్టుతో ఉన్న ఓ అమ్మాయి బాదంకాయల్లాంటి విశాలమైన కళ్ళల్లో క్షణంలో ఊరిన నీటిపొర స్మిత మనసును స్వాతి జల్లులా తాకింది.

అమ్మాయిలంతా మర బొమ్మల్లా పలుకూ వులుకూ లేకుండా చిత్రంగా చూస్తూ వెళ్ళిపోయారు. తన పనయిపోయి నట్లు లేచి నిలబడ్డాడు మిత్ర.

"ఈ డాక్టరుగారు వారంవారం వస్తారు మందులతోసహా! కాస్త జాగ్రత్తగా ఉంటే మనఆరోగ్యాల్ని మనం కాపాడుకోవచ్చు. మీకేం అభ్యంతరం లేదుగా!" అంది స్మిత.

"అబ్బే... అదేం లేదమ్మా! ఏదో చిన్నవాళ్ళం. మాకు ఖరీదయిన మందులు, డాక్టర్లు ఎలా వస్తారు? మీరేదో దయతలచి చేస్తామంటే అంతకన్నానా" భయంగా అంది వారిలో ఒకత్తె.

ఆ వాడలోనే మరికొన్ని ఇళ్ళు చూసి, అందరికీ మందులిచ్చి వెనక్కి బయలుదేరారు. డాక్టరు ఖాళీ అయిన మందుల పెట్టెతో కారు ఎక్కాడు.

సీటుకు చేరబడి కళ్ళు మూసుకొన్న స్మిత మొహం చూస్తుంటే డాక్టర్‌లో ఆలోచనలు రేగాయి.

'ఈ అమ్మాయి ఎందుకిలా చేస్తోంది? ఎవరి స్వార్థం వాళ్ళు చూసుకోవడానికే టైం చాలక చస్తున్న ఈ రోజుల్లో తన స్వంత పనిలా తనకోసమే చేసుకుంటు న్నంత ఆనందంగా తన డబ్బుతో ఈ పని ... అందునా బజారు వేశ్యల్ని ఆరోగ్యవంతుల్ని చేసే పని ఎలా చేయ గలుగుతోంది? సంఘ సంస్కర్తలు కూడా చేయలేని, కనీసం ఊహించను కూడా లేని ఈ ఆలోచన ఈ అమ్మాయి మనసులోకి ఎలా వచ్చింది? నిజానికి డాక్టరుగా తాను మాత్రం తనకు ఆఫర్ చేసిన జీతానికే ఈ పని చేస్తున్నాడు గాని వాళ్ళను ఉద్ధరిద్దామని మాత్రం కాదే? తన దారిద్ర్యం, బాధ్యతలు, నిరు ద్యోగం...తననీ పనికి తలవంచేలా చేసాయి గానీ లేకుంటే ఏ వాడ పేరు పబ్లిగ్గా చెప్పడానికి సిగ్గుపడతారో, ఎవరిని తలచుకుంటేనే అసహ్యించుకుంటారో అటువంటివారికి వైద్యం చెయ్యడానికి తనుమాత్రం వస్తాడా?' అనుకుంటున్నాడు డాక్టర్ మిత్ర.

ఊరికి దూరంగా విసిరివేయబడ్డ ట్లున్న ఆ వాడ నుండి ఇరుకు మార్గంలో గతుకుల మధ్య ప్రయాణం చేస్తున్న కారులో ఆ కుదుపులకి కదులుతున్నది శరీరమే కాదు మనసు కూడా అన్నట్లు మిత్ర నిద్రపోతున్న మనసు మేలు కుంది. నిశ్చింతగా నిద్రపోతున్న ఆ అమ్మాయిని చూస్తుంటే అసహ్యం వెయ్యలేదు సరిగదా ఆశ్చర్యం వేస్తోంది. 'ఈ పనికి' ఒప్పుకోవలసి వచ్చిన రోజున తను పడిన బాధ గుర్తుకు వచ్చింది. ఆవిడేదో జమిందారిణిలా, తను ఆమె ఫామిలీ డాక్టరులా అనిపించిం దతనికా క్షణంలో.

కారు గతుకులన్నీ దాటి తారు రోడ్డు ప్రవేశించి స్పీడందుకొంది.

* * *

"ఏమిటీ ఏదో సంస్కరణలు మొదలుపెట్టావట? జోగీ, జోగీ రాసు కుంటే బూడిద రాలినట్లు నువ్వు వాళ్ళని వుద్ధరించటం బావుంది" పకపక నవ్వుతూ, వెటకారంగా అంటున్న

సేఠ్‌ని చూస్తుంటే వళ్లు మండింది స్మితకు.

"ఎందుకు బాగోదు? మీ జాతివాళ్లని మీరు వుద్ధరించుకోవడంలే!" నెమ్మదిగా డ్రింక్ సిప్ చేస్తూ అంది స్మిత నిదానంగా.

"స్మితా! నీలాంటిదానివి వెళ్ళవలసిన చోట్లు కావవి. ఎవరికోసం వెళ్లాలక్కడికి? నువ్వు దేవతవి. మాకు స్వర్గాన్నందించే వూర్వశివి!" మత్తు మత్తుగా అంటూ ఆమె ఒడిలో వాలిపోయాడతను!

"ప్లీజ్! మరో సారినా దగ్గరకు రావాలనుకుంటే ఈ టాపిక్ మానెయ్. ఎవరికోసమా? నా అక్కచెల్లెళ్లకోసం, నాలా రక్తమాంసాలు అమ్ముకుంటున్న దీనుల కోసం, పతనంచెంది ఆఖరికి కుళ్లిన పళ్లలా ఏ చెత్తకుండీలలోనో రాలిపోయే, నా అక్క చెల్లెళ్ళకోసం నేను చెయ్యగలిగింది ఏ కొద్దిగ వున్నా చేస్తాను..."

"అందరిలా నేను ఆహుతి అయిపోను. మాలాంటివాళ్ళం దిక్కుమాలిన చావు చావనక్కరలేదనీ నిరూపిస్తాను" ఇక ఆ సంగతి ఎత్తే ప్రసక్తి లేదన్నట్లు స్థిరముగా, గంభీరంగా అని సిగరెట్ వెలిగించుకొంది స్మిత.

"ఆడదాని దగ్గర 'శీలం' అనే ఆస్తి వున్నప్పుడు మగ'కుక్క'ను చూసి, కూడా భయపడుతుంది. 'దాన్నే' బజారులో పెట్టి అమ్ముకొని డబ్బు చేసుకొంటున్న నాలాంటిదానికిభయం ఎందుకు?మేమెవరికీ భయిపడం. మమ్మల్నే చూసి ఈ సంఘం భయపడుతుంది... మీలాంటివాళ్లు భయపడతారు. కనుక 'భయం' అనే పదం లేనేలేదు మా జీవితాల్లో. అనుభవాలతో పండిన శరీరం ఇది. అందుకే ఇంత గట్టిగా, ఆరోగ్యంగా వుంది. నేను చేయాల్సింది చాలావుంది...చేస్తాను... చేసి చూపిస్తాను. మరెప్పుడూ ఈ సంగతి ఎత్తకు. నీక్కావలసింది నేను. నేనేమీ అందని చందమామను కాదు. నీ డబ్బు నాది...నా అందం నీది. అంతే!" సీసాలో మిగిలిన ద్రవాన్ని కసిగా గొంతులో పోసుకొని మత్తుగా కళ్లు మూసుకుంది స్మిత.

* * *

నిద్రలేచి వాచీ చూసుకొంది స్మిత. మధ్యాహ్నం రెండవుతోంది. బయట ఎండగా, లోపల చల్లగా వుంది. ఎయిర్ కూలర్ వున్నగది అది. గదంతా అందముగా అభిసారికలా వుంది. ముందు విశాలమైన డ్రాయింగ్‌రూమ్. దాన్నానుకొని బెడ్‌రూమ్. మరోపక్క డైనింగ్ రూమ్, కిచెన్. ఇంతే... అయితేనేం; డ్రాయింగ్‌రూమ్‌లో వుంటే ఇంద్రభవనం లాగా, బెడ్‌రూమ్‌లో వుంటే మయసభలో వున్నట్టూ ఉంటుంది. నవ్వుకొంది. ఇవన్నీ సంపాదించడానికి ఎంత కష్టపడింది తను. సంపాదించాక ఎంత సుఖంగావుంది. చాలు... ఈ హంగు చాలు.... తనక్కావాల్సిన డబ్బు సంపాదించడానికి తన ఆశయం నేరవేర్చుకోవడానికీ.ఒక రాత్రికి ఎంతలేదన్నా వెయ్యి రూపాయలొస్తాయ్! హు! తన రేటు వెయ్యిరూపాయలు. దేనికి... ఈ హంగులు చూసి. లేకపోతే ఏ పదో, ఇరవయ్యో తన మొహాన పారేసిపోతారు. తనలో అందం ఉన్నంతవరకూ తనకు ఫరవాలేదు. ఈలోపే జాగ్రత్తపడాలి.

ఉన్న ఈ అందాన్ని ఎలా కాపాడుకోవాలో తనకు తెలుసు. ఇవేమీ తెలియని అభాగినులు ఎలా కుళ్లిపోయి రాలిపోతున్నారు! వారికోసం తను చేతనయినంత

వరకూ చేస్తుంది. ఏ కొందరి మనస్సుల్లో నయినా, జీవితాల్లోనయినా జ్యోతి వెలిగిస్తుంది. మనిషిగా పుట్టినందుకు ఆ మాత్రం చేసి తీరాలి. సోఫాలో చేరబడి ఆలోచనల్లో మునిగిపోయిన స్మిత "జ్యూస్!" అన్న మాటకు ఈ లోకంలోకి వచ్చింది. ఏపిల్‌జ్యూస్ అందుకునితాగి "ఎలీజా! నేను నిద్రపోతాను. ఎవరొచ్చినా సరే సాయంత్రం ఆరు గంటలకు రమ్మను. నన్ను సరిగ్గా అయిదుగంటలకు లేపు!" బెడ్‌రూమ్‌లోకి వెళ్ళబోతూ అంది.

"ఎస్...మిస్!" నమ్రతగా గ్లాసు అందుకొంది ఎలీజా.

ఒక్క క్షణం పరికించి చూసింది ఎలీజాను! ఆ మొహంలో ఏ భావం కనుపించలేదు.

అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయింది ఎలీజా. చల్లని ఎ. సి. గదిలో డన్‌లప్ బెడ్‌మీద పడుకొందన్న మాటేగాని రోజులా నిద్రపట్టలేదు. తెల్లగా, సన్నగా, పొడుగ్గా, సాపుగా, చెక్కబొమ్మలా వున్న ఎలీజా రూపమే కళ్ళ ముందు నిలుస్తోంది.చిన్న చిన్నరాగి కళ్ళతో తల వంచుకొన్నపుడు మెరిసే ఎర్రని జుట్టు, కాటన్ ఫ్రాక్‌కి ఏప్రాన్ కట్టుకొని నీట్‌గా కనుపిస్తూ ప్రేమతో,అభిమానంతో పెట్టే భోజనం, తన మాట విన్నప్పుడు కళ్ళల్లో కదిలే భక్తి విశ్వాసాలు ఎలీజా మీద ఉన్న జాలి, ప్రేమలను అధికం చేస్తుంటాయి. తనకో ఆంగ్లో ఇండియన్ అమ్మాయి కావాలని ఆ హోటల్ ప్రొప్రయిటర్‌ని అడిగితే...ఈ అమ్మాయిని పంపించాడు. నిజానికి తను ట్యూటర్‌గా పెట్టుకోవాలనుకుంది. కానీ ఈమె తన చరిత్ర అంతా చెప్పుకుని కళ్ళల్లో నీళ్ళతో అర్థిస్తుంటే వదలలేక తనవద్దే ఉంచేసుకుంది.

"మీ పనంతా చూసుకుంటాను. వంట చేస్తాను. ఇంట్లో నాకింత తిండి, బట్ట ఇస్తే చాలు!" అన్నప్పుడే ఆశ్చర్యపోయింది తను.

"ఎప్పటికీ ఇలాగే వుండిపోతావా?" ఆశ్చర్యంగా అంది స్మిత.

"నో మిస్! ఎప్పుడయినా మంచి అబ్బాయి కనబడితే మారేజి చేసుకుంటాను!" తలవంచుకొంటూ అంది.

ఆరోజు నుండి స్మితకు ఏ క్షణంలో ఏం కావాలో, ఏం చెయ్యాలో డైటింగ్ దగ్గర నుండి ఎక్స్‌ర్‌సైజ్ వరకూ అన్నీ ఎలీజా చూసుకుంటోంది. అప్పుడప్పుడు మత్తులో కూరుకుపోయినప్పుడు చేయరాని పనులు కూడా చేస్తుంది. ఆ సమయంలో ఎలీజా 'ఫ్లారెన్స్ నైటింగేల్'లా కనిపిస్తుంది ఆ మత్తుకళ్ళకు. ఎలీజావల్ల స్మితకు కావలసిన ఇంగ్లీషు సులభంగా వచ్చేసింది. ఎలీజా స్మిత ఇంటికొచ్చిన ఎవరికంటా పడదు. ఎప్పుడో పొరపాటున పడినా పొడుగ్గా, గెడకర్రలా వుండి ఏ ఆకర్షణాలేని ఆ పిల్లను పట్టించుకోరెవరూ.




మంచం పక్కనే గోడకమర్చిన మ్యూజి




కాల్ బెల్ మోగింది. బద్ధకంగా కళ్ళు తెరిచింది స్మిత. బెల్ మోగిందంటే లేచే టైమయిందన్నమాట. వెంటనే లేచి కూర్చుంది.

వుడుకులోన్ కలిపిన గోరువెచ్చటి నీరు స్నానానికి రెడీచేసి వుంచింది ఎలీజా. సన్నటి పరిమళంతోవున్న నీరు శరీరం మీదనుండి జారిపోతుంటే ... ఆ హాయి అనుభవిస్తూ వుండిపోయింది కొద్ది సేపు.

స్నానంచేసి వచ్చేసరికి ఆమ్లెట్, బోర్న్‌విటా తెచ్చి అందించింది. అవి తీసుకుని డ్రెస్సింగ్ టేబుల్ ముందు కూర్చుంది.

ప్రశ్నార్థకంగా చూసింది ఎలీజా!

"చీర, స్లీవ్‌లెస్ బ్లౌజ్ తియ్యి" అంది సమాధానంగా.

గోడకమర్చిన బీరువా తెరచింది. అందులో అన్నిరకాల డ్రెస్‌లు వరుసగా అమర్చివున్నాయి. చీరలు, జాకెట్ల దగ్గర నుండి మినీ స్కర్ట్, పైజామా, జీన్స్ వరకూ అన్ని రకాలూ వున్నాయి. వచ్చే వాళ్ల టేస్ట్‌ని బట్టి డ్రెస్ చేసుకోవడం స్మిత ప్రత్యేకత! అందుకే అంతడిమాండ్.

మజంతా కలర్ అమెరికన్ జార్జెట్ చీర, అదే రంగు స్లీవ్‌లెస్ బ్లౌజ్ తీసింది. బ్రష్‌చేసి జుత్తు అలా వదిలేసింది. చెవి పక్కగా పిన్నుతో డాలియా ఫ్లవర్ అదే రంగుది పెట్టుకొంది. పెదవులకు మజంతా కలర్ లిప్‌స్టిక్ లైట్‌గా టచ్‌చేసి వదిలేసింది. మెడలో ఆర్టిఫిషియల్ ముత్యాల దండ, తెల్లని పాలరాయి లాంటి శరీరం మీద ఆ 'మజంతా' కలర్ చిత్రంగా చుట్టుకొని మూసివేసింది. ఆ రంగుల కలయిక ఒక్కక్షణం కన్ను చెదిరేలా చేసింది. అద్దంలో చూసుకొంది ఆఖరు సారిగా! తెల్లగా, కొద్దిగా కోలగా వున్న మొహంలో కోలగా వున్న కళ్లు ప్రత్యేకంగా మెరుస్తున్నాయ్! ఆరోగ్యంగా వుందనడానికి నిదర్శనగా స్వచ్ఛంగా మెరిసే కనుపాపలు, పూరేకుల్లాంటి మృదువైన చెంపలు, నునుపైన మెడ, మలచిన శిల్పంలాంటి శరీరాకృతి...ఎదురుగా కనబడుతున్న ప్రతిరూపాన్ని తృప్తిగా చూసుకొని డ్రాయింగ్ రూమ్‌లో కొచ్చి సోఫాలో కూర్చుంది. సరిగ్గా ఆరు గంటలు కొట్టింది మ్యూజికల్ వాల్‌క్లాక్. ఎలీజా వచ్చి రేడియోగ్రామ్ పెట్టింది. లైట్‌గా వెస్ట్రన్ మ్యూజిక్ మెల్లగా గదంతా వ్యాపించింది. హాయిగా వుంది. ఏ ఆలోచనా లేకుండా ఫ్రెష్‌గా విరిసిన గులాబీలా కూచుంది 'ఈవ్స్ వీక్లీ' తిరగేస్తూ!

ఫోన్ రింగయింది.

"డాక్టర్‌గారు ఫోన్ చేసారు" రిసీవరు అందించింది ఎలీజా.

"హల్లో! స్మిత హియర్! హల్లో డాక్టర్ మిత్రా! గుడీవెనింగ్!"

"రేపు ఉదయం సరిగ్గా పది గంటలకు రండి. నేను వస్తున్నాను మీతో! మెడిసిన్స్ కూడా పట్టుకురండి. మిగతా విషయాలు రేపు మాట్లాడతాను. ఓ.కే!" అంటూ ఫోను పెట్టేసింది.

"డిన్నర్ రెడీ చెయ్యి ఎలీజా! నాకు గ్రేప్‌జ్యూస్‌చాలు. ఎవరు వచ్చినా, ఫోన్ చేసినా లేనని చెప్పు!" అంటుండగా వాకిట్లో కారు ఆగిన చప్పుడు వినిపించింది.

"వచ్చినట్లుంది! కూల్ డ్రింక్స్ పంపించు!" అని చెప్పేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

ఎప్పుడు ఎవరు వచ్చినా రాగానే

కనబడదు స్మిత. అతిథి మర్యాదలు జరిగాక ఎంతో ఠీవిగా వస్తుంది. ఫామిలీ వాతావరణం కల్పిస్తుంది. అందుకే వచ్చినవాళ్లు తమ ఇంటి మీదున్న అస హ్యాన్ని, ఈ ఇంటి మీదున్న మోజును సమన్వయ పరచుకొని పాపభీతిలేకుండా, తాము కలలుగన్న స్వర్గం లాంటి స్వగృహం ఇదే అనుకొని.. హాయిగా, నిశ్చింతగా, మనస్ఫూర్తిగా ఆనందిస్తారు. ఏదో డబ్బు పారేస్తే దొరికే సుఖం అనుకోరు. తమ స్వంత ఇంటిని విడిచి వెళ్లిపోతున్నంతగా బాధపడతారు వెళ్ళే ముందు. ఒక్క రాత్రి స్మితతో గడ పడం అంటే ఆ జన్మకు బంధం ముడి పడినట్లే భావిస్తారు. అందుకే ఎంత ఖర్చయినా మళ్ళీ మళ్ళీ వస్తుంటారు.

కూల్‌డ్రింక్స్ తెచ్చి టీపాయ్ మీద పెట్టి వెళ్ళింది ఎలీజా!

'ఏదీ' అన్నట్లు చూసాడు ఆ వచ్చి నతను. అతనో పెద్ద సంస్థకు మేనేజింగ్ డైరెక్టరు.

'వస్తుంది' అన్నట్లు చూసాడు వెంట బెట్టుకు వచ్చిన మనిషి.

"నమస్కారం ! " అన్నమాటకు వులిక్కిపడి ఇటు తిరిగారిద్దరూ.

కన్నుచెదిరే ఆ ఆకర్షణకు రెప్ప వెయ్యడం కూడా మరచిపోయి చూస్తుండి పోయారు.

"నమస్కారం !" చిన్నగా నవ్వి మరోసారంది.

ఎర్రని పెదవుల మధ్య తళుక్కు మంది ముత్యాల సరం లాంటి పలువరస.

తత్తరపడి......

"నమస్కారం !" అన్నారిద్దరూ ఒకేసారి.

'ఇవేమి మర్యాదలు... తనెక్కడా





చూళ్లేదే ? ఇంతకీ ఈవిడేనా...వీడేం మోసం చెయ్యలేదుగదా!' పరిపరి విధాల పోతున్న మనసు... "నేను వస్తానుసార్. వుదయం వస్తాను మళ్లీ" అన్న మాటలతో వులిక్కిపడింది.

ఆ చూపు చూసి నవ్వుకొంది స్మిత!

కవర్‌లో పేక్ చేసిన డబ్బు స్మిత చేతికిచ్చి బయటకు నడిచాడు – ఆ వెంట వచ్చినతను.

స్మిత బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయింది.

బిక్క మొహం వేసుకొని చుట్టూ చూసాడు.

అయిదు నిమిషాలు పోయాక...

"అమ్మగారు రమ్మంటున్నారు !" అని పనిపిల్ల వచ్చి చెప్పేసరికి–

"అబ్బ! ఏంమర్యాదలు...ఏంపోజు!"

"కమిన్!" సన్నని గొంతు తీయగా పలికింది.

తలుపు తోసుకొని లోపలికి అడుగు పెట్టాడు. ఎదురుగా మల్లెపూల గుట్టమీద గులాబీల గుత్తిని పేర్చినట్లు తెల్లని పరుపు మీద స్మిత. డిమ్‌గా వెలుగుతూ సన్నని కాంతి ప్రసరిస్తున్న లేత నీలి రంగు బల్బ్...బల్లమీద బాటిల్స్, ఐస్, కట్‌లెట్స్! ఇందాక ఉన్న గంభీరత లేదు స్మిత మొహంలో! చిలిపిగా నవ్వుతూ అతని చెయ్యి పట్టుకొని పక్కనున్న సోఫాలో కూర్చోబెట్టింది.

* * *

ఉదయం ఎనిమిది గంటలకు బద్ధకంగా కళ్లు తెరిచిన స్మితకు ఎదురుగా కాఫీ కప్పుతో నిలబడ్డ ఎలీజా కనిపించింది.

"థేంక్యూ!" అంటూ అందుకొంది. అప్పటికే గదంతా నీట్‌గా సర్దివుంది. రాత్రి ఛాయలు మచ్చుకయినా లేవు. క్షణంలో సగంసేపు గదంతా పరుగెత్తిన చూపు ఎలీజా మీద స్థిరంగా నిలిచిపోయింది. తరువాత తనను తాను చూసుకొంది. "హు! గదిమారిపోయింది. గడచిన రాత్రిని తనలో కలుపుకొని రానున్న రాత్రికి తయారయివుంది ఏమీ జరగనట్లే! తను.. తను కూడా ఈ గదిలాంటిదే. నిన్నటి వాసనలు, చెత్త, చెదారం తీసిపారేసినట్లు తనూ తుడిచి పారెయ్యాలి.

ఈ గది గోడల్లా తనూ స్థిరంగా చెక్కు చెదరకుండా వుండగలగాలి. ఎవరికెంత ఇవ్వాలో, తనెంత మిగుల్చుకోవాలో, ఇచ్చినదానికెంత పుచ్చుకోవాలో అన్నీ తనకు తెలుసు. అంతా లిమిట్. అందుకే... తను సదా నిత్య నూతనంగా నిగనిగలాడుతూ వుంటుంది. పూర్ మెన్ రాత్రి వచ్చిన ఆ పెద్దమనిషి కొంచెం తాగేసరికే అలసిపోయాడు. అందరిలా- వాళ్లు ఆడమన్నట్లల్లా ఆడి అలసిపోదు తను. వాళ్ళనే ఆడించి, పూరించి ఇవ్వవలసినంత వరకే ఇస్తుంది ...లేకపోతేనా ఇలా బతగ్గలదా? ఈ కామాంధుల చేతుల్లో నలిగి వాడిపోకుండా ఆరోగ్యంగా వుండగలదా? ఒక్కొసారి ఓడిపోతేనేం గాక, అదీ తప్పదు. అయినా ఫరవాలేదు...!

"మిస్! డాక్టర్ వస్తారు!" గుర్తు చేసింది ఎలీజా.

తేలిగ్గా లేచి బాత్‌రూమ్‌కి వెళ్లింది. స్నానముగించుకొని బయటకు వచ్చేసరికి ఎంతో తేలిగ్గా, హాయిగా అనిపించింది. టిఫిన్ ముగించి తయారయి సిద్ధంగా కూర్చునేసరికి తొమ్మిదిన్నర అయింది. హోటల్‌కి ఫోన్ చేసింది కారు పంపమని. మరో పావు గంటకల్లా జాన్ ఎర్రటి ఫియట్ కారుతో పాటు రాత్రికి ఎంగేజ్‌మెంట్ కూడా తీసుకుని వచ్చాడు. నవ్వుకొంది అది చూసి.

"మే ఐ కమిన్!" డాక్టరు గొంతు.

"యస్" అంటూ చూస్తున్న పుస్తకం పక్కన పెట్టి చిరునవ్వుతో తలెత్తింది.

లోపలికొచ్చి ఎదురుగా కూర్చున్న మిత్ర స్మిత చూసేలోపే ఆమెను నిశితంగా చూసాడు. లేత ఆకుపచ్చ రంగు జార్జెట్ చీర, అదే రంగు బ్లౌజు-నుదుట చిన్న చుక్కలాంటి ఆకుపచ్చ రంగు బొట్టు, చేతులకు ఆకుపచ్చ రంగు గాజులు- పచ్చని శరీరం మీద ఆకుపచ్చని రంగు.. పండిన మొక్కజొన్న చేనులా అనిపించింది.

పనిపిల్ల తెచ్చిన బ్రూ కాఫీ తాగాడు మౌనంగా!




"వెళ్దామా" అంటూ లేచింది.

మంత్రముగ్ధుడిలా అనుసరించాడు. ఆమె మాట్లాడదు. అతనికేదో మాట్లాడాలని వున్నా ఏం మాట్లాడాలో తెలీని నిస్సహాయత. కారు స్టార్టయింది. అలవాటయిన తోవలో నెమ్మదిగా తీసుకుపోతున్నాడు.

"డాక్టర్! ఏమన్నా ఇంప్రూవ్‌మెంట్ కనపడిందా?" వాళ్ల మధ్య అడ్డుగోడలా వున్న మౌనాన్ని ఛేదిస్తూ యధాలాపంగా అంది స్మిత.

"యస్ మిస్ ! చాలామంది పిక్అప్ చేసారు. అయితే కొందరి పరిస్థితి ఇంతకు ముందే చేయి దాటిపోయింది. వాళ్లకి లాభంలేదు. ఓ నలుగురయిదు గుర్ని రోడ్డు మీదకు తగిలేసే పరిస్థితి కనిపిస్తోంది వాళ్ళ వలన ఏ రాబడీలేదని. నన్ను కూడా చూడొద్దన్నారు కానీ మీరు చెప్పినట్లు వాళ్ళని పిడిచిపెట్టలేదు. మీరొచ్చే వరకూ వాళ్ళని ఎక్కడికి తర మొద్దని చెప్పాను" ఆశ్చర్యంగా చూసింది స్మిత.

"అలా ఎందుకు చెప్పారు? ఏం చేస్తాననుకొని అలా చెప్పారు?"

సిగ్గుపడిపోయినట్లు తలవంచుకొన్నాడు మిత్రా.

"సారీ మిస్! వాళ్లకోసం మీరేమయినా చేస్తారనిపించింది. అందుకే ధైర్యం చేసాను. ఐయామ్ సారీ మిస్!"

"ఏం చేస్తాననుకొన్నారు" రెట్టింపు ఆశ్చర్యంతో అంది స్మిత.

"ఇదంతా ఎలా చేస్తున్నారు ? ఎందుకు చేస్తున్నారు ? ఎవరూ వూహింపనుకూడా ఊహించలేని ఈ 'పని' మీరు మాత్రం ఎలా చేస్తున్నారు? ఏ శక్తి మీతో చేయిస్తోంది? అదే...అదే శక్తి దీనికీ పరిష్కారం చూపిస్తుంది. మీరు వదిలిపెట్ట లేరు. నాకు తెలుసు!" ఆవేశంగా అంటుంటే ఆ ఆవేశంలో అంతర్లీనంగా ప్రవహిస్తున్న ఆత్మీయత, అభిమానం, ఆరాధన ఆమె గుండెను సూటిగా తాకి కళ్ళల్లోకి నీరు తెప్పించాయి.

"డాక్టర్! మీ సహాయం ఉంటే నేనేమయినా చేస్తాను. మీ నమ్మకాన్ని వమ్ము చేయను!" స్థిరంగా అంది స్మిత.

దిగవలసిన చోటు వచ్చిందన్నట్లు కారు ఆపాడు జాన్. ఇద్దరూ దిగి చకచకా నడిచారు. ఆ ఇంట్లో అడుగు పెట్టగానే పంకజవల్లి, మాణిక్యం, రత్నమాల అంతా చుట్టుమూగారు. అమ్మాయిలంతా బిలబిల్లాడుతూ వచ్చారు.

మిత్ర చెకప్ ప్రారంభించాడు. స్మిత ఆలోచిస్తోంది. ఇందులో ఎంత మందికీవృత్తి ఇష్టం ? ఎంతమంది బలవంతంగా వుంటున్నారు ? ఇష్టపడే వాళ్ళను తనేం చెయ్యలేదు. అయితే బలవంతంగా ఉంచబడేవాళ్ల కోసం కాకపోతే...తన శ్రమంతా దండగే!

"అయిపోయింది" అన్నాడు మిత్రా.

"సరే. మీరు వెళ్ళి మిగతావాళ్లను చూసిరండి" అన్న స్మిత మాట విని కిట్ పట్టుకొని బయలుదేరాడు.

"నీ పేరేమిటి ?" ప్రశ్నించింది ఒకమ్మాయిని !

"జీవచ్ఛవాలకు పేర్లేముంటాయి" అంది నిర్లిప్తంగా.

"జీవచ్ఛవంలో 'జీవం' అనే పద ముంది గనుక పేరుంటుంది. చెప్పు చెప్పు...మాటలకేం ?" తేలిగ్గా అంది స్మిత.

"'జీవం, పేరు సరస్వతి. 'శవం' పేరు

'సరసు'' కళ్ళల్లో నీళ్లు గిర్రున తిరగ్గా బాధగా అంది.

"అరే...సరస్వతీ ! మాటిమాటికి కన్నీరు వేస్టు చేస్తున్నావ్! కన్నీళ్లు చాలా విలువయినవమ్మా. అవి కావాలంటే రావు. నాకు చూడు, కావాలన్నా ఒక్క చుక్క రావు. ఖర్చు పెట్టుకున్నవి తిరిగిరావాలంటే రావు. ఇలారా!" అంటూ గదిలోకిలాక్కు వెళ్లింది స్మిత.

ఒకే కిటికీ వున్న ఆ చీకటికొట్టు లాంటి గదిలో ఓ మూల మంచం, దాని మీద అక్కడున్న వాళ్ళ జీవితాలకి

 

ప్రతీకలా మురికి పట్టిన తెల్లటి దుప్పటి, గోడల నిండా నల్లుల్ని చంపిన మరకలు, ఓ మూల మకిలి పట్టిన అద్దం, దువ్వెన, చవుకబారు పౌడరు డబ్బా, అక్కడే తాళ్లు కట్టి వేలాడదీసిన దండెం మీద మాసిన సెకెండ్‌హాండ్ నైలాన్ చీరలు, 'బ్రా'లు... ఒక్క చూపులో అంతా మనసులో ముద్రించుకున్న స్మిత, తన గదితో పోల్చుకోకుండా వుండలేక పోయింది. 'తన ముందు ఈ అమ్మాయి ఎలా వుందో, తన గది ముందు ఈ గది అలానే వుంది!' అనుకొంది నిర్లిప్తంగా. ఒక్కక్షణం ఏదో కళ్లముందు కదిలి మనసుని కదిలించబోయింది.

"సరే సరస్వతీ! నీకి పని ఇష్టం లేనట్టుంది. అవునా? అవకాశం కల్పిస్తే కష్టపడి బతగలవా? లేకుంటే ఎండ కన్నెరుగకుండా ఒళ్లు మగ్గబెట్టుకొనే ఈ ఉద్యోగమే బాగుందా? బాగా ఆలోచించుకొని చెప్పు. అసలు నువ్వు ఇక్కడికెలా వచ్చావ్?" కుతూహలంగా అడిగింది స్మిత.

"ఏం చెప్పను. అదో పెద్ద కథ!"

"మనలాంటి ప్రతీవాళ్ళ వెనుక ఓ పెద్ద కథే వుంటుంది! చిన్న కథలయితే మనమెందుకిలా వుంటాం? చిన్న చిన్న కథలు జీవన సరస్సులో చిన్న చిన్న అలల్లాంటివి. అయినా అవి నిండుగా, పవిత్రంగానే వుంటాయి చూడు. సరసులాంటి పెద్దవాళ్లు నిండుగా పవిత్రంగానే వుంటారు. దానికేంగాని చెప్పు!" అంటూండగా...

"ఒక్కమాట అడుగుతాను ఏమీ అనుకోరుగా?" భయపడుతూ, బిడియంగా అడిగింది సరస్వతి.

"అడుగు!"

"మీరు... మీరెవరు? మీరెందుకిం శ్రద్ధ వహిస్తున్నారు మా మీద? మా ఆరోగ్యాలు కాపాడటానికి ఇంత డబ ఖర్చుపెట్టి ఇలా ఎందుకు చేస్తున్నారు?" గబగబా అడిగేసింది సరస్వతి.

"నేనెవర్నో తెలియడంలే! నేనూ మీలాంటిదాన్నే. కాకపోతే కొంచెం పెద్ద బిజినెస్ చేస్తున్నాను. మనుషుల్లో మూడు తరగతుల వాళ్ళున్నారు మూడు - గొప్ప వాళ్ళు, మధ్య తరగతివాళ్ళు, అట్టడుగువాళ్ళు అని. అట్లాగే మనలోనూ మూడు తరగతులు. నేను 'హై'క్లాసన్నమాట. మీరు మధ్యతరగతివాళ్ళు!"

"అంటే ఇంకా హీనంగా బతికేవాళ్ళున్నారా?" ఆత్రంగా అంది సరస్వతి.

"రూపాయికి, అర్థరూపాయికి, టిఫిన్ కోసం, ఆఖరికి ఓ కప్పు టీ నీళ్ళకోసం ఈ వృత్తి చేసేవాళ్ళున్నారు. మీ మధ్య తరగతి వాళ్ళకి కాస్తంత చేయూత ఇస్తే పైకి వస్తారు. నేను సంపాదించే డబ్బు తినడానికి ఎవరూ లేరు-నేను తప్ప. నా అవసరానికి మించి పదిరెట్లు ఎక్కువ సంపాదిస్తున్నాను. అదంతా ఏం చెయ్యాలి? సాటివాళ్ళకు కొంతయినా ఉపయోగపడితే నాకు వచ్చే జన్మకు కొంతయినా పుణ్యం జమ అవుతుందని చేస్తున్నాను. అంతే! ఒక్క రాత్రికి నాకు వెయ్యికాదు, రెండు వేలిమ్మన్నా ఇచ్చే మహానుభావులున్నారు. కాని ఒక్క మంచిపని తలపెట్టి చందాకు పది రూపాయలిమ్మంటే ఇస్తారా వీళ్ళు? ఇవ్వరు తల్లీ ఇవ్వరు. ఒకరి బలవంతం మీద ఈ వృత్తిలోకి దిగిన నీలాంటి వాళ్ళను పైకి తీసుకవెళ్ళి ఏదో మంచి మార్గంలో పెడదామనుకొంటున్నాను. దానికి మీ సహకారం కూడా కావాలి. ఏ కొద్దిమందయినా బాగుపడితే చాలు. నా ఆశయం నెరవేరినట్టే. జాగ్రత్తగా ఆలోచించుకొని చెప్పు! ఎందుకో నిన్ను చూస్తుంటే ఈ పనికి తగవేమోనని పిస్తోంది" తననే నిశితంగా చూస్తున్న ఆ అమ్మాయి కళ్ళలోకి సూటిగా చూస్తూ అంది స్మిత.

"ఈ నీచానికి తలవంచేకన్నా ప్రాణం పోవడం ఎంతో సుఖం అనుకొంటున్నాను. కానీ దానికీ అవకాశం ఇవ్వరిక్కడ. నన్నెలాగన్నా కాపాడండి. మీ కాళ్ళు పట్టుకొంటాను" చటుక్కున స్మిత కాళ్ళ దగ్గర కూలబడిఏడవడం మొదలుపెట్టింది. మిగతా అమ్మాయిలు విచిత్రంగా తొంగి చూసి వెళ్ళిపోతున్నారు.

పంకజవల్లి పైనున్న బ్రోకరుతో మాట్లాడుతోంది.

"త్వరగా చెప్పు! ఆలస్యమైతే అనుమానమొస్తుంది" తొందరచేసింది స్మిత.

"నాకీ జీవితంనుండి విముక్తి కలిగించండి. మీరు గర్వంగా తలెత్తుకు తిరిగేలా చేస్తాను. మీ ఉద్యమంలో ఓ చిన్న సమిధనై పోతాను. నన్నీ నరకం నుండి తప్పించండి" స్మిత కాళ్ళను చుట్టుకొని బావురుమంది సరస్వతి.

"సరే, రేపు నేను డబ్బు తీసుకుని వస్తాను విడిపించడానికి. అంతవరకూ ఏమీ అనకు" లేస్తూ అంది స్మిత.

"డబ్బా! ఎందుకివ్వాలి వీళ్ళకి? నేనేం వీళ్ళ సొంత మనిషినా నన్ను అమ్ముకోవడానికి. నన్నెవరూ కొనలేదు- ఇప్పుడు అమ్మటానికి. నావల్ల వాళ్ళే బాగా సంపాదించుకొన్నారు" ఆవేశంగా అంది.

"సరస్వతీ! నువ్వింకా బిజినెస్‌కికొత్త. నీకేం తెలియదు. నీకెందుకు. నిన్ను నేను తీసుకువెళ్తాగా!" అనేసి పైకి వచ్చేసింది. అంతలో డాక్టర్ మిత్రా పని ముగించుకు వచ్చాడు.

"యస్ డాక్టర్! ఎలావుంది. మీరేదో చెప్పారు. వాళ్ళెక్కడ వున్నారు? ఎంత

 

మంది వున్నారు?"

మొత్తం అయిదుగురున్నారు. రేణుక ఇక్కడే వుంది" అన్నాడు జవాబుగా. అక్కడే వున్న రేణుక స్మిత కాళ్ళను చుట్టేసింది బావురుమంటూ.

"లే...లే! నీకేం భయంలేదు" అంది లేవనెత్తుతూ.

"చూడు పంకజం! ఈ రేణుక వలన నీకేం లాభంలేదు కదా, నేను తీసుకుపోవచ్చా?" అంది కొర కొర చూస్తున్న పంకజంతో.

"దాన్ని మీరేం చేసుకొంటారమ్మా! పనిచెయ్యడానికైనా పనికిరాదు. తెగతాగి ఒళ్ళు పుచ్చబెట్టుకుంది. దానికి తిండి లేక పోయినా బాధలేదు. సారామాత్రం కావాలి. నేను పొయ్యలేను. తీసుకుపొండి; ఏం చేసుకుంటారో!" ఏహ్యంగా అంది పంకజం.

"నువ్వేనన్నిలా చేశావు. ఇప్పుడుపనికి మాలిన దాన్నయిపోయానా? నా ఒళ్లుగుల్ల చేసింది నువ్వుకాదూ! బాగున్నంత వరకూ నా మీద సంపాదించుకొని ఇప్పుడు పనికి రాలేదని ఇంత ముద్దవెయ్యడానికి కూడా ఈసడించు కొంటున్నావ్. కుక్కలా తరిమి కొడుతున్నావ్! నీకు పుట్టగతు లుండవే! వీధిలో అడుక్కు తినడానికి కూడా పనికిరాకుండా పోతావ్" ఆవేశంతో రొప్పుతూ కలియబడింది రేణుక.

"రేణూ! అనవసరంగా ఆవేశపడకు. మీలాంటివాళ్ళ ముగింపు ఇదేనన్న చరిత్రను మార్చు చేద్దామనే నా ప్రయత్నం. నాతోరా!" అంటూ లేచింది స్మిత. ఆశగా చూస్తున్న సరస్వతిని కళ్ళతోనే వారించి రేణుకను తీసుకొని కారు దగ్గరకు నడిచింది.

"డాక్టర్! మీరు వెళ్ళి ఆ మిగతా వాళ్ళను తీసుకురండి!" అంది కారెక్కుతూ!

"అందర్నీ ఒక్కసారే తీసుకెళ్ళి ఏం చేస్తారు? ఎక్కడ వుంటారు?" అన్నాడు సంశయంగా!

"బాధ్యత నెత్తిన పెట్టారుగా, తప్పుతుందా!" నవ్వుతూ అంది. ఆ మాటకి నొచ్చుకొన్నట్టు చూసాడు మిత్ర.

"సారీ మిస్!"

"నెవర్ మైండ్! సరదాగా అన్నాను. ఇది మీరు చెప్పకపోయినా నా తలకెత్తుకో వలసిందే! కాకపోతే కాస్త ముందుగా నా కళ్లు తెరిపించారు. వెళ్ళండి, త్వరగా రండి!" సీటుకు చేరబడి కూర్చుంటూ అంది.

పదినిమిషాల్లో ఇద్దర్ని తీసుకొచ్చి "రజని, మేనక" అంటూ పరిచయం చేసాడు.

'పేర్లకేం లోటు లేదు!' అనుకొంది స్మిత.

"వాణిని, మరకతాన్ని పంపడానికి గొడవ చేస్తున్నారండి! 'మీరు తీసుకువెళ్ళి బిజినెస్ చేయించుకోవాలనుకుంటున్నారా? అందుకేనా మెల్లమెల్లగా మందులిస్తామని వచ్చారు?' అంటూ తిరగబడుతున్నారు." వినయంగా అన్నాడు.

ప్రచండభైరవిలా ఒక్కుదుటున కారు డోర్ తెరుచుకొని దిగింది.

వాళ్ళిద్దర్నీ కార్లో కూర్చోమని సైగచేసి ఆరోగ్రదమూర్తి వెనకే వెళ్ళాడు డాక్టర్.

"మస్తానీ! నువ్వు మనిషివా, రాక్షసివా? నీలాంటివాళ్లున్నంత వరకూ మన జాతి బాగుపడదు. ఏంకావాలి నీకు?డబ్బా? కావాలన్నా నేనివ్వను తెలుసా? ఏం అధికారం వుందని వాళ్ళమీద డబ్బు చేసుకుని కుళ్ళిన పళ్ళులా తయారుచేసావ్? అయినా



పారెయ్యడానికి మనసు ఒప్పడంలేదా? ఎవరి కళ్లుకప్పి ఇంకా ఆ కుళ్ళిన పళ్ళను అమ్మాలనుకుంటున్నావ్?

మస్తానీ! నేనెంత మంచిదాన్నో, అంత చెడ్డదాన్ని కూడా! నీలాంటి పదిమందిని కలిపి పది చెరువుల నీళ్లు తాగించగలను. నన్నట్టే రెచ్చగొడితే ఈ క్షణంలోనే నీ కంపెనీ మూయించేయగలను జాగ్రత్త! వాళ్ళని మర్యాదగా పంపెయ్. నా దగ్గర డబ్బు గుంజాలని చూడకు. వున్న వాళ్ళందరూ చాలలేదా నీమీద వేసుకొని తగల బెట్టుకోడానికి? మరకతం, వాణీ!" అంటూ గట్టిగా అరచింది.

సంఘం వీపు మీద మొలచిన కాన్సర్ కురుపుల్లా, చెత్తకుండీలో పారవేసిన ప్లాస్టిక్ బొమ్మల్లాగ వున్న ఆ ఇద్దరూ బెదురుగా బయటకు వచ్చారు. ఆ గొడవకి మిగతా అమ్మాయిలు గుంపుగా నిలబడి చూస్తున్నారు. కొందరి కళ్ళలో ఆతృత, మరికొందరి కళ్లలో నిర్లక్ష్యం కనిపిస్తోంది. మస్తానీ చైతన్యం కోల్పోయి నట్లు బొమ్మలా చూస్తుండిపోయింది.

"నడవండి!" మహారాణిలా ఆజ్ఞాపించి వెనుదిరిగింది.

"సెభాష్! జాతి కుక్కవనిపించు కున్నావ్! దాని నోరు నొక్కే రోజు వచ్చింది. చూశావా... నన్ను... నన్ను ఇది అమ్ముకొంటున్నది. మా అమ్మా, నాన్నా అందర్నుండి విడదీసి దాని బాబు కూతుర్నన్నట్లు ఎత్తుకొచ్చింది. తాగి నన్నిలా తందనాలాడిస్తోంది. నాకు వీళ్ళ గతి పట్టేరోజు దగ్గరకొస్తోంది. అయినా నేనిప్పుడే రాను... రాను. ఇంకా బాగా డబ్బు సంపాదించేసి—దీన్ని ఆ రూపాయలతో కాల్చేసి వస్తాను. అప్పుడు నన్నుకూడా చూస్తావా చెల్లెమ్మా! అవును. నువ్వా అదే చేస్తున్నావు. మేవూ ఆపనే.. అయినా నువ్వు మమ్మల్ని ఆదుకోవడానికి వచ్చే దేవతవి. అవును చెల్లెమ్మా! ఇంత పవరున్నదానివి ఈ కంపెనీలన్నీ ఎత్తించేసి... అందర్నీ రక్షించెయ్యకూడదూ? ఇలాంటి రాక్షస







అంటూ చేతిలోని చిన్న సీసాలో ద్రవాన్ని గటగట తాగేసి తూలి మీద పడబోయింది ఓ అమ్మాయి.

"ఏం ఏటలా చూత్తన్నారు. ఇక్కడేం కోతులాడుతన్నాయా? లోపల కెల్లండి. ఏయ్ రాణీ...! దీన్ని లోపల కీడ్చుకెళ్లి రెండు తగల్నియ్: తాగబోతుముండ. దీని డబ్బులు ఇది తాగడానికే

చాలవు. యెదవముండలు. నేనేదో సంపాదించేస్తున్నానని ఏడుపులు. పూట పూట కంచంలోకి ముద్దలెలాగొస్తున్న య్యనుకున్నారో! కొవ్వెక్కి కళ్ళు మూసుకుపోతున్నాయిముండలికి" అంటూ మస్తానితిట్లుసాగించేసరికి అమ్మాయిలంతా బితుకు బితుకు మంటూ లోపలకి పారి పోయారు. పోతూ పోతూ ఇంకా వాగు తున్న ఆ అమ్మాయిని బలవంతాన లాక్కుపోయారు. స్మిత కళ్ళు జాలితో నిండిపోయాయి. రుమాలుతో వత్తుకొంటూ చకచక నడచింది కారు దగ్గరకు. ఆ వెనుకే మిత్ర, వాణి, మరకతం. మతి పోయినదాన్లా చూస్తూ వుండిపోయింది మస్తానీ. గుమ్మం దగ్గర తనకేమీ పట్ట నట్లు బీడీ కాలుస్తూ కూర్చున్న ఫకీరు చేతి లోకి అయిదు రూపాయల నోటు విసిరి ముందుకు వెళ్ళిపోయింది స్మిత.

అది చూసిన మస్తానీ ఫకీరుని పట్టు కొంది "దొంగసచ్చినోడా! ఆళ్ళతో కూడి నాకే యెసరు పెడతావా?" అంటూ!

వాళ్లు కారు దగ్గరకు వెళ్లే వరకూ మస్తానీ నోరు వినపడుతూనే వుంది. ముందు సీట్లో మిత్ర పక్కన కూర్చున్న స్మిత అలసటగా నుదుట పట్టిన చెమట తుడుచుకొంటూ అప్రయత్నంగా పంకజం ఇంటివేపు చూసింది. సరస్వతి కళ్ళ నిండా నీళ్ళతో గది కిటికీ దగ్గర నిలబడి చూసోంది.

చేయి ఊపింది. కారు స్పీడందుకొంది.

వాళ్ళయిదుగురూ మతి పోయిన వాళ్లలా కలో, నిజమో తెలీని అయో మయావసలో ఒకరితో ఒకరు మాట్లాడు కోవటానికే భయపడిపోయినట్లు బిక్కు బిక్కుమంటూ కూర్చున్నారు. మిత్ర దేవ లోకంలో అడుగుపెట్టగా అక్కడ పార్వతీ దేవి ప్రత్యక్షమైతే భక్తితో, భయంతో చేష్టలుడిగినవాడిలా మొద్దుబారినమెదడుతో రోడ్డు వైపు చూస్తూ బిగదీసుకు కూర్చున్నాడు.

"డాక్టర్! రెండువందల అద్దెలో ఇల్లే దయినా చూడండి! సపరేట్‌గా ఉండాలి. దొరగ్గానే నాకు కబురు చెప్పండి. అంత వరకూ నా దగ్గరే పక్కగదిలో ఉంటారు" అప్పుడే ఒక ప్లాన్ చేసుకొన్న ధైర్యంతో అంది స్మిత కారు ఆగగానే.

"యస్ మేడమ్!"

"ఎలీజా! వీళ్ళను తీసుకు వెళ్లి నీ రూమ్‌లో వుంచు ఈ రోజుకు. శ్రమ అనుకోకుండా కాస్త వంట చేసి పెట్టాలి" ఇంట్లో ప్రవేశించగానే నవ్వుతూ అంది స్మిత.

"అదేం మాట మిస్! ఈ మాత్రం చెయ్యలేనా" అంటూ, భయం భయంగా చూస్తున్న వాళ్లను లోపలికి తీసుకు వెళ్లింది ఎలీజా.

డాక్టర్‌ని తీసుకొని కారు ముందుకు పరుగెత్తింది.

* * *

"మిస్! రంజన్‌లాల్ ఫోన్ చేసాడు. మీరు రాగానే ఫోన్ చెయ్యమన్నాడు!" టమాటో సూప్ అందిస్తూ చెప్పింది. ఒక్క క్షణం విసుగ్గా అనిపించింది. మరుక్షణం ఏదో కర్తవ్యం వెన్ను తట్టగా.. గ్లాస్‌లోని సూప్ తాగేసి ఫోను దగ్గరకు నడిచింది.

ఆశ్చర్యంగా చూసింది ఎలీజా 'నిజంగా ఈమె మనిషేనా! శాపవశాత్తు దివినుండి దిగి వచ్చిన దేవకన్యా? విసుగూ, విరామం లేకుండా దేనికోసం, ఎవరికోసం ఈ శ్రమంతా' అనుకుంటూ అలాగే గోడకు చేరబడి నిలబడిపోయింది ఎలీజా!

 

"హలో....లాల్..నేను నీ గులాబీని" తీయగా అంది స్మిత.

పొంగిపోయాడు లాల్!

"యాఁ గులాబీ...షరాబీ..నీ పొందు కోసం రాత్రి వరకూ వేచి వుండాలా, డాలీ! నో...నో! నావల్ల కాదు... నీ తీయని గొంతు మత్తెక్కించి నన్ను ఇపుడే నీ దగ్గరకురమ్మని తొందరపెడు తోంది. నారాణీ! ఆజ్ఞ అయితే యిప్పుడే వచ్చేస్తా!" మైమరచిపోతూ అన్నాడు లాల్.

"లాల్! మతిపోయిందా? ఏదో పనుందని చెప్పి ఇలా మాట్లాడుతున్నావే! నీకు తెలుసుగా - మనం పగలు బిజినెస్ చెయ్యమని. జాబిల్లిని పగలు కనుపించమంటే కనుపిస్తుందా.రాత్రికి నీదాననేగా.. ఆగలేవా?" అంది స్మిత కవ్వింపుగా.

"నో...స్వీటీ! రాత్రికి 'స్నోవైట్'లో పార్టీ వుంది. దానికి మా పార్టనర్ వస్తున్నాడు. వాడికి అప్పచెప్పాలి నిన్ను.

"...గులాబీ! మరి నీ దయ నాపై ఎన్నడో!" అంటున్న లాల్ మాటలకు నవ్వింది స్మిత.

మల్లెల జల్లు కురిసినట్లు ఉక్కిరి బిక్కిరయ్యాడు లాల్.

"నువ్వే మరొకరికి ఎంగేజ్ చేసి ఇలా అంటే ఎలా...ఇంతకీ ఎంత?" అంది వ్యాపారసరళిలోకి దిగిపోతూ!

"ఎంతేమిటి డార్లింగ్! నీ మామూలు నీకుందిగా!"

"అదికాదు లాల్!నీకయితే మామూలు గానీ ఎవరికైనా అంతేనేవిటి?" గోముగా అంది.

ఆ మాటకే పొంగిపోయిన లాల్—

"ఎంత కావాలి చెప్పు. నీకేమిటిరాణీ! నువ్వేం కోరినా కాదనే శక్తి వుందా?" ఖులాసాగా అన్నాడు.

"లాల్! ఐ వాంట్ త్రీ థౌజండ్ డార్లింగ్!" స్మిత మత్తుగా అనేసరికి—

"ఓకే...ఓకే. సాయంత్రం ఆరు గంటలకు కారు పంపిస్తాను. హోటల్‌కి వచ్చేయ్! డాన్స్ కూడా నీకే బుక్ చేసాను" హుషారుగా అన్నాడు.

"ఓకే..." ఫోన్ పెట్టేసింది.

"ఎలీజా! స్నానంచేసి వస్తాను. భోజనం రెడీగా వుంచు" అని బాత్‌రూమ్‌కి నడిచింది.

స్మిత స్నానం చేసి వచ్చేసరికి అన్నీ సిద్ధం చేసింది ఎలీజా.

"వాళ్ళకి భోజనం పెట్టి విశ్రాంతి తీసుకోమను. నేను నిద్రపోతాను. సరిగ్గా ఐదుగంటలకు లేపు" అలసటగా వున్న కళ్ళతో చెప్పి వెళ్లి మంచం మీద వాలిపోయింది. అలసిన శరీరం, మనసూ వెంటనే నిద్రాదేవికి లొంగిపోయాయి.

* * *

కాలింగ్‌బెల్ మోగగానే లేచి కూర్చుంది. వెంటనే ఎలీజా టీ, బిస్కట్లు తెచ్చింది. అవి తీసుకొని స్నానం ముగించి వచ్చింది.

"ఎలీజా! ఆ 'బికినీ'తీసి దాని మీదకు రెడ్ మాక్సీ తియ్యి"

సెంట్ 'స్ప్రే' చేసుకుంటూ చెప్పేసరికి తీసిపెట్టింది.

హెయిర్ స్ప్రే వేసుకొని బ్రష్ చేసిన జుట్టు తమాషాగా ఎత్తి పైకి ఎర్రని నైలాన్ స్కార్ఫ్‌తో కట్టింది! పొట్టిగా వున్న ఆ రింగుల జుట్టు బుట్టలో నుండి లేచిన తాచుల్లా పరుచుకొంది. పెదవులకు ఎర్రని లిప్‌స్టిక్,ఐలాష్ వేసిన పొడుగైన నల్లని కనురెప్పలు కిందకు

వాల్చినప్పుడంతా ఇంకాపొడుగ్గా తుమ్మెద రెక్కల్లా, పరుచుకొని నీడలు సృష్టిస్తున్నాయి! చెంపలకు పూసిన గులాబీ రంగు క్రీమ్, దానిపై అద్దిన పౌడరు మెరుపులీనుతూ విరిసీ విరియని గులాబీలతో పోటీపడుతున్నాయి.

ఎర్రని బికినీ వేసుకుని దాని మీద ఎర్రని పలుచని మాక్సీ వేసుకొని, జరీ బుటా షాల్ కప్పుకొంది. ఎరుపు, తెలుపుల కలయిక శరీరపు రంగుతో పోటీపడుతుంటే దేనితో పోల్చాలో తెలీనంతగా కళ్ల మిరుమిట్లుగొలిపేలా వుంది. నిలువుటద్దంలో చూసుకొంటూ ఫైనల్ టచెస్ ఇస్తున్న స్మిత కారు హారన్ విని నెమ్మదిగా బయటకు వచ్చింది.

"ఎలీజా! రాత్రికి రాను. జాగ్రత్త! వాళ్ళను చూస్తూండు! డాక్టరుగారు వచ్చి మందులిచ్చి వెళ్తారు. వాళ్ళకివ్వు" అంటూ మెట్లుదిగింది.

ఇంటి ముందాగిన బ్లూ చెవర్లెట్‌ను చూసి విరక్తిగా నవ్వుకొంది. యాంత్రికంగా కూర్చుని డోర్ లాక్ చేసింది. మెదడంతా మొద్దుబారిపోయినట్లు ఏ ఆలోచనా రావడం లేదు. నిర్లిప్తంగా శూన్యంగా చూస్తూ కూర్చుంది. కారు స్పీడందుకొంది.

* * *

తలుపు తెరచిన శబ్దానికి ఇష్టం వచ్చినట్లు దొర్లుతున్న రేణుక, మరకతం, వాణీ అంతా ఉలిక్కిపడి సర్దుకొని కూర్చున్నారు. ఎలీజా లోపలికి వచ్చింది.

"భోజనం చేద్దురుగాని రండి!" ప్రేమగా పిలిచింది.

ఆమె వెనుకే మంత్రముగ్ధల్లా అనుసరించారు.

డైనింగ్ రూమ్‌లో పక్కగా చాప పరచి పరుసగా కూర్చుండబెట్టింది. విస్తర్లు వేసి వడ్డన ప్రారంభించింది. చికెన్ ఫ్రై, కట్‌లెట్, బిరియానీ, పెరుగు... అవన్నీ చూసి ఆశ్చర్యంగా నోరు తెరిచారు.

"మా కోసమే చేసారా?" వుండబట్టలేక అడిగింది రేణుక.

"ఆ...మీ కోసమే! అమ్మగారు చెయ్యమన్నారు. డాక్టరుగారు చెప్పారు మంచి ఫుడ్ కావాలని" చిరునవ్వుతో అంది.

అప్పుడప్పుడూ ఏ హోటల్లోనో ఎవరో ఇప్పిస్తే తినకపోలేదు. కానీ, ఈ ఆప్యాయత ఎక్కడిది? కొంతమందయితే ఇప్పించినట్టే ఇప్పించి చెయ్యిపెట్టేలోగా వాళ్లే తినేసేవాళ్ళు. కడుపునిండా తిండి తింటే తప్పన్నట్లు అర్ధాకలితోనే గడచిన జీవితాలు నిండు విస్తరిని చూసేసరికి వారి మనసులు మూగపోయాయి.

కాని, వారి ఆహారనాళాలు ముకుళించుకుపోయాయి ఎప్పుడో. అలవాటు లేని పనిచెయ్యలేమన్నట్లు హరాయించుకోలేని స్థితిలో ఉన్నాయవి. ఆర్తిగా, ఆబగా తిందామనుకొన్నా అర్ధాకలితోనే లేచిపోయారు. బాధగా చూసింది ఎలీజా!

తొమ్మిదవుతుండగా డాక్టరు వచ్చాడు.

"అమ్మగారు లేరు" అన్నమాటకు నిరాశగా తల దించుకొన్నాడు. మందులు, ఇంజక్షన్లు ఇచ్చి వెళ్ళిపోయాడు.

"నీకెవరూ లేరా? ఇక్కడెలా వున్నావు? నువ్వు బిజినెస్ చేస్తావా?" పని ముగించుకొని వచ్చి హాల్లో కూర్చుని పుస్తకం తిరగేస్తున్న ఎలీజాచుట్టూ కూర్చుంటూ ఆత్రంగా అడిగారు.

"నాకు అంతా వున్నారు. నాకు ఇక్కడ నచ్చింది. అమ్మగారికి కావలసిన

పనులు చేస్తుంటాను. నాకు తిండి, బట్ట ఇస్తారు. ఇంకేం కావాలి, ఇంకెందుకు బిజి నెస్?" నవ్వుతూ అంది ఎలీజా.

"అయితే పెళ్లి చేసుకొంటావా?" వాణి అడిగింది.

"పెళ్లా? ఏమో? పెళ్లి చేసుకోకపోతే ఏం?" తిరిగి ప్రశ్నించింది.

"అవును పెళ్ళి చేసుకోకపోతే ఏం? ప్రేమించకపోతే ఏం?తేచిపోకపోతే ఏం?" గొణుక్కుంటూ వుంది వాణి. ఆమె కళ్ళ ముందు ఏనాడో గతించిపోయిన గతం గుండెల్లో సమాధి అయిపోయిన గతం అస్థిపంజరంలా బయటకు వచ్చిందేమో, కెవ్వుమంది వాణి! గాభరాపడిపోయారు అంతా!

"ఏమయింది,ఏమయింది?" ఆత్రంగా పట్టుకొన్నారు అంతా. వెక్కి వెక్కి ఏడ వడంతప్ప ఏమీ చెప్పలేకపోతున్న వాణిని చూసి "పాతకథ జ్ఞాపకం వచ్చి వుంటుంది. ఇది అంతే. వాళ్లవూరు, అవీ గుర్తొచ్చినప్పుడల్లా ఇలాగే అయి పోతుంది!" తేలిగ్గా అంది మరకతం.

"ఓస్ ఇంతేనా?" అదేదో అల వాటయినట్టు అన్నారు మిగతావాళ్లు! ఎలీజాకి గుండె నొక్కినట్లయి బాధ పడింది. కళ్లల్లో నీళ్లు నిలిచాయి.

"వాణీ! మీకేం ఫరవాలేదు. అమ్మ గారు మీకో దారి చూపిస్తారు. ఆ దారిలో జాగ్రత్తగా ప్రయాణంచేసి గమ్యం చేరు కోండి. 'ఎలా' అన్న పిరికితనం వదిలి పెట్టండి. పట్టుదల వుంటే సాధించలేనిది ఏదీ వుండదు. మీకేమయినా చేతిపనులవి వచ్చా?"

"మాకేం వస్తాయ్! పగలంతా నిద్ర పోవడం, రాత్రయితే వళ్లు అమ్ముకోవడం తప్ప" అంది వాణి.

"నా చిన్నతనంలో మిషను కుట్టేదాన్ని. అది ఎప్పుడో మరచి పోయాను" అందుకొంది మేనక.

"మీకేం చేతకాకపోయినా ఫరవాలేదు. ఆత్మ విశ్వాసం వుంటే మనిషి చెయ్య లేనిది ఏదీ వుండదు" ధైర్యం చెప్తు న్నట్లు అంది ఎలీజా.

"ఏమన్నా కాస్త 'మందు' వుందా ఇంట్లో ? అమ్మగారు తాగరా? నిద్ర పట్టడంలేదు" రహస్యంగా అడిగింది రజని — వుండబట్టలేక.

"మందా" లేచి వెళ్ళింది ఎలీజా. ఆ మాటతో రజనితోపాటు అంతా ఆశగా చూసారు. ఒక చేతిలో చిన్న సీసాతో, మరో చేతిలో పుస్తకాలతో వచ్చింది.

"ఇదిగో ఈ పుస్తకాలు చదవండి! నిద్ర పడుతుంది. అంతగా నిద్రపట్టక పోతే ఈ సీసాలోవి ఒకొక్క టాబ్లెట్ వేసుకొండి" చేతులు చాస్తూ అంది ఎలీజా.

"ఇదా! పుస్తకాలెవరు చదువుతారు. అదో తలనొప్పి—పైగా ఎప్పుడో మరచి పోయాం అక్షరాలు. కూడబలుక్కుని చదివేసరికి తెల్లారిపోతుంది. గొప్ప మందు తెచ్చావ్" నిర్లక్ష్యంగా అంది మేనక.

"ఇవన్నీ మీ సహనానికి, భవిష్య తుకు మొదటి సోపానాలు. ఇంక మీరు టైమ్ వేస్టు చేసుకునే వేశ్యలు కాదు. మీ కోసం మీరు బతకాలనుకుంటున్న మనుషులు. ఇంతవరకూ మీ బతుకులు మీ చెప్పుచేతల్లోలేవు.ఎవరో ఆడించినట్లాా ఆడారు. ఇంక జీవితాన్ని మీ గుప్పె ట్లోకి తీసుకోబోతున్నారు. మీరు నడిపించి నట్లు అది నడుస్తుంది. కాని దానికి ధైర్యం, స్థిరమైన మనసు కావాలి. మిమ్మ

 

ల్నాదుకొన్నవాళ్ళకి 'ఒక మంచి పని చేసామన్న' తృప్తి కలిగేలా చెయ్యాలి గాని,ఎలుక తోలు తెచ్చి ఎందుకు ఉతుకుతున్నాంరా భగవంతుడా అనుకొని బాధ పడేట్లు వుండకూడదు. బాగా ఆలోచించుకోండి. పడుకోండి పన్నెండవుతోంది" అంటూ లేచింది ఎలీజా. తప్పుచేసిన వాళ్ళలా తలలొంచుకున్నారు. ఆలోచనలంటే ఏమిటో మరచిపోయినవాళ్లు కూడా కొత్తగా ఆలోచిస్తూ పొద్దుతూనే గడిపేసారు ఆ రాత్రంతా !

* * *

చీకటి జీవితాలకి కొత్త వెలుగు నిస్తున్నట్లు తూర్పున వెలుగు రేఖలు సూటిగా కిటికీలోనుండి ప్రసరిస్తూ తట్టి లేపుతున్నాయి.

కాలింగ్ బెల్ మోగేసరికి వులిక్కిపడి లేచింది ఎలీజా. ఆ వెంటనే అతిథుల అలవాటు లేని శరీరాలను కుదిపి బలవంతంగా లేపి కూర్చోబెట్టింది.

నవ్వొచ్చింది రజనికి అదంతా చూసి.

'ఇంతవరకూ నిద్రపోయిన రాత్రి గాని, నిద్రపోని పగలుగాని లేదు. ఇవ్వాల్టినుండి రాత్రి నిద్ర, పగలు పని' అనుకుంది.

తెలతెల్లవారి వెలుగులో ఆ ఇంటి ముందున్న తోట చూస్తుంటే అందరికీ ఎంతో ఆహ్లాదం కలిగింది. ఎలీజా పిలవడంతో అంతా పెరట్లోకి వెళ్ళారు కాలకృత్యాలు తీర్చుకునేందుకు. డైనింగ్ టేబుల్ దగ్గర అప్పుడే స్నానం చేసి వచ్చి ఫ్రెష్‌గా ఏమాత్రం అలసటలేకుండా చిరునవ్వుతో కూర్చుని కాఫీ తాగుతున్న స్మితను చూసి ఆశ్చర్యపోయారు.

"చూశావా వాణీ! రాత్రి లాడ్జింగ్ కెళ్ళి వచ్చినా ఏమాత్రం అలసటలేకుండా ఎంత చక్కగా వుందో చూడు. మనమయితే ఇవాళ్లా తయారై వచ్చేవాళ్ళం" వాణి చెవి కొరికింది రజని.

"వుష్... వూరుకో! ఆవిడతో మనల్ని పోలుస్తావేం? నక్కకూ, నాగలోకానికున్నంత తేడా!" అంతకంటే మెల్లిగా అంది వాణి.

అందరూ తయారయి కాఫీ టిఫిన్ ముగించే సరికి డాక్టర్ వచ్చి చెక్ చేసాడు.

"మీరు కాస్త వ్యాయామం చెయ్యాలి. కాస్త ఎండ తగిలేలా చూడండి. పొద్దున్నే తోటపని చేస్తే బాగుంటుంది. ఆ పైన మంచి మందులు, తిండి, నిద్ర వుంటే చక్కగా ఆరోగ్యంగా తయారవుతారు" చెప్పాడు మిత్రా.

డాక్టర్ మాటలకి వాళ్ల కళ్ళల్లో కొత్త వెలుగు వచ్చింది. పని చెయ్యడానికి వుత్సాహపడ్డారు. ఆ రోజుకి వెనుక నున్న నేలంతా మొక్కలు, పాదులు వెయ్యటానికి అనువుగా చదును చేసారు. కాఫీ తాగి వెళ్ళిన స్మిత నిద్రపోయి సరిగ్గా పదిగంటలకు లేచింది. తోటలో పని చేస్తున్న వాళ్ళను చూసి తృప్తిగా నిట్టూర్చింది.




సోఫాలో కూర్చుని ఏకాగ్రతతో చదువుకుంటున్న స్మిత టీపాయ్ మీద

అయిన శబ్దానికి తల త్రిప్పింది. నోట్ల కట్ట! ఎదురుగా అరవింద్! ఆశ్చర్యంగా చూసింది.

"ఈ రాత్రికి నీ రేటు" సిగరెట్ వెలిగించుకొంటూ నిర్లక్ష్యంగా అన్నాడు అరవింద్

"అడ్వాన్స్ అన్నమాట" నవ్వుతూ ఆ డబ్బు చేతిలోకి తీసుకుంది. ఉక్రోషంగా చూసాడు.

"స్మితా! సాయంత్రం నాతో రావాలి. అలా ఎక్కడికన్నా వెళ్దాం. ఉఁ..వాళ్లంతా ఎవరు? తమరు వుద్ధరిస్తున్న వాళ్ళా? ఏకంగా ఇంట్లోనే తెచ్చిపెట్టుకున్నావన్నమాట. కొంప తీసి నువ్వొక హౌస్ పెట్టేస్తావేమిటి?" వేళాకోళంగా అన్నాడు.

"అరవింద్! నువ్వు చాలా చక్కగా మాట్లాడుతావ్ గానీ మనం మాట్లాడుకోవలసింది ఈ విషయాలా? సరే! సాయంత్రం రెడీగా వుంటాను. ఎన్నింటికి వస్తావు?" ఇంక వెళ్ళొచ్చు అన్నట్లుంది ఆ ధోరణి.

"ఆరింటికి వస్తాను. రెడీగా వుండు!" అనేసి లేచాడు వెళ్లడానికుద్యుక్తుడవుతూ—

"స్మితా...నాకు శాశ్వతంగా నువ్వు కావాలి స్మితా! ఈ డబ్బిచ్చి కొనుక్కోవడాలు...ప్చ్...నాకొద్దు. నామాట విని నా దానివికా స్మితా! నిన్ను విడిచి వుండలేను స్మితా" ఆవేశంగా అంటూ అంతకంటే వుద్రిక్తంగా స్మితను గుండెలకు హత్తుకుంటున్న అరవింద్ చేతుల్లో ఇమిడిపోయింది మాట్లాడకుండా.




"పిచ్చి అరవింద్! ఇదంతా వ్యామోహం మాత్రమే. స్వంతం అయితే ఏం చేసుకొంటావు. క్షణికమైన ఈ ఆవేశం ఎప్పుడూ వుండిపోదు అరవింద్! నీ మొండితనం నీదే. నీక్కావలసిన ఆనందం నేనెంత కాలం ఇవ్వగలను. నా మాట విని చక్కగా మంచి అమ్మాయిని చూసి చేసుకో. అపుడే స్మితను మరచిపోతావ్" మృదువుగా అతని తల నిమురుతూ చిన్న పిల్లాడిని బుజ్జగించినట్టు బుజ్జగించింది. అతని చేతుల్లో నుండి విడిపించుకుంటూ. గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోతున్న అతన్ని అలిగి వెళ్ళిపోతున్న బిడ్డను చూసే తల్లిలా చూస్తుండిపోయింది చిరునవ్వుతో.

అంతలో డాక్టర్ మిత్రా వచ్చాడ
అతన్ని చూడగానే సరస్వతి గు
చ్చింది.

"రండి డాక్టర్. కూర్చోండి. ఎలీ
కాఫీ పంపించు!" అని చెప్పి, త
కూర్చొంది.

"డాక్టర్ ఈరోజు నేను వద్దామ
కొన్నాను. కానీ చికాగ్గా వుంది. మీక
ఐదువేలు ఇస్తాను. రెండు, మూ



వేలకు మాట్లాడి సరస్వతిని తీసుకొచ్చే యండి. అంతకూ ఒప్పుకోపోతే పూర్తిగా ఇచ్చేసి తీసుకురండి. గొడవేమన్నా జరుగుతే నేను వస్తాను" డబ్బు అందిస్తూ చెపుతుంటే పాఠం వింటున్న బుద్ధిమంతుడైన కుర్రాడిలా శ్రద్ధగా విని 'అలాగే' నంటూ తలూపాడు.

"ఇదిగో! ఇది మీకు" మరో వెయ్యి అందించింది.

"మేడమ్! నాకు గవర్నమెంటు జాబ్ వచ్చింది. ఈ విషయం చెబుదామనే వచ్చాను. నిజానికి మీ దగ్గర డబ్బు తీసుకోవడానికి సిగ్గుపడుతున్నాను. ఇన్నాళ్ళూ 'అవసరం'నా నోరు మూయించింది. మీరు చేస్తున్న ఈ సత్కార్యంలో నన్ను పాలు పంచుకోనీయండి చాలు. ఇంక నాకే ఫీజులూ వద్దు. నాది నాకు చాలు. ఆ పైన ప్రయివేటు ప్రాక్టీసు వుండనే వుంది కదా! అది కాస్త విస్తరింపచేసుకొంటే సరి" వుద్వేగంగా అన్నాడు.

ఒక్క క్షణం ఏం మాట్లాడాలో తోచ లేదు స్మితకు.ఆమె మొహంలో, కళ్ళల్లో కృతజ్ఞతా భావం మెదిలింది. అది చూసిన అతని మనసు పున్నమినాటి సంద్రంలా పొంగిపోయింది.

"థేంక్యూ డాక్టర్...థేంక్యూ! మీలో ఇంతటి సంస్కారం వుందని ఇప్పుడే తెలిసింది. మీలాంటి వాళ్లు వెయ్యిమందికి ఒక్కరున్నా ఈ దేశం ఇలా అధోగతి పాలయ్యేదికాదు. ఆడది అంగడి బొమ్మ అయ్యేదికాదు. నాకు చాలా ఆనందంగా వుంది డాక్టర్. మీలాంటి నిస్వార్థుల సహకారం వుంటేనే 'ఏదన్నా' చేద్దామను

కొనే కొద్దిమందయినా ముందడుగు వెయ్యగలరు. కానీ ఈసారికి ఈ డబ్బు తీసుకోండి ఫరవాలేదు. మరి మీకు పీలవు తుందా వారం వారం వచ్చి చూడటానికి!" అందిస్మిత ఆడబ్బు తిరిగి అతనిచేతికిస్తూ.

"ఎందుకవదూ! ఈ వూళ్ళోనే వచ్చింది పోస్టింగ్. తప్పక వస్తాను" స్థిరంగా అన్నాడు.

కాఫీ తాగి లేచాడు. మరోసారి గుర్తు చేసి సాగనంపింది.

*　　*　　*

రెండు గంటలు పోయాక సరస్వతితో సహా తిరిగి వచ్చాడు మిత్రా!

"వెరీగుడ్! సాధించారన్న మాట" ఆనందంగా అంది స్మిత.

"ఏం సాధించడమో! హెల్ అయి పోయిందనుకోండి!ఓ పట్టాన లొంగలేదు. సరస్వతి కూడా ఎదిరించింది. ఆఖరుకు ఇన్స్పెక్టర్ పేరు చెప్పి అయిదువేలు ఇస్తే పూరుకుంది. 'ఇంకోసారి మీరిలా చేస్తే మీ మందులూ వద్దు, మీరు మా వాడకూ రావద్దు' అని ఆర్డర్ వేసింది. మరోసారి వెళ్తే కాళ్ళు విరగ్గొట్టేట్టు వుంది" అలసి పోయిన యుద్ధ వీరునిలా సోఫాలో కూల బడ్డాడు మిత్రా.

"అందర్నీ తెచ్చి మనం మాత్రం ఏం చేస్తాం. వచ్చిన వాళ్ళకో దారి చూపించాక కదా మరొకరి సంగతి!"

స్మిత మాటలను మధ్యలోనే అందు కొంది సరస్వతి-

"మరొక్క అమ్మాయి వుంది. ఆ అమ్మాయిని తీసుకొచ్చేస్తే ఇంకెవరి గురించి బాధపడనక్కరలేదు. ఈ ఒక్కసారికి కొంచెం దయతలచండి! ఆ అమ్మాయి జీవితం నాశనం కాకముందే కాపాడండి. అక్కడే చెపుదామను కొన్నాను. వీలుకాలేదు. నన్ను విడిచిపెట్టి




అయినా ఆ అమ్మాయిని రక్షించండి. నాదేముంది అలవాటు పడిన జీవచ్ఛవాన్ని. ఆమెను రాత్రే తీసుకువచ్చారు పంకజం మనుషులు. వచ్చిన దగ్గర నుండి ఒకటే ఏడుపు. కాస్త చదువు కొన్నదిలా వుంది. మీరు వెంటనే వెళ్ళక పోతే ఆ అమ్మాయి జీవితం నాశనం అవుతుంది. దయచేసి కాపాడండి!" ఏడుపే తరువాయిగా అంది సరస్వతి.

తననుతాను ఎలానూ కాపాడుకోలేక పోయినా, ఎదుటి-వ్యక్తిని కాపాడడానికి వెనుకాడని ఆమె వ్యక్తిత్వానికి ఆశ్చర్య పోయింది స్మిత.

'తనకేకాదు 'మరొకర్ని కాపాడాలనే మంచి మనసు' అందరికీ వుంటుంది. కానీ అవకాశం లేక ఏం చెయ్యలేకపోతున్నా రన్నమాట' అనుకోకుండా వుండ లేకపోయింది సరస్వతినే తదేకంగా చూస్తున్న స్మిత.

"సరే ఏం చేద్దాం డాక్టర్? నా దగ్గర డబ్బులేదు ప్రస్తుతం. బాంక్ నుండి డ్రా చెయ్యాలి. ఇప్పుడే వెళ్తే మనం గొడవలో చిక్కుకోవలసి వస్తుందేమో? అయినా హోటల్‌కి ఫోన్ చేసి మనుషుల్ని పంప మంటాను. తీసుకొని వెళ్దాం!" అంటూనే హోటల్‌కి ఫోన్ చేసింది.

"కావలిస్తే వుంచండి ఈ డబ్బు! తరువాత నాకిద్దురు" అన్నాడు తన దగ్గర వున్న డబ్బు ఇస్తూ

"రేపు మీకు ఇస్తాను!" కృతజ్ఞతగా అందుకొంటూ అంది. మరో అరగంటలో చక్కగా డ్రెస్ చేసుకొన్న ఇద్దరు గుండాల్లాంటి వాళ్ళను తీసుకొచ్చాడు. స్మిత తనే స్వయంగా బయలుదేరింది వాళ్ళతోపాటు!

వీళ్ళను చూడగానే మొహాన్ని నవ్వు పులుముకుంటూ ఎదురయింది పంకజం.

"ఏంటి అమ్మగారిలా దయచేశారు. ఇప్పుడే కదా దాన్ని తీసుకవెళ్ళాడు" నెమ్మదిగా అంటున్నా కంఠం మాత్రం కఠినంగా, వ్యంగ్యంగా పలికింది.

"ఆ! ఏం లేదు. పంకజం! చల్లకొచ్చి ముంతదాచడ మెందుగ్గాని రాత్రి తీసుకు వచ్చిన అమ్మాయిని పంపించెయ్" అంది స్మిత ధైర్యంగా.

"రాత్రా ! అమ్మాయా ? ఎవరు చెప్పారు. ఆ సరుసు ముండేనా ? మీకెందుకమ్మా ఈ తాపత్రయం? మా బతుకులు మమ్మల్ని బతకనియ్యండి. అనవసర విషయాల్లో జోక్యం చేసుకుం టున్నారు. ఏదో మందిప్పిస్తాను అంటే 'సరే'నన్నాను కానీ ఇలా మాకే ఎసరు పెడతారనుకోలేదు. నా దగ్గర ఏ పిల్లా లేదు. అనవసరంగా గొడవచెయ్యకండి" బెదిరిస్తున్నట్లు అంది పంకజవల్లి.

ఆ మాటలకు నిర్లక్ష్యంగా నవ్వింది స్మిత.

"పంకజం ! నన్నే జడిపిస్తున్నావా? అసలు ఎవరిచ్చారు నీకి ఎత్తుకొచ్చే అధి కారం? కావాలని ఇందులోనే మగ్గిపోవా లనుకున్న వాళ్ళను తెచ్చుకొన్నావు. సంపాదించుకొంటున్నావు సరే ! కాని అది చాలదని కంటికి నదరుగా కనపడిన ఆడపిల్లలందర్ని ఎత్తుకొచ్చి వాళ్ళ జీవి తాలు నాశనం చెయ్యడానికి నీకేం అధికారం వుంది? నీడబ్బు దాహం తీర్చుకో డానికి సాటి ఆడదానికి కడుపుకోత విధి స్తావా? నువ్వు మనిషివేనా? ఏం చేస్తావ్ డబ్బు ? నీ ధనపిపాస ఎప్పటికి తీరుతుంది?

ఎంతమంది జీవితాలు ఇలా కాలరాసి

నేలమట్టం చేస్తావ్? ఆ అమ్మాయినొక్క దాన్ని పంపించెయ్. ఇక నీ దగ్గరకు రాను. నా సంగతి నీకు తెలుసు. అనవసరంగా నన్ను రెచ్చగొట్టకు" జబర్దస్తీగా ఖచ్చితంగా అంది స్మిత.

"నేనెందుకు చేస్తున్నానో చెప్పాలా? నువ్వెందుకిలా చేస్తున్నావ్! వీళ్ళందర్నీ తీసుకు వెళ్ళి నువ్వు కంపెనీ నడుపుదామనుకుంటున్నావా? నీకు పెద్దోళ్ళ అండదండలున్నాయని మాటిమాటికి మానెత్తినెక్కి మానోటి ముందర కూడు లాక్కుంటున్నావ్. నీకే కాదు అమ్మాత్రం పల్కుబడి మాకూ వుంది పోలీసోళ్ళతో. వచ్చినోళ్ళందర్నీ నువ్వు తీసుకుపోతే మేమెలా బతకాలి?" మొండి ధైర్యంతో అంది పంకజం.

"అదంతా కాదు పంకజం! నాకవతల చాలా పనుంది. ఆ అమ్మాయిని పంపించు" విసుగ్గా అంది స్మిత.

"ఏటమ్మోయ్! మా గొప్ప తమాసా గుంది వ్యవహారం! ఏం చేస్తావో చేసుకో. నేను పంపను!" రెచ్చిపోతూ అంది.

స్మిత సైగ చేసింది.

"ఏమిటే వాగుతున్నావ్! కిడ్‌నాప్ కింద కేసు బుక్ చేసి జైల్లో తోయించేయగలను. జాగ్రత్త" వెంట వచ్చిన గూండాల్లో ఒకడన్నాడు జబర్దస్తీగా.

దాంతో సణుగుతూ ఒకపక్క ఉండిపోయింది పంకజం. వచ్చిన ఇద్దరు గూండాలు వెళ్ళి తలుపు తెరిచి ఆ అమ్మాయిని పైకి తెచ్చారు. కళ్ళు జిగుమన్నాయి అందరికి ఒక్కసారి. నీలి కలువలా వుందా అమ్మాయి. నలుపులో అంత వింత సోయగం, అంతటి మెరుపూ ఎప్పుడూ చూడలేదు స్మిత. ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయింది.

అప్రయత్నంగా చేతులు చాపింది. ఆ చేతుల్లో ఇమిడిపోయింది వెక్కి వెక్కి ఏడుస్తూ! సన్నని నడుము, పొడవుకి తగ్గ లావు, ఒత్తయిన జుట్టు, పొడుగ్గా కలువ కాడల్లా వున్న చేతులు-ఆ అమ్మాయిని అలా చూస్తుంటే మతిపోయినట్లున్న స్మిత, తెలివి తెచ్చుకున్నదాన్లా ఆ అమ్మాయిని చేతుల్లో నుండి విడదీసి చెయ్యిపట్టుకొని చకచక నడిచింది కారు దగ్గరకు. ఆ వెనకే జాన్ మిగతావాళ్లు అనుసరించారు.

పంకజం తిట్లవర్షంలో తడుస్తూనే కారు దగ్గరకు చేరారు. కారు స్టార్టు అయ్యాక తేలిగ్గా నిట్టూర్పు విడిచింది స్మిత. స్మితను పట్టుకొని బావురుమందా అమ్మాయి.

"ఊరుకో, ఇంకేం భయం లేదు. నీ పేరేమిటి?" వీపు నిమురుతూ మృదువుగా అడిగింది స్మిత.

"యమున!" వెక్కుతూ అందా అమ్మాయి.

ఎప్పుడో ఎవరితోనో ప్లెజర్ ట్రిప్‌గా ఆగ్రా వెళ్ళినప్పుడు పక్కనే ప్రవహిస్తున్న యమునను వెన్నెల్లో చూసి అందాలు ఆస్వాదించిన రోజు గుర్తు వచ్చింది. తెల్లని వెన్నెల్లో నల్లని యమున సోయగం ఈనాడే ఈ అమ్మాయిలో చూసి అచ్చెరువొందింది. 'పర్‌ఫెక్ట్' నేమ్ అనుకొంది.

స్మితను, యమునను దించి ముందుకు సాగిపోయింది కారు. ఎదురొచ్చిన సరస్వతి కన్నుల్లోని ఆరాధన, కృతజ్ఞత జీవితంలో మరచిపోలేనివి. ఎలీజా వచ్చి లోపలికి తీసుకు వెళ్ళింది యమునను.





అలసటగా సోఫాలో చేరబడింది స్మిత!

లోపలినుండి గుసగుసలు వినిపిస్తున్నాయ్! నవ్వుకొంది స్మిత.

'బాధ్యతలు ఎక్కువయి పోతున్నాయి. త్వరగా పరిష్కరించాలి. అసలు ఏం చెయ్యడమో అర్థంకావడం లేదు. అందర్నీ కలిపి ఒక తాటిమీద నడిపించాలి. వీళ్లేంచేస్తారో? తన ఆశ ఎంతవరకూ ఫలిస్తుందో చూడాలి. డబ్బు పెట్టుబడివరకే తనపని. మిగతా పనులు ఎలీజాకే అప్పచెప్పాలి. ఆ పైన మిత్రా వున్నాడు. ముందు వీళ్ళంతా ఒక దారిలోపడితేగాని యింకెవర్నీ తీసుకురాకూడదు' ఆలోచిస్తుండగా ఫోన్ మోగింది. విసుగ్గా రిసీవరు అందుకొంది.

"హలో! స్మితా హియర్! ఎవరూ ప్రకాషా? ఏమిటి సంగతి" నవ్వు తెచ్చుకొంటూ అంది.

"ఏంలేదు. నువ్వు ఒక 'బ్లూ డైమండ్'ని తెచ్చావటగా! మాకిస్తే, నీకెంతకావలిస్తే అంతఇస్తాం"

"ఆ 'డైమండ్' అమ్మకానికి కాదు!" ఉద్రేకంగా అరిచింది.

ఆ మాటకి అవతలినుండి పకపకమని నవ్వు వినిపించింది. "పూర్ స్మితా! ఎందుకలా ఆవేశపడిపోతావ్! నీ బిజినెస్ ఏం పడిపోదులే. నీ సంస్కరణకి అడ్డురాంమేము. ఈ అమ్మాయిని మాత్రం పైకిపోనిచ్చి వేస్టు చెయ్యకు. నువ్వుద్ధరించాలంటే చాలామంది వున్నారులే!" వెటకారంగా అన్నాడు హోటల్ ప్రొప్రయిటర్ ప్రకాష్.

"ప్రకాష్! ఈ మాటలంటున్నది నువ్వు కనుక, దూరంగా వున్నావు కనుక సరిపోయిం. ఆ అమ్మాయి ఫేమిలీగర్ల్. వీళ్ళు కిడ్‌నాప్‌చేసి తీసుకొచ్చారు. ఈ లోగా ఎంక్వయిరీ ప్రారంభమయే ఉంటుంది. అనవసరంగాచిక్కుల్లో పడతావ్! అమ్మాయి తండ్రి పెద్ద లీడింగ్‌లాయరట. డ్రాప్ దట్ మేటర్!" అనేసి కోపంగా ఫోన్ పెట్టేసింది.

'ఆడదంటే అందరికీ అలుసే! బజార్లో వంకాయలకన్నా చవుక అయిపోయింది. ఈ వెధవలు వెళ్లి చెప్పారు కాబోలు! వీళ్ళే మహా కష్టపడి సంపాదించేసిన ఆస్థిలా అధికారం చెలాయిస్తారు. ఈ యమునను త్వరగా పంపెయ్యాలి! అసలు ఎలా చిక్కిందో వాళ్ళచేతుల్లో!' అనుకొంటుండగా...

స్నానం ముగించుకొని ఎలీజా ఇచ్చిన చీర కట్టుకొని ఎలీజా వెనకే వచ్చి ఎదురుగా కుర్చీలో కూర్చుంది యమున.

ఆ మొహంలో ప్రచండమైన యుద్ధానంతరం ఏర్పడిన ప్రశాంతత కనుపిస్తోంది. ఆ ప్రశాంతత వెనుక యుద్ధములో అలసిన ఛాయలు కనిపిస్తున్నాయి!

నిశితంగా చూసింది స్మిత.

పలుచని తామరరేకుల్లాంటి చెక్కిళ్ళ మీదుగా కోలగా పొడవయిన కళ్లు మెరుస్తూ స్నిగ్ధంగా వున్నాయి. ఆ పైన వంగినట్లున్న సన్నని గీతల్లాంటి కనుబొమలు. విశాలమైన నుదురు, దానిమీద గుమ్మడిగింజ ఆకారంలో సింధూరం, చిన్నగడ్డం-గడ్డం చివరగా చిన్నగుంట. సన్నగ తీర్చిదిద్దినట్లున్న పెదవులు, పొడుగ్గావున్న అందమయిన ఆకృతి. మేఘం రంగు చీరలోచుట్టబెట్టిన నీలి గోరింట పూలదండలా వుంది యమున. ఆ సోయగానికి మరోసారి ఆశ్చర్యపోయింది స్మిత.

"యమునా! నువ్వెలా వాళ్లచేతుల్లో పడ్డావ్?" ముందుకు వంగి కుతూహలంగా అడిగింది.

ఆ ప్రశ్న వినగానే కళ్లల్లో నీళ్లూ రాయి యమునకు.

"యమునా! ఏం జరిగిందో త్వరగా చెప్తే దానికి పర్యవసానం ఏమిటో ఆలోచించి అలా చెయ్యాలి. ఊఁ! త్వరగా చెయ్యకపోతే మళ్లీ నిన్ను కాపాడటం కష్టం అయిపోతుంది. మీ వాళ్ళ అడ్రస్ చెప్తే ట్రంకాల్ చేసి రప్పిస్తాను. నువ్వు బాధపడుతూ కూర్చుంటే కాదు" అనే సరికి, కళ్లు తుడుచుకొని చెప్పడం మొదలు పెట్టింది.

"నేను బి. ఏ. ఫైనల్ పరీక్షలు రాసి సెలవులకు మా అక్కడగ్గరకు వరంగల్ వెళ్ళాను. ఈ ఊళ్ళో మా ఫ్రెండు మారేజీ. అందుకని బయలుదేరి వచ్చాను. ట్రెయిను సాయంత్రం ఆరింటికి రావలసింది. లేటయి రాత్రి పన్నెండు గంటలకు వచ్చింది. తెలిసిన ఇల్లే కదా వెళ్దామని ధైర్యంచేసి ఆలోచిస్తున్నంతలో ఓ ఆటో వాడు వచ్చి 'ఎక్కడికి?' అనడిగాడు. అడ్రస్ చెప్పాను. 'నాకు తెలుసు; పెళ్ళి వాళ్ళను కొంతమందిని దింపాను' అంటూ మరేం ఆలోచించనివ్వకుండా చేతిలో సూట్ కేసు అందుకొన్నాడు. చదువు కొన్నదాన్ని ఏం భయంలే అనుకుంటూ, ఆటో ఎక్కేసాను. వాచీ చూసాను. ఇంకోగంట వ్యవధి వుంది ముహూర్తానికి! టైముకు వెళుతున్నానని సంతోషించాను. అర్ధరాత్రి, నిర్మానుష్యంగా వుందిరోడ్డు. దారి తప్పించేశాడు. కాసేపటికి గమనించిన నేను కేకలు వెయ్యబోతే డ్రయివర్ పక్కనున్న మరొకడు వచ్చి నా నోరు నొక్కేసాడు. ఆ ఇంటికి చేర్చారు. నన్నొగదిలో బంధించారు. తెల్లవారాక వాళ్లు చెప్పినట్లు వినకపోతే అట్లాగే గదిలో వుంచేసి చంపేస్తామన్నారు. 'కొత్త పిట్టే మయినా చిక్కిందా!' అంటూ ఎవడో వచ్చాడు. వాడిదగ్గర అడ్వాన్స్ కూడా తీసుకొంది రాత్రికి నన్ను పంపిస్తానంటూ! మీరు రాకపోతే పైటచెంగుతో ఉరి పోసుకునేదాన్ని" వెక్కుతూ ముగించింది.

"సరే! జరిగిందేదో జరిగింది. మీ అడ్రస్ చెప్తే ట్రంకాల్ చేస్తాను. మీ నాన్నగారు ఏం చేస్తుంటారు? ఫోనుందా మీఇంట్లో?"

"ఆ! వుంది. మానాన్నగారు ప్రయివేట్ ఫర్మ్ లో మానేజర్‌గా వుంటున్నారు. ట్రంకాల్ చేస్తే నాన్నగార్కి వీల్లేకపోతే అన్నయ్య వస్తాడు" అంది యమున.

"నేను అలా వెళ్లి ఎక్కడన్నా ట్రంకాల్ చేసి వస్తాను. జాగ్రత్త. ఇంటి నుండి చేస్తే ఇంటర్ కనెక్షన్ వుంది. ఎవరికన్నా తెలుస్తే చికాకు; జాగ్రత్తగా వుండు!" అని లోపలికి వెళ్లి ఎలీజాకు చెప్పి బయలుదేరింది.

రాత్రి పదిగంటలకు టాక్సీలో వచ్చిన యమున తండ్రికి ఆమెను అప్పచెప్పి నాక తేలిగ్గా వూపిరితీసుకుంది స్మిత.

"నీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలీడం లేదమ్మా! చిన్నదానివయినా చేతులెత్తి దండం పెడుతున్నాను. ఆడపిల్ల దొరికితే అమ్మేసుకొందామని చూసే ఈ రోజుల్లో...నిజంగా నువ్వు దేవతవే!" కళ్ళలో నీళ్ళుతిరుగుతుండగా కృతజ్ఞతగా అంటున్న అతన్ని చూసి కళ్లు చెమ్మగిల్లాయి స్మితకు.

 

"నాదేముందండీ! అంతా అనుకోకుండా జరిగిపోయింది. మీ అమ్మాయిని మీకు క్షేమంగా అప్పచెప్పగలిగాను అంతే! మీ అమ్మాయీ, మీరూ అదృష్టవంతులు. ఈ విషయం నలుగురికీ తెలీకముందే జాగ్రత్తగా తీసుకుపొండి! ఎప్పుడూ ఈ అందమైన అమ్మాయిని ఒంటరిగా పంపించకండి! ఏమ్మా.. బ్లూడెమండ్‌వి కదూ! అలా తిరగొచ్చా? ఏ దొంగలయినా ఎత్తుకు పోతారు; జాగ్రత్త!" నవ్వుతూ అంది స్మిత.

కళ్లు చెమ్మగిల్లగా స్మిత రెండు చేతులు కళ్ళకద్దుకొంటూ అందరికీ వీడుకోలు చెప్పి తండ్రితో బయలుదేరింది యమున.

'అబ్బ! ఒక్కరోజులో ఎంతమార్పు. నిన్నరాత్రికి, ఈ రాత్రికి ఎంతతేడా?' అనుకొంది యమున టాక్సీలో కూర్చుంటూ. స్టేషన్ వైపు దూసుకుపోయింది టాక్సీ!

ఒక మంచిపని చేసానన్న తృప్తి స్మిత మనసులో నిండిపోయి ఆ రాత్రి తనేమీ సంపాదించ లేదన్న దిగులుకు చోటివ్వలేదు. ఎన్నడూ ఎరగనంత హాయిగా నిద్రపోయింది.

* * *

"ఇల్లు దొరికింది మేడమ్! కొంచెం దూరం అయినా కావలసినంత ఖాళీ స్థలం కూడా ఉంది. రెండు వందలు అద్దె!" పొద్దున్నే వస్తూనే చెప్పాడు మిత్రా.

"సర్లెండి. ఇంటి ప్రోబ్లమ్ తొందరగానే తీరిపోయింది. ఇప్పుడేం చెయ్యాలో పాలుపోవడం లేదు. తీసుకువెళ్లి కొత్త ఇంట్లో పెడతామనుకోండి తరువాత ఏం చేస్తారు? ఏవిటో అనుకున్నంత తేలిగ్గా కనుపించటంలేదు" నిస్పృహగా అంది స్మిత. ఏం చెప్పాలో తోచని వాడిలా మౌనంగా ఊరుకున్నాడు డాక్టర్ మిత్రా!

"వాళ్ళనే ఈ సమస్యకి సమాధానం చెప్పమందే?" కాసేపటికి మౌనాన్ని ఛేదిస్తూ అన్నాడు.

"అవును వాళ్ళ సమస్యని వాళ్లే పరిష్కరించుకోవాలి; ఎలీజా! వాళ్లందర్నీ ఇటు పిలు" అంది.

మరుక్షణంలో ఎలీజా వెంట వచ్చారు అందరూ! టెన్త్ క్లాసు వాళ్లు ఇంటర్ క్వెశ్చన్ పేపరు చూసినట్లు మొహాలు పెట్టారు ఆ ప్రశ్న విని.

ఆలోచిస్తూ వుండిపోయారు కొంత సేపు.

"నాకు మిషను మీద బట్టలు కుట్టడం వచ్చు. ఫ్రాకులవీ బాగా కుడతాను" అంది సరస్వతి.

"సరే! మిషనుకొంటాను. మిగతా వాళ్లకి నేర్పించు. అటుపైన తోటపని, పూలు, కాయగూరలు శ్రద్ధగా పండించటం చెయ్యండి. తరువాత ఆలోచిద్దాం! అన్నట్టు ముందుగదిలో ఓ చిన్న ఫాన్సీ షాపు పెడితే ఎలావుంటుంది డాక్టర్? ఆ వీధిలో ఏమన్నా వున్నాయా షాపులు?"

"అక్కడికి దగ్గర్లో ఏమీలేవు. ఇంకా డెవలప్‌కావలసిన ఏరియా కదూ. మనం పెడితే బాగుటుంది. పోతే ఎదన్నా మహిళామండలి సహాయం కూడా తీసుకుంటే బాగుంటుందేమో?" అన్నాడు మిత్రా!

"అవును. గుడ్ అయిడియా. ఎందు షాపుకి కావలసిన సామాను, మిషను, బట్టలు ఎంతవుతాయో చూడండి. ఎలీజా! నువ్వూ, డాక్టరుగారు కలిసి చెక్ చేస్తుం



డాలి ఖర్చు, రాబడి అంతా! ఒక కుర్రవాణ్ని పెడితే మంచిది వీళ్ళకు సహాయంగా! ఓ సైన్ బోర్డు కూడా రాయించండి 'అభ్యుదయ మహిళా సమాజం' అని. అన్నట్లు జాబ్‌లో మీరెప్పుడు జాయిన్ అవుతున్నారు?" అడిగింది.

"రేపే. ఈలోగా సామానన్నీ వెళ్ళి కొనుక్కువస్తాను!" అన్నాడు మిత్రా. లేచి వెళ్ళి చెక్‌బుక్ తెచ్చి సంతకం పెట్టి ఇచ్చింది. "అలాగే ఓ డజను కట్టుడు చీరలు, జాకెట్టు పీసెస్ కూడా తీసుకోండి" చెప్పింది.

అంతలో ఫోన్ మోగింది. రిసీవర్ అందుకొంది. తనకు బ్రోకర్‌గా పని చేస్తున్న వర్మ! అతని గొంతు విని తనకే తెలియకుండా మనసునావరించిన దిగులు తొలగినట్లు తేలిగ్గా అనిపించింది.

"ఏమిటి వర్మా! ఏదన్నా ఎంగేజ్‌మెంటా?"

"ఆ! రాత్రికి బ్లూ డైమండ్‌లో రూమ్ నంబర్ వన్ థర్టీ! టాక్సీ తీసుకొని నేనే వస్తాను. ఎంతకు రమ్మంటావు?"

"ఆరున్నరకిరా ! సరేగాని ఎంత ? వర్మా ! నువ్వెంత తీసుకున్నా సరేగాని నాకు మాత్రం ఖచ్చితంగా థౌజండ్ కావాలి, ఓకే!"

"థౌజండా... సరే!" అయిష్టంగా అన్నట్లన్నాడు.

"సరేనా! అలా అయితేనే వస్తాను" ఖచ్చితంగా అంది మరోసారి.

"అబ్బ! సరేలెద్దూ! నీ డిమాండ్ అలా వుంది. మరి ఏం చేస్తాం. రెడీగా వుండు" అనేసి ఫోను పెట్టేసాడు.

తృప్తిగా నిట్టూర్చింది.

'వెయ్యి రూపాయలు! ఫరవాలేదు. అలా కాకపోతే తనేం సాధించగలదు?' అనుకొని లేచింది స్మిత.

తయారయి సిద్ధంగా వుండేసరికి వచ్చాడు మిత్రా! సోఫాలో కూర్చున్న స్మితను చూసి పడిన శ్రమంతా మరచి పోయినవాడిలా సంతోషంగా నవ్వాడు చిన్నగా!

పసుపు పచ్చని డ్రెస్‌లో పచ్చ చంద్రకాంత పువ్వులా మెరిసిపోతోంది. ఆ అందం అతనికి ఆహ్లాదం ఇచ్చింది.

అంతలో వర్మ రావడంతో అతన్ని ఎలీజాకి అప్పచెప్పి వెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న ఆమెను ఆపలేని తన నిస్సహాయతకు గుండెల్లో ఏదో కలుక్కుమనగా తలవంచుకొన్నాడు. ఎలీజాకి



అంతా అప్పచెప్పి మరొక్కక్షణం కూడా అక్కడ వుండకుండా వెళ్లిపోయాడు.

* * *

మరో రెండు రోజుల తర్వాత మూడు గదుల డాబాయింటి ముందు 'అభ్యుదయ మహిళా హోమ్' అన్న బోర్డును వేలాడ దీసారు. ఆ ఇంటి చుట్టూ – ముఖ్యంగా వెనక ఎక్కువగా వున్న ఖాళీ స్థలం చూసి చాలా సంతోషించారు.

"చూడండి! ఇది మీ కోసం... మీ భవిష్యత్తు కోసం మీరు చేసుకుంటున్న పని. మీరు చేసే ఈ పని మీలాంటివారికి వెలుగు చూపాలి. ఆధారం కావాలి. మీలో మీరు ఈర్ష్య, అసూయలు పెట్టుకోకుండా ఒకరికొకరు సహకరించుకొంటూ నాకూ సహకరిస్తే ఇంకేమన్నా చెయ్య గలుగుతాను. ఇందులో పెద్ద గొప్ప ఏంలేదు. అంతా సమానమే! అంతా ఒక్క వయస్సులో వున్నవాళ్లే! ఇంతవరకూ నరకం లాంటి బతుకు బతికారు. ఇక మీదట అంతా స్వర్గమే! రోజూ సాయంత్రం ఒక గంట చదువు నేర్చుకొండి. సరస్వతి, వాణి బాగా చదువు కొన్నారుకదా! సరస్వతి దగ్గర కుట్లు నేర్చుకొని అందరూ కలిసి మంచి డ్రెస్‌లు తయారుచేసి బాగా డబ్బు సంపాదించండి. అందరూ కలిసిమెలిసి వుంటే మరి కొన్నాళ్ళకి హోమ్ పెద్దదయి మన లాంటివాళ్ళకి మరి కొంత మందికి ఆశ్రయం ఇస్తుంది. దానికి పునాదులం కావాలి మనం.

"మీకేం అవసరం వచ్చినా ఈ అబ్బాయితో కబురు పంపండి. ఎలీజా రోజూ ఏదో ఒక టైములో వస్తుంటుంది. డాక్టరు గారు రెండు రోజులకోసారి వచ్చి చూసి వెళ్తుంటారు"

వంట సామగ్రి, కుట్టు మిషను, షాపుకావలసిన సామగ్రి అంతా అప్ప జెప్పి అందర్నీ కూర్చోబెట్టి అంతా చెప్పింది స్మిత.

ఏం మాట్లాడాలో తెలీని వాళ్ళలా మంత్రముగ్ధులై విన్నారు.

కళ్ళతోనే కృతజ్ఞత వెలిబుచ్చుతూ నమస్కరించారంతా! "రాత్రికి మీకు తోడుగా వుండటానికి గూర్ఖాను పెడతాను" అంటూ కిందకు దిగుతుంటే కళ్ళల్లో నీరు చిప్పిల్లగా చేయి ఊపుతూ ముందుకు సాగింది స్మిత. మిత్రా హాస్పిటల్‌కి వెళ్ళడం వలన రాలేదా రోజు. అదే వెలితిగా అనిపించింది.

* * *

"మన మిత్రాకి ఓ కీప్ వుందటోయ్! హోటల్లో కేబరే చేసుంటుందే, అదీ!"

"వీడిలో ఏం చూసి 'కీప్' చేసిం దోయ్!" ఆశ్చర్యంగా అంది మరో గొంతు.

"ఈ జాబ్ రాకముందు అక్కడే పర్సనల్ డాక్టర్‌గా చేసేవాడట. అదే వీడికి చూస్తుంటే వీడు దానికి చూసే దేవిటి? ఏమైనా లక్కీ ఫెలోలే. ఒక్క నైట్‌కి థౌజండ్ తీసుకొంటుందట అది. దాని డిమాండ్ అలా వుందిట. పెద్ద పెద్ద బిజినెస్ మేగ్నెట్స్ అంతా దాని చేతుల్లో వుంటారట. అంటే మనవాడి చేతుల్లో బంగారు చిలక వుందన్నమాట" డాక్టర్ సహానీ వివరించాడు.

వింటూనే మిత్రా మనసు చివుక్కుమంది. ఇంకా ఏం వినవలసి వస్తుందోనని మెల్లగా దగ్గి డోర్ తెరచి లోపలికి అడుగు పెట్టాడు. అక్కడున్న ముగ్గురూ సద్దుకుని కూర్చున్నారు.




'పొద్దుపోతే మధువు, మగువ ఉంటే గానీ బతకలేని వీళ్ళు అలా అనుకోవడంలో తప్పులేదు. కానీ...తనామెను ఆ దృష్టితో ఎన్నడూ చూడలేదే!' అనుకుని నిట్టూర్పు నణచుకుంటూ కుర్చీలో కూలబడ్డాడు.

"కొత్త సూపర్నెంట్ విజిట్ కొస్తున్నాడట. గురుడు కొంచెం గోపాలకృష్ణుడట!" విషయం మారుస్తూ అన్నాడు శర్మ.

"మన లేడీ డాక్టరమ్మలకి తీరికఉండదన్నమాట" వేళాకోళంగా అన్నాడు శంకర్.

"వాళ్ళకెలాగూ పర్వాలేదుగానీ మనకి కూడా పరవాలేదన్నట్లు చేసుకోవాలిగా మరి! లేకపోతే అదీ ఇదీ కలిపి మన నెత్తిన రుద్దుతాడు. పార్టీ ఎలాగూ ఇస్తాం కదా. దాంతోపాటు 'పుష్పం'కూడా సమర్పించుకుంటే మంచిదికదా!" సహానీ సజెస్ట్ చేసాడు.

"మన మిత్రా వున్నాడుకదా, ఏమన్నా ఎరేంజ్ చేస్తాడేమో" కన్ను గీటుతూ సహానీ వంక చూస్తూ అన్నాడు శర్మ.

మిత్రాకు వంటిమీద తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది. "సారీ! నాకెవరూ తెలీదు" ఎవరి మొహం చూడకుండా అన్నాడు.

"అదేమిటోయ్! సరోవర్‌లో కేబరే డాన్సర్ నీకు తెలుసటగా. నీవు అది వరకూ ఆవిడకు పర్సనల్ డాక్టరుగా వుండేవాడివటకదూ! నీ సొమ్మేదో పోయినట్లు మాట్లాడతావేమోయ్! డబ్బు పారేసే అదే వస్తుంది!" నిరసనగా అంతకంటే నిర్లక్ష్యంగా అన్నాడు సహానీ.

"అయామ్ సారీ! నాకా విషయాలేవీ తెలియవు. మీరూ, ఆవిడా చూసుకోండి" వస్తున్న కోపం పళ్ళ బిగువున ఆపుకొంటూ లేచి వెళ్ళిపోయాడు మిత్రా.

తలంతా దిమ్ముగా వుంది. పనిచెయ్యాలనిపించలేదు.

రౌండ్స్ అయ్యాక ఇవ్వవలసిన ఇంజక్షన్ ఇచ్చి వచ్చి రూమ్‌లో కూర్చున్నాడు.

'ఛీ...ఛీ...ఈ ఉద్యోగం రాకుండా వుండవలసింది. ఎందుకిలా ప్రవర్తిస్తారు చదువుకొన్నవాళ్ళు కూడా? వీళ్ళ సంస్కారం ఏమయింది? ఇంత నీచంగా ఎలా మాట్లాడతారు? చదువుకొన్న చదువుకు ఇంతేనా విలువ? వీరి విజ్ఞానమంతా ఏ ఏట్లో కలిసింది? దైవత్వాన్ని ఆపాదించే చదువులు చదివి ఐహిక సుఖాలలో ఓలలాడుతూ శీలంలేని బతుకులు బతుకుతున్న వీళ్లు, నాగరికత ముసుగులో అర్థంలేని జీవితాలు జీవిస్తున్నారు. ఎదుటి మనిషి మనసు అర్థంచేసుకోలేని వీళ్ళు మనుషులేనా? నీ మనసులో ఏముందో ఎవరికి తెలుసు స్మితా! నిన్ను పొందాలనే తృష్ణ నాకెన్నడూ లేదు స్మితా! శరీరాన్ని వెచ్చించి కొనుక్కోగల తాహతువుంటే వుండొచ్చు. కానీ...మనసు ఆణిముత్యం. స్వచ్ఛమైన ఆ మనసులో రవ్వంత చోటు నాకిస్తే నా జన్మ ధన్యమైపోతుంది స్మితా! నీ విచిత్రమైన జీవన విధానం ఎవరికి తెలుసు? అందరూ నువ్వు శరీరాన్ని అమ్ముకోవడమే చూస్తున్నారు. కానీ ఏ మహాయాగానికి నిన్ను నీవు సమిధగా అర్పించుకుంటున్నావో ఈ నీచులకేం తెలుసు. నీ సన్నిధి ఎంత హాయిగా వుంటుంది. పొన్నచెట్టుమీద కృష్ణుడూ, చెట్టుకింద గోపికలూ వున్నంత సంబ్రమంగా వుంటుందిగదూ? ఛ...ఛ...ఈ రోజు నా మనసెందుకిలా అవుతోంది.

వాళ్ల మాటలు నాలో ఇంతవరకూ నిద్రాణ మైవున్న ఆరాధనను తట్టి లేపాయా? స్మితను నేను ప్రేమిస్తున్నానా? ప్రేమంటే ఏమిటి? ఆమెలోని సంస్కారాన్ని ఆరాధిస్తున్నానా?

లేక అందరిలా ఆమె శరీరాన్ని, పైపై మెరుగుల్ని కాంక్షిస్తున్నానా?ఛ...ఛ... ఆ శరీరాన్ని తాకే ఆర్హత కూడా లేదు నాకు. ఆ కోరిక, తపన ఎప్పుడూ కలగ లేదు కూడా. ఆ మనసులో చిన్న చోటిస్తే, ఆ స్థానాన్ని పొందగలిగితే చాలు! ఈరోజు మనసిలాంటి కోరిక కోరుతుందేం? మనసులో స్థానమిస్తే ఏం చేస్తాడు? పెళ్ళి చేసుకుంటాడా? పెళ్లి... అవును పెళ్ళి చేసుకొంటే ఏం? చేసుకుని ఇద్దరూ ఒక్కటై ఆచరిస్తే ఎంతఆనందం. తృప్తి వుంటుంది అందులో. ఏమిటీ పిచ్చి ఆలోచనలు ... అసలామెను తలెత్తి సూటిగా చూడాలంటేనే భయం వేస్తుందే, తన మనసులో రేగిన ఈ అలజడిని ఎప్పుడైనా విప్పి చెప్పగలడా? ఆవిడను పెళ్ళి చేసుకుంటే ఈ సంఘంలో బతగ లరా? బతకలేకపోతే, డబ్బులేకపోతే ఇద్దరి ఆలోచనా ఏమవుతుంది? ఏం చెయ్యగలుగుతారు? అందుకేనేమో అర వింద్ ఎంత పట్టుపట్టినా అతన్ని చేసుకోవ డానికి తిరస్కరించింది. ఆమె సంపా దించకపోతే ఆమె ఆశయాలకి ఊపిరి పోతుంది. ఇది ఇంతేనేమో...?

సిస్టర్ పిలవడంతో ఆలోచనలాగి పోయాయి. ఇన్నాళ్లూ తనకే తెలియని భావం ఏదో రూపుదిద్దుకుని కళ్లముందు నిలిచి కవ్వించినట్లనిపించింది. ఆ ఊహా మూర్తి కవ్వింపులకే మనసు పులకిం చింది. 'ఎవరేమనుకున్నా లెక్కచెయ్య కూడదు. ఆమె ప్రేమను పొందాలి' అదే ఆశయంగా కనబడింది.

ఉత్సాహంగా ఇంటికి బయలుదేరాడు.

* * *

"అదిగో అబ్బాయొచ్చాడు. వాడిని కనుక్కొని చెప్తాను" ఉత్సాహంగా అన్నారు రాధాకృష్ణమూర్తి. ఏదో ఆలో చిస్తూ ఇంట్లో అడుగుపెట్టిన మిత్రా ఆ మాటలకు వులిక్కిపడి తల పైకెత్తాడు. ఎవరో కొత్త వ్యక్తులు కుర్చీలో కూర్చుని కుతూహలంగా చూస్తున్నారు.

తండ్రి వైపు ప్రశ్నార్థకంగా చూసాడు. వచ్చి కూర్చోమన్నట్లు సైగ చేస్తే వెళ్ళి కూర్చున్నాడు. కాసేపు వాళ్ళేం మాట్లాడుకొంటున్నారో అర్థం కాలేదు. అర్థం అయాక కూర్చోవాలనిపించలేదు.

"మొహం కడుక్కొని వస్తానండి!" అని లోపలకు వెళ్ళిపోయాడు.

అతని విసయానికి వచ్చిన వాళ్ళు పొంగిపోయి తలలూపి ఆనందించారు.

వంటగదిలో మొహం నిండా చెమ టతో ఆనందం వెల్లివిరుస్తుండగా కిందా మీదా పడుతూ టిఫిన్ చేస్తున్న తల్లిని, సహాయం చేస్తున్న చెల్లెల్ని చూస్తే చిరాకు ముంచుకొచ్చిందతనికి.

"ఏమిటమ్మా హడావుడి పడిపోతు న్నావ్!" వంటింటి గుమ్మం దగ్గర నిల బడి అడిగాడు.

"వచ్చావా బాబూ! మొహం కడుక్కో. వాళ్లెవరనుకుంటున్నావ్! రాజమండ్రి నుండి వచ్చారు. ఒక్కతే అమ్మాయిట. ఏభై వేల వరకూ ఇస్తామంటున్నారు!" ఉత్సాహంగా చెప్పుకుపోతున్న తల్లిని చూస్తుంటే ఏం అనలేకపోయాడు.

తలవంచుకొని కూర్చొన్న పెద్ద చెల్లెల్ని చూస్తుంటే గుండె కలుక్క

మంది. ఆ అమ్మాయి మొహం కనబడక పోయినా ఆ మొహంలో ఏ భావం ఉందో ఊహ తెలిసిన దగ్గర్నుండి ఆ ఇంట్లో వుంటున్న అతనికి తెలియకపోదు. పెళ్లి కావలసిన చెల్లెలు. తండ్రికెంత బాధ్యత వుందో తనకీ అంతే వుంది, తను అమ్ముడుపోతే గాని చెల్లెలికి పసుపు తాడు కొనలేడు! నిట్టూరుస్తూ వెనుదిరి గాడు. అతని మనసులో 'ఇది' అని చెప్పకోలేని భావం గుండెలను కోస్తోంది. నిర్లిప్తంగా చూస్తూ వూరుకొన్నాడు. కాఫీలు, టిఫిన్లు అయాక మంచిది చూసు కొనిరమ్మని చెప్పి వెళ్ళిపోయారు. బయటకు వెళ్లిన ఇద్దరు తమ్ముళ్లు, ఆడు కోవడానికి వెళ్లిన చిన్న చెల్లెలు తిరిగి వచ్చారు. భవిష్యత్తు శూన్యంగా అనిపిం చిందతనికి వాళ్ళను చూడగానే! ఇంట్లో అంతా తలా ఒకొక్కరకంగా కబుర్లు, కలలతో మేనులు వాలిస్తే, చిక్కు ముడిలో చిక్కుకుని ఊపిరాడని వాడిలా ఆలోచనలతో వుక్కిరిబిక్కిరి అయ్యాడా రాత్రంతా మిత్రా!

* * *

"ఏం బాబూ! మంచి రోజు కనుక్కొని రమ్మంటావా వెళ్లాం!"

ఆశగా అడుగుతున్న తల్లిని చూడ లేనట్లు తల దించుకొన్నాడు.

"నాకిప్పుడే చేసుకోవాలని లేదమ్మా! ముందు లీలకు ఏదో కుదరనివ్వండి!" నెమ్మదిగా అన్నాడు

"దానికి కుదరడమేమిట్రా! కట్నాలు పోస్తే కావలసినన్ని వున్నాయి. నీకు తెలియందేమీ కాదు. నీకొచ్చిందాంతో దాన్నో ఇంటి దాన్ని చెయ్యాలనుకుంటు న్నామా! 'అయ్యవారు వచ్చేదాకా అమా వాస్య ఆగుతుందా?' నీవు సంపాదించి దాని పెళ్లిచేసేవరకూ వయసు ఆగు తుందా? అన్నీ తెలిసినవాడివి నీకేం చెప్తాం మరి" నచ్చచెప్పటమో, నిష్ఠూ రమో తెలీని విధంగా వున్నాయి ఆమె మాటలు.

"బాగా ఆలోచించుకో, నీ ఇష్టం!" మరోసారి నిర్లిప్తంగా అని వెళ్ళిపోతున్న తల్లిని చూస్తూ వుండిపోయాడు.

తలెత్తిన అతనిని ఆశగా రెండు కళ్లు దీనమైన చూపులతో ఎదుర్కొన్నాయి.

ఆ చూపులు తట్టుకోలేనివాడిలా గబ గబ వెళ్ళిపోయాడు. అప్రయత్నంగా అతని కాళ్లు స్మిత దగ్గరకు లాక్కు వెళ్ళాయి. అంత తెల్లవారి అతను రావడం ఆశ్చర్యపరచింది స్మితను. అప్పుడే స్నానం చేసి వచ్చికూర్చున్న స్మిత ఉషోదయానికి విచ్చుకుంటున్న సూర్యకాంత పువ్వులా కనిపించింది. మనసు కొంచెం కుదుటపడినట్లయింది.

"అలా వున్నారేం డాక్టర్? హాస్పిటల్ లేదా? పొద్దున్నే ఇలా వచ్చారేమిటి?" ఆప్యాయంగా అడిగింది స్మిత.

"అబ్బే, ఏం లేదు. మనసు బాగో లేక ఇలా వచ్చేసాను. సారీ! మీకు డిస్టర్బెన్స్ ఏమో'' కంగారుగా అన్నాడు.

అతని మాటలకు గలగలనవ్వింది స్మిత.

ఆ నవ్వు అతని చీకటి మనసులో సూటిగా చొరబడి వెన్నెల కాయించింది.

"ఏంజరిగిందో చెప్పండి! వీలయితే ఏదన్నా సహాయం చేస్తాను" కుతూహ లంతో అంది.

ఆ ఆప్యాయతకు కరిగిపోయాడు.

"నాకో సంబంధం వచ్చింది. ఏభై

వేలు ఇస్తామంటున్నారు. అమ్మ వాళ్లు తొందర చేస్తున్నారు. దాంతో చెల్లిపెళ్లి చేసేద్దామని!"

పాపం ఒప్పుచెప్తున్న పిల్లాడిలా గబ గబా చెప్తుంటే పక పక నవ్వేసింది స్మిత.

తెల్లబోయినట్లు చూసాడు!

ఆ చూపుకి మరింత నవ్వుతూ "బాగుంది డాక్టర్ మీ సమస్య! హాయిగా కట్నం తీసుకొని పెళ్ళిచేసుకొమ్మంటే పారిపోయి వచ్చారా?" ఇంకా నవ్వుతూనే అంది.

"కానీ...కాని... నాకెందుకో ఇష్టం లేదు" తడబడుతూ నెమ్మదిగా అన్నాడు

ఆశ్చర్యంగా చూసింది. "కొంపతీసి ఎవర్నన్నా ప్రేమించారేమిటి? అలాచేస్తే మాత్రం మరొకర్ని మీ జీవితంలోకి ఆహ్వానించి మోసం చెయ్యకండి. మీ చెల్లెలి కోసం మీరు అమ్ముడుపోయి మరొకరి జీవితాన్ని నరకం చెయ్యకండి!" ఆవేశంగా అంది స్మిత.

ఆ మాటలువింటూ ముగ్ధుడైపోయాడు. "అయినా డాక్టర్! మీ చెల్లెలేం చదువుకో లేదా? చదువుకుంటే హాయిగా ఉద్యోగం చేసుకొని తనకాళ్ళమీద తను నిలబడి తన జీవిత భాగస్వామిని తనే ఎన్నుకోవచ్చు కదా! మన ఆడపిల్లలకు ఒకరి వైపు ఆశగా చూడటం బాగా అలవాటయి పోయింది. ఎవర్ని అమ్మేసి, ఎవర్ని కొనుక్కుందామా అని ఎదురు చూస్తారు తప్ప చెట్టంత మనిషి ఒకరి మీద ఆధారపడి ఉండడానికి సిగ్గుపడరు. ఏమన్నా అంటే ఆచారం అంటారు. ఎవరేనా స్వేచ్ఛను కోరితే బరితెగించారంటారు. మనం సృష్టించుకొన్నవే ఈ ఆచారాలు, వ్యవహారాలు. ఒకప్పుడు డబ్బు తీసుకొని అమ్మి కొనేవారు ఆడపిల్లని. ఆ ఆచారం ఏమైంది? ఈ డబ్బిచ్చి అబ్బాయిని కొనుక్కునే ఆచారం ఎలావచ్చింది? ఇవన్నీ మనం చేసుకొన్నవే! సంవత్సరాలు గడుస్తున్నా, కాలం మారిపోతున్నా ఇంకా ఈ ఛాదస్తాలతో జీవితాలను నాశనంచేసే మనుషులు మాత్రం పోలేరు. ఇల్లాంటి పిరికి వాళ్లున్నంత వరకూ పోలేరు కూడా. డాక్టర్! ఇలాకట్నాలు పోసికొనుక్కుని అతకని మనసులతో మగవాడికి బానిస భార్యగా మనసు చంపుకుని బతకటానికి ఇష్టపడతారుగానీ, మనసు కలసినవాణ్ని, మనిషిగా చూసేవాణ్ని ధైర్యంగా చేసుకోలేక ఎంత మంది బలైపోతున్నారు. మీరెందుకని చెప్పరు డాక్టర్...అసలు వీరంతా స్వార్థపరులు, చదువుకొన్న కుసంస్కారులు. కట్నపిశాచానికిబలిఅయిపోతున్న విద్యావంతులు. విజ్ఞానంకోసం చదువు, స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఎవరి కాళ్ళమీద వాళ్లు నిలబడి బతకటానికి చదువు. కానీ...వాస్తవంలో ఎంత ఎక్కువ చదివితే అంతగా రేటు పెంచుతున్నారు ఈనాటి యువలోకం... మీలాంటిచదువుకొన్నఅన్నలు ఎంతమంది తన చెల్లెళ్ళకు స్వేచ్ఛ,ధైర్యం అందిస్తున్నారు? ఎంత మంది జీవితం ఏమిటో చెప్తున్నారు. సమస్యల్ని ఎదుర్కొనే ధైర్యాన్ని ఎంత మంది కలిగిస్తున్నారు? ఎప్పుడూ ఎవరి రక్షణలోనో వుండాలనుకొనేవారే. ఎందుకూ పనికిరానివాళ్ళలాగా ఆకుచాటు పిందెలా చూసి మరో ఆకు చాటుకు పంపిస్తున్నారు ఆడపిల్లల్ని! అంతే! ఇంక ప్రపంచాన్ని చూసిందెన్నడు. నాతోపాటు ఈ సంఘానికి మీరెంతో సేవ చేయాలనుకొంటున్నారు అవునా?" సూటిగా ప్రశ్నించింది.





'అవును' అన్నట్లు తలూపాడు.

"అయితే ఇంతవరకూ మీరు మీచెల్లెలు అన్న అమ్మాయి కోసం ఏమయినా చేసారా?" ఆవేశంతో వణికిపోతూ అంది. మనసులో ఏనాటినుండో మూగవోయిన భావాలు గొంతు విప్పాయి.

విప్పారిచ్చిన కళ్ళతో విస్మయంగా చూస్తూ వుండిపోయాడు మిత్రా.

జీవితాన్ని చిలికి చిలికి, హాలా హలాన్ని, అమృతాన్ని సమానంగా పొందిన అనుభవజ్ఞురాలిలా ఎదురుగా నిలబడి ఉన్న స్మిత ఆదిశక్తిలా కనబడింది ఆ క్షణంలో.

'నిజమే. నా చెల్లెలికోసం నేనేం చేసాను? ఒక్కనాడూ ఆలోచించలేదు. పెళ్ళి చేసెయ్యాలనే అనుకొన్నాను తప్ప అందరితోపాటు ఆ పిల్ల వ్యక్తిత్వానికి మెరుగులుదిద్ది స్వతంత్రంగా ఆమె తన కాళ్ళ మీద తను నిలబడాలన్న ఊహను ఏనాడు తీర్చిదిద్దలేదు. ఇంటర్ పాసయి ఇంట్లో 'వుంటే తల్లికి సహాయం అనుకొన్నాడు అంతే! ఈ సరికి ప్రయివేటుగా కట్టినా బి.ఏ., టైపు, షార్ట్‌హాండ్ అన్నా అయుండేది. ఉద్యోగం చేసుకొంటూ ఉంటే తన వైపు ఇప్పట్లా ఆశగా చూసేదా?' అతని మనస్సులో ఆలోచనలు పరుగులెడుతున్నాయ్.

"లోకం గొడ్డు పోలేదు డాక్టర్! మిమ్మల్ని మీరు అమ్ముకోనక్కరలేదు. మీరు శ్రద్ధ వహిస్తే మీ చెల్లెలికి పెళ్ళి చెయ్యలేక పోలేరు. మీ వైపే ఆలోచించకండి. ఆ పైన డబ్బు కావలిస్తే నేనిస్తాను మీకు అభ్యంతరం లేకపోతే..." ఎలీజా తెచ్చిన కాఫీ అందుకొని అతనికొకటి ఇచ్చి, తనో కప్పు తీసుకొంటూ అంది స్మిత.

"థేంక్యూ స్మితా! థేంక్యూ! నా కళ్ళు తెరిపించారు. మీ మేలు ఎన్నటికీ మరచిపోలేను. డబ్బే కావలిస్తే మీ చేతులో ఇచ్చిన డబ్బుతోనే ఆ కార్యం నెరవేరుస్తాను. వస్తాను" ఖాళీ కప్పు టీపాయ్ మీద పెట్టి లేచాడు — వెళ్ళడానికుద్యుక్తుడవుతూ.

చిరునవ్వుతో చూస్తున్న స్మితను చూసి ఉత్సాహంతో మనసు, శరీరం గాలిలో తేలిపోతున్నట్లనిపించి హుషారుగా పైకి నడిచాడు.

* * *

హోటల్ సాగర్‌లో తొలిసారిగా అడుగు పెట్టాడు మిత్రా భయం భయంగా. అదే మొదటిసారి అలాంటి హోటల్లో అడుగు పెట్టడం. విద్యార్థిగా ఉన్నంత కాలం చదువు కోసమే అన్నట్లుగా బతికి ఫ్రెండ్స్‌తో ఎంజాయ్ చేసే అవకాశం లేని మధ్యతరగతి మనిషిగా ఆ దశ ముగించాడు. అందువలన అలాంటి హోటల్స్ పైనుండి చూడటమే తప్ప లోపల అడుగు పెట్టే అవకాశం ఇంత వరకూ కలగలేదు.

బెదురుతూ లోపల అడుగు పెట్టిన మిత్రాను శర్మ రిసీవ్ చేసుకొన్నాడు. అప్పటికే ఆహూతులంతా వచ్చి కూర్చున్నందు వల్ల ఆఖరు వరుస కుర్చీల్లో ఓ నాలుగయిదు ఖాళీగా వుంటే అందులో ఒకదానిలో కూర్చున్నాడు. మరో పది నిముషాల్లో పార్టీ మొదలు పెట్టారు. కానీ, అందరూ స్మిత కోసమే తహతహలాడుతున్నారు తప్ప పార్టీకి పెద్ద ప్రాముఖ్యమివ్వలేదు. తప్పనిసరి పరిస్థితులో వచ్చాడు మిత్రా. వచ్చిన దగ్గర్నుండీ ముళ్ళతీగతో పీక చుట్టినట్లు ఊపిరాడని



వాడిలా వున్నాడు. కూల్‌డ్రింక్ సిప్ చేస్తుంటే విషం మింగుతున్నట్లే వుంది.

సూపర్నెంటు చిన్న పిల్లాడిలా అందరిలో కలిసిపోయాడు. శర్మ జోకులు వేస్తుంటే హుషారుగా గ్లాసులు ఖాళీ అవుతున్నాయి. వెళ్లిపోదామనుకొంటున్న మిత్రాని పంతం కొద్దీ ఆపినట్లు ఆపుతున్నారు శర్మ, సహాని.

అంతలో డిమ్‌గా వున్న ఆ కాస్త లైట్లు కూడ ఆరిపోయాయి. ఒక్కక్షణం అంతా చీకటి. మరు నిముషం డయాస్ మీద లైట్ వెలిగింది. నీలిరంగు వెల్తురు పల్చని తెరలా గదిని కప్పుకొంది. ఆ వెలురులో కలిసిపోతూ ఉదయిస్తున్న చందమామలా నీలిరంగు నైలాన్ డ్రస్‌లో స్మిత! ఒక్కసారి మ్యూజిక్ హై పిచ్‌లో అందుకొంది. దానికి అనుగుణంగా నాట్యం చేస్తున్న స్మితను చూస్తుంటే మిత్రా కళ్ళు మసకబారాయి. ఏదో చెప్పలేని ఆవేదన గుండెలను పిండుతున్నట్లయింది. ఒకటి తర్వాత ఒకటిగా అయిటమ్స్ అయిపోతున్నాయ్ హుషారెక్కినవాళ్ళులేచి డాన్స్ చెయ్యడం మొదలెట్టారు. అంతా బాగా మత్తులో వున్నారని గ్రహించిన మిత్రా ఎవరో వెంట తరుముతున్నవాడిలా నడిచాడు బయటకి. అప్పుడుగానీ తేలిగ్గా, స్వేచ్ఛగా గుండెల నిండుగా గాలి పీల్చుకోలేకపోయాడు. సరాసరి ఇంటికి వెళ్ళాడు.






"బాబూ భోజనం పెట్టనా?" అన్న తల్లి మాటలకు "వద్దమ్మా" అనేసి వరండా లాంటి తన గదిలోకి వెళ్లిపోయాడు.

అక్కడ చెల్లెలు లీల ఏదో నవల చదువుతూ కూర్చొంది. నిస్తేజంగా మంచంమీద పడిపోతున్న అతన్ని చూసి నెమ్మదిగా పుస్తకం మూసేసి అల్మారాలో పెట్టి లేచి వెళ్లిపోయింది. వెళ్లిపోతున్న లీలను చూస్తుంటే ముందురోజు స్మిత అన్నమాటలు, ఆవేశంతో కందిపోయిన ఆమె మొహం కనబడి ఏదో చెప్పాలని

పించింది. కానీ ఏదో అశక్తత అతని నోరు నొక్కేసింది. కళ్లు మూసుకొన్నాడు.

నీలిరంగు నైలాన్ డ్రెస్‌లో నుండి మెరుస్తున్న పచ్చని స్మిత శరీరం.... కోర్కెలు రేపే ఆ శరీరం...కామాంధుల చేతుల్లో నలిగిపోతూ డబ్బు సంపాదించే ఆ శరీరం...మ్యూజిక్‌కు అనుగుణంగా వంపుసొంపులు ప్రస్ఫుటింపజేస్తూ మైకంలో మునిగిన మనసులకు గాలం వేస్తున్న ఆ రూపం కనపడింది. బాధగా కణతలు నొక్కుకున్నాడు. కిటికీలో నుండి కనబడుతున్న ఆకాశం వైపు, అక్కడ మిణుకుమిణుకుమంటున్న నక్షత్రాల వేపు పొడారిన కళ్ళతో, ఎడారి లాంటి మనసుతో చూస్తుండగానే వెలుగు రేఖలు వచ్చి గుచ్చుకోసాగాయి. లేచి కూర్చున్నాడు. యాంత్రిక జీవితంలో స్విచ్ నొక్కినట్లు జీవనపోరాటం ప్రారంభమయింది. వంటింట్లో తల్లికి సహాయం చేస్తున్న లీలను చూస్తుంటే స్మిత మాటలు మళ్ళీ గొర్తొచ్చాయి.

"లీలా! ఓసారి ఇలారా" అంటూ తల్లి ఇచ్చిన కాఫీగ్లాసు తీసుకొని తన గది వైపు నడిచాడు. చేస్తున్న పనాపి అనుసరించింది ఆశ్చర్యంగా. తండ్రి తరువాత తండ్రిలాంటి డాక్టరన్నయ్య అంటే భయం, గౌరవం తప్ప చనువు లేదు ఆమెకు.

"కూర్చో!" అన్నాడు తను మంచం మీద కూర్చుంటూ.

కుర్చీలో ఒదిగికూర్చుంది లీల.

ఏం మాట్లాడాలో తెలీనివాడిలా కాఫీ సిప్‌చేస్తూ కాసేపు వుండిపోయాడు.

"నీకు ఇంకా చదవాలనుందా?" తడబడినట్టే అడిగాడు. మూడు సంవత్సరాల నుండి ఇంట్లో కూర్చుని పెళ్లిచేసేస్తారన్న ఆశతో కలలుకంటోన్న లీల ఆ ప్రశ్నకు తెల్లబోయి చూసింది.

ఇంటర్ అవగానే చదువుతానంటే 'చాల్లే ఇంకెందుకు.నువ్వు చదువుతే అంతకన్నా ఎక్కువ చదివినవాణ్ని ఎక్కువ కట్నమిచ్చి తేవొద్దూ' అనేసి మాన్పించేసారు. ఆ రోజు చదువుకోవాలన్న తన కోర్కెను ఎలా సజీవసమాధి చేసుకొంది? మొదట్లో సరదాగా వుండే పెళ్లిచూపుల తతంగం రాను రాను ప్రాణసంకటంగా మారి మనసు చచ్చిపోయిందని తనేం చెప్పగలదు? చెప్పగలిగే శక్తి ఉంటే ఈ యాంత్రిక జీవితం ఎందుకు గడుపుతుంది? ఇప్పుడు చదువుకొంటావా అని అడుగుతున్నాడు. ఇప్పుడెందుకు ఇంత శ్రద్ధ కలిగిందో? అప్పుడే నాన్నకి సర్దిచెప్పగలిగితే తనీసరికి గ్రాడ్యుయేట్ అయ్యుండేది. తన చదువు మూలపడుతుందన్న స్వార్థం కాబోలు నోరెత్తనివ్వలేదు. ఇప్పుడు ఊరికే ఇంట్లో తిని కూర్చుంటే చూసి జాలేస్తోందో, కష్టమేవేస్తోందో పాపం! ఆలోచనలంటే ఏమిటో మరచిపోయి, తిండి,నిద్రకు అలవాటుపడిపోయిన తను ఇప్పుడేం చదువుతుంది?

సమాధానం చెప్పకుండా తలవంచుకొని కూర్చున్న చెల్లెల మనసులో రేగే సంఘర్షణ అర్థం చేసుకునే ఓపిక లేదతనికిప్పుడు.

"పులుకూ పలుకూ లేకుండా కూర్చుంటే నాకెలా తెలుస్తుంది. ఇష్టమయితే చెప్పు-ఫస్టియర్ బుక్సు తెప్పిస్తాను. ట్యూషన్లో కూడా జాయిన్ అవుదువుగాని" కొంచెం చిరాగ్గా అంటున్న నమ





యంలో తల్లి వచ్చింది.

పొద్దున్నే చెల్లెల్ని పిలిచి దగ్గర కూర్చుండ బెట్టుకొని ఏం మాట్లాడు తున్నాడోనని హడావుడిగా వచ్చినావిడ గుమ్మందగ్గరే ఆగిపోయింది ఆశ్చర్యంగా!

"అదేమిట్రా! ఇదా నువ్వు చెప్తున్నది. మంచిదే. పదవే... అవతల పొయ్యిమీద పప్పు మాడిపోతున్నది, దించెయ్యి" అనగానే లీల లేచి వెళ్ళిపోయింది.

"ఇప్పుడు మనం చూడవలసింది దాని చదువు, మెప్పు కాదురా! పెళ్లి కావాలి దానికి. ఈ పని అప్పుడే చెయ్యవలసింది. మీ నాన్నతోపాటు కలసి వంతపాడావు. ఇప్పుడేమో దాన్ని చదవమంటున్నావు. అదీ మనిషేరా! మీ చేతుల్లో కీలుబొమ్మ కాదు. అప్పుడే ఈ ఆలోచనవుంటే ఈసరికి ఎదురింటి పద్మలా ఎక్కడో దగ్గర జాబు చేసుకుంటూ వుండేది. నీకు పెళ్లి ఇష్టం లేకపోతే మానెయ్, మా పాట్లేవో మేము పడతాం. అంతేగాని దాన్ని రెంటికి చెడ్డ రేవడిగా చెయ్యకు. నీకు అంత సరదాగా ఉంటే చిన్నవాళ్లున్నారు–వాళ్ళను చదివించి ప్రయోజకుల్ని చెయ్యి" ఆవేశంగా నాలుగు దులిపేసి గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోయిందావిడ.

నోటమాట రానట్లు అయోమయంగా చూస్తుండిపోయాడు మిత్రా. అతడు బుద్దెరిగాక తల్లెప్పుడూ అన్నిమాటలన లేదు. తల్లి మనసులో ఇంత ఆలోచన వుందని గాని, ఇంత ఆవేశం వుందని గాని, ఆవిడ ఒకస్త్రీ అనిగాని ఎన్నడూ ఆలోచించని అతనికి చెంపపెట్టులా తగిలిందీ సవాల్!

స్త్రీ మనసు అగాధమైనదీ, మహత్తర మైనదీ కూడా అని తెలుసుకోలేని తన తెలివితక్కువతనాన్ని ఒక్కసారి నిందించుకొన్నాడు. 'అమ్మ..అమ్మ మనసులో ఎంత అగ్నిపర్వతం ఇన్నాళ్లు దాచుకుందో, ఇప్పుడు ఒక్కసారి బద్ద లయ్యింది. ఇంతటి ఆవేశాన్ని ఈనాటికి వెలిగక్కింది. అందుకే ఆడపిల్లకు తల్లి అండ అవసరం అంటారు. ఎంతచక్కగా చెప్పింది అమ్మ! అయితే వీళ్లు నన్ను స్వార్థపరుడిగా భావిస్తున్నారా? అలా అనుకోనివ్వను!

నిజమే లీలకు కావలసింది పెళ్ళి. శాయశక్తులా ప్రయత్నిస్తాను. అవసర మైతే స్మిత సహాయం కోరతాను! ఆలో చన ఓ కొలిక్కి వచ్చిన వాడిలా వెంటనే లేచి మామూలుగా హాస్పిటల్‌కి తయార య్యాడు. ముభావంగా వున్న తల్లిని చూసి బాధపడ్డాడు.

నామమాత్రంగా తల్లికి చెప్పి వెళ్లి పోయాడు.

అటు కొడుకు వెళ్లగానే ఇటు తల్లి మనసులో అణచి పెట్టిన ఆవేదనంతా పెల్లుబికి కన్నీరు రూపంలో బయటకు వచ్చింది. అలా ఎంత సేపుండిపోయేదో కానీ "అమ్మా! నాన్నగారు పిలుస్తున్నారు" అనే తమ్ముడి మాటకు ఉలిక్కిపడి గబ గబా కన్నీటిచారికలు తుడిచేసుకుంది.

* * *

"హల్లో డాక్టర్! బహుకాల దర్శనం" నవ్వుతూ ఆహ్వానించింది స్మిత. ఏదో వెతుకుతున్నట్లు చూస్తున్న అతని చూపుకి తత్తరపడి కళ్లుదించుకొంది స్మిత. తెచ్చి పెట్టుకొన్న ఉత్సాహం నీళ్లుకారిపోయింది.

'అరే! నేనెందుకిలా అయిపోతు న్నాను. నావృత్తి ధర్మం నేను పాటించాను. అతనికి తెలియని వింతేంకాదే! కొత్త కూడా కాదే! ఆ చూపు ఎందుకిలా కలవరపెడుతోంది?' వెంటనే తనలో తనే

సమాధానపరచుకొని తలెత్తి అతని మొహంలోకి చూసింది. ఆ చూపుకి చప్పున కళ్లుదించుకున్నాడు మిత్రా.

"ఈరోజు అలా విజిట్ కి వెళ్దామని... నాకు ఆఫ్ ఇవాళ! మీరు వస్తారా?" యథా ప్రకారం అయిపోయి ఫ్లవర్ వేజ్ లో వున్న ముద్దమందారాన్ని తిలకిస్తూ అన్నాడు మిత్రా.

"అవునవును. చాలా రోజులయింది అటు వెళ్లి. నేనూ వస్తాను! అలాగే వచ్చే టప్పుడు మన మహిళాసమాజానికీ వెళ్లి వద్దాం. మేనక, రజని పరిస్థితి బాగా మెరుగయినట్లు ఎలీజా చెప్తోంది. నాకు వెళ్లడం పడలేదు. మీకేం పనిలేకపోతే అలా వెళ్లి వాళ్ళను కూడా చూసివద్దాం" అంది స్మిత.

"అలాగే" అన్నాడు సంతోషంగా.

"అలా వెళ్ళికొంచెం టాక్సీని తీసుకు వస్తారా?" అంది లేస్తూ.

లేచి బయటకు వెళ్లాడు మిత్రా.

"మీ చెల్లెలి పెళ్లి ఎంతవరకు వచ్చింది?" స్మిత కారులో అడిగిన ప్రశ్న నిశ్శబ్దాన్ని పగులగొట్టింది.

"ఇంతవరకూ ఏ ఆశాలేదు. పోనీ చదువుకొంటావా అంటే యిష్టం లేద న్నట్లుగా ఊరుకుంది" చిన్నపిల్లాడు అమాయకంగా చెప్పినట్లు చెప్తుంటే గట్టిగా నవ్వింది స్మిత.

"అంటే ఏదో బాధ్యత వదిలించు కుందామన్నట్లు అడిగారన్నమాట. ఆ అమ్మాయి సరిగ్గానే చెప్పిందన్నమాట. పోనీ, ఏదన్నా మాచ్ చూసారా? ఆపది తనకు తానే బానిసబతుకు బతకాలను కుంటుంది ఎప్పుడూ! యింకెవరు మాత్రం ఏం చెయ్యగలరు?" తనలో తను అనుకొ న్నట్లు అంది. అంతలో దిగవలసిన స్థలం రావడంతో మిత్రా ఏదో చెప్పాలనుకొన్న వాడల్లా ఆగిపోయి దిగాడు. టాక్సీని వెయిట్ చెయ్యమని చెప్పి యిద్దరూ ఆ సందులోకి నడిచారు.

పంకజం అనారోగ్యంతో పడుంది. ఏదో నిశ్శబ్దత ఆవరించిన ఇల్లు మత్తె క్కిన కొండచిలువలా ఉంది. పంకజాన్ని చూసి మందులిచ్చాడు మిత్రా. ఏం మాట్లాడలేదు పంకజం. అమ్మాయిలు కొంతమంది వచ్చి చూపించుకొన్నారు. ఇద్దరు కొత్తగా వచ్చినట్లున్నారు. వీళ్ళను ఖాతరు చేయకుండా వెళ్లిపోబో తుంటే స్మిత ఆపింది.

ఆశ్చర్యంగా చూసారా యిద్దరూ.

"నీ పేరేమిటి?" ఒక అమ్మాయిని అడిగింది.

"మీరెవరు?" నిర్లక్ష్యంగా అడిగింది.

"ఇదేంపనో నీకు తెలుసా? తెలిసే వచ్చావా ఈ కూపంలోకి?" అడిగింది స్మిత.

"కావాలనే వచ్చాను. ఆడదానికింత కన్నా స్వేచ్ఛ ఎక్కడ లభిస్తుంది. ఇంత సునాయాసంగా సంపాదించి ఆనం దించే మార్గం మాత్రం ఏముంది? ఇంట్లో లేని కోరికలెన్నో తీరుతున్నాయిక్కడ. సరదా కోసమే వచ్చాను" విలాసంగా తన పొడవైన జడను చేతిలోకి తీసుకొని తిప్పుకుంటూ అంది.

"అంతేనా?ఇంకేమన్నా తెలుసా? ప్రతి జీవితానికి చివరి పేజీలు కూడా ఉంటాయి. మొదటి పేజీలు చదివి బాగుందనుకొంటే చాలదు. చివరకు ఏమవుతుందో ఆలోచిం చాలి. యిటువంటి బతుకులకు ముగింపు ఎలా వుంటుందో తెలిసే వచ్చావా? తింటే రుచి, దిగితే లోతు తెలుస్తాయన్న సంగతి




నీకు తెలిసుండదు" నచ్చచెప్తున్నట్లుగా మరోసారి అంది స్మిత. తన కివేమీ పట్టనట్లుగా పక్కకు తిరిగి పడుకొంది పంకజం.

ఆశ్చర్యంగా వుంది మిత్రాకి.

"ప్రతి జీవితానికి ఓ ముగింపు ఉంటుంది. నిజమే కాని అది ఊహించుకొంటూ ఇప్పుడీ ఆనందాన్ని పాడు చేసుకోవడం వివేకవంతుల లక్షణం కాదనుకొంటాను. అందరికీ అన్నీ అనుభవించే అదృష్టం ఉండదు. దక్కిన అదృష్టాన్ని దూరం చేసుకొని ఇంకా ఏదో పొందాలన్న ఆశకు చమురుపోస్తూ వెలుగుకోసం వెంపర్లాడడం నాకిష్టం లేదు. పాతికేళ్ళ నా ఈ జీవితంలో చాలామందినే చూసాను. చాలా బతుకుతెరువులూ చూసాను. చుట్టూ ఉన్న ఈ సంఘాన్ని చూసాను. అందినంత వరకూ అనుభవించి తరువాత కాలికింద తొక్కేసి తమకు తెలీసట్లు నడుచుకు పోయే పెద్ద మనుషుల్ని చూసాను. దరిద్రాన్ని చూసాను, అనుభవించాను. బతికి నన్నాళ్ళు హాయిగా బతక్కుండా ఈ బోడి నీతులు వల్లించుకుంటూ, నియమాల్ని కప్పుకుంటూ, చాలీచాలని ఇరుకు బతుకులు బతుకుతూ, అందరికీ భయపడుతూ ఎందుకు గడపాలి? అన్నింటి కన్నా సుఖమైన మార్గం ఇది."

"రేపటి మాటంటారా? మీరన్నట్లు భయంకరమైనదిగా ఉంటే ఈ లోకంలోనుండి నిష్క్రమించడానికి సాధనాలే కరువా? మీరేదో సంస్కరణ చేసారని విన్నాను. ఇక్కడనుండి ఎవర్నో కొంతమందిని తీసుకు వెళ్ళారటగా! అందుకనే మీకు చెప్తున్నాను. లేకపోతే మీకూ చెప్పవలసిన అవసరంలేదు. వాళ్ళ కోసం మీరేం చేసారు? ఏం చేస్తున్నారు?" ఆవేశాన్ని అణచుకొంటూ ఆగిందా అమ్మాయి.

విస్ఫారిత నేత్రాలతో చూస్తున్న స్మిత ఆ ప్రశ్నలకీలోకంలోకి వచ్చింది.

"నీతిగా బతుకుతున్నారు. ఆరోగ్యంగా వున్నారు" కోపంగా, అసహ్యంగా అన్నాడు మిత్రా కలుగజేసుకుంటూ.

పకపకమని నవ్విందా అమ్మాయి. మిగతావాళ్ళంతా తమాషాగా చూస్తున్నట్లు చూస్తున్నారు.

ఆ అమ్మాయినే చూస్తూ కదలకుండా కూర్చున్న స్మితవైపు అసహనంగా చూసాడు మిత్రా. ఆ చూపు అర్థంచేసుకున్నదాన్లా చూపులతోనే అతన్ని వారించి "మీరలా వెళ్ళి మిగతా ఇళ్ళు చూసుకురండి" అంది.

అయిష్టంగానే లేచి వెళ్ళాడు డాక్టర్ మిత్రా!

"ఇంతకూ నీ పేరు చెప్పావ్‌కాదు" నవ్వుతూనే అడిగింది.

"విలాసిని" నిర్లక్ష్యంగా అంది.

"పేరుకు తగినట్లున్నావ్! నాకు నచ్చావ్! కానీ...కానీ నువ్వు చాలా తక్కువ ఆనందం కోసం ఎక్కువ అందాన్ని అమ్ముకొంటున్నావ్! అయితే తరతరాలుగా వస్తున్న ఈ నీతి, శీలం, పెళ్ళి తతంగం, సంఘజీవనం – ఇవన్నీ వట్టి బూటకమేనంటావా? ఏం చదువుకొన్నావ్? ఇంత చక్కగా మాట్లాడుతున్నావ్?"

"ఇన్ని కబుర్లుచెప్తున్నారు? మరి మీరెందుకు చేసుకోలేదు? యింకా మీ జీవితానికి వెలుగునిచ్చే పురుషుడు దొరక

లేదేమిటి?"వ్యంగ్యంగా అంది. "విలాసిని!

"అయినా నాకెందుకు. మీ పేరే మిటో కూడా సరిగ్గా తెలియదు. కానీ కోరి పంజరంలో దూరాలని ఏ చిలకా అనుకోదు. నాకా జీవితంవద్దు. చుట్టూ చూసాను. అసంతృప్తితో వేగిపోతూ, మానసికంగా కృంగిపోతూ కృత్రిమ బతుకులు బతుకుతూన్న మేడిపళ్ళలాంటి సంసారాల్ని చూసాను. నా కదేంవద్దు. నన్నిలా బతకనివ్వండి!" విసుగ్గా అంది.

"విలాసినీ! ఎవరి వెలుగు వారు వెతుక్కుంటూపోతే మీలాంటివాళ్ళనీ పూబి నుండి ఎవరు రక్షిస్తారు? నా ఒక్క జీవితం ఏమయినా పరవాలేదు. కొందరి కన్నా కళ్ళు తెరిపిద్దామని యిలావున్నాను. అంతే! కానీ నీవెప్పుడన్నా నీ హృదయపు లోతుల్లోకి చూసుకొన్నప్పుడు నా ప్రశ్నలకి సరయిన సమాధానం దొరుకుతుంది. ఆ రోజు తప్పక నా దగ్గరకురా! నేను మొదలు పెట్టిన మహాయాగానికి ఒక చిన్న సమిధను అందించు. అదే నేను కోరేది. నీ తోటివాళ్ళు ఎలా ఒంటరిగా బతుకుతూ తాపత్రయంగా విధితో పోరాడుతున్నారో ఒక్కసారి వచ్చిచూడు"అంటూ లేచి నిలబడింది స్మిత.

విలాసిని ఇంక ఆ మాటలు వినలేనట్లు ఒక్క పరుగున లోపలికి వెళ్లి తలుపు మూసుకొంది. అమ్మాయిలంతా గుసగుస లాడుకుంటూ ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

"అయ్యిందాపని!" అన్నట్లుహేళనగా చూసింది పంకజం. "ఎందుకమ్మా ఆ కంఠశోష. హాయిగా వచ్చినపని చేసుకుపోక. అళ్లని తీసుకుపోయావా! ఉద్ధరిస్తున్నావుకదా" అంటూ అటు తిరిగి పడుకుంది.

ఒక్కసారి నిస్సత్తువ ఆవరించినట్లు, తనలోని శక్తి సంతటినీ ఎవరో లాక్కుపోయినట్లు బొమ్మలా నిలబడిపోయింది స్మిత. అంతలో డాక్టర్ రావడంతో తెలివి వచ్చినదాన్లా అతనివెంటే మౌనంగా నడిచింది.నిశ్శబ్దంగా ఆ గదిలో ఒంటరిగా నిలబడిపోయిన ఆమెను చూసి ఏదో అందామనుకొన్న మిత్రాకి ఆ అవకాశం ఇవ్వకుండానే గబగబా కారు దగ్గరకు నడిచింది స్మిత. తుఫాను రాబోయేముందు సముద్రంలా ఉంది స్మిత మొహం. ఎటో దూరంగా చూస్తూ మౌనాన్ని తింటూ కూర్చున్నాడు మిత్రా. కారు మలుపులు తిరిగి తిరిగి తిన్నగా మహిళా విహార్ దగ్గర ఆగింది. ఒక్కకుదుపుతో కలలో నుండి మేల్కొనవాళ్లలా ఒకరి వెంట ఒకరు దిగి లోపలకు అడుగుపెట్టారు. అపుడే హాల్లో సంరంభం మొదలయింది. చేస్తున్న పనులొదిలేసి అంతా వచ్చి ఎదురుగా నిలబడ్డారు. వాళ్ల మొహాల్లోని ఆనందం, తృప్తి స్మిత గాంభీర్యాన్ని చెదరగొట్టింది. ప్రశాంతంగా నవ్వింది.

అందరూ ఒక్కసారే ఏవేవో మాట్లాడంమొదలుపెట్టేరు.సరస్వతికుట్టిన బట్టలు చూపించింది. మేనక, వాణి అల్లిన రకరకాల ప్లాస్టిక్ బుట్టలుచూపిస్తే, మరో అమ్మాయి ఎంబ్రాయిడరీ చేసిన దిండు గలేబులు, కర్టెన్లు చూపించింది. అందరూ కలిసి అలా తోట్లోకి వెళ్లారు. పచ్చగా కళకళ్లాడుతూన్న పాదులు, 'మీ కృషికి ఫలితం మేము' అన్నట్లు తల లూగిస్తున్నాయి. అది చూసిన స్మిత హృదయాంతరాళం నుండి ఆనంద తరంగాలు వువ్వెత్తున లేచి కళ్లల్లో నిలిచాయి.

"ఇవన్నీ కొట్లోపెట్టి అమ్ముతున్నా

 

మండీ! తాజాగా ఉంటున్నామేమో బాగా చెల్లుబడి అయిపోతున్నాయి. ఈ చుట్టుపక్కల ఇళ్లు బాగా లేచాయి కదా ఇంక ఫరవాలేదు. కాకపోతే కొంతమంది అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక పోతున్నాము" అందిసరస్వతి నవ్వుతూ.

"ఆ! అవి ఎక్కడయినా వుండేవే. స్త్రీ ప్రగతికి 'స్త్రీ'యే పెద్దనిరోధకశక్తి. దాన్ని మనమెప్పుడూ పట్టించుకో కూడదు. సాధ్యమైనంతవరకూ అందమైన అబద్ధం చెప్పడం మంచిది. ఇంకేం భయం లేదుకదా" అంది స్మిత.

ఆ మాటకు ఏదో దాస్తున్నట్లు మొహం దించుకొని మౌనంగా ఉండి పోయింది.

మిత్రా అంతా వింటూ ఎదురుగా కూర్చున్నాడు.

"సరస్వతీ! మీలో మీరు ఏ నిజం దాచినా అది నిప్పై మిమ్మల్ని దహిస్తుంది. ఏం జరిగింది? ఎందుకు సంకోచిస్తున్నావ్! ఈ రకమైన జీవన విధానం మీకు అసం తృప్తి కలిగిస్తోందా? నాకు మనసు విప్పి చెప్పండి" అందరి మొహాల్లోకి ఒకసారి నిశితంగా చూస్తూ అంది.

"ఇలా మిమ్మల్నందర్నీ చూస్తోంటే నాకెంతో తృప్తిగా ఉంది. నా జన్మ ధన్యమై పోయినట్లుగా ఉంది, ఈ మాత్రం చేసా ననుకొంటేచాలు" అంటూ మళ్ళీ అడి గింది–"ఏం జరిగింది సరస్వతి?" ఆ కంఠంలో కొంచెం తీక్షణత వినపడింది. దాంతో సరస్వతి భయపడినదాన్లా విహ్వలంగా చూసింది.

"అది కాదండీ! మాకంతా బాగానే ఉంది. స్వేచ్ఛగా, స్వతంత్రంగా, హాయిగా ఉంది. ఈ పూట తిండి ఎలా గడుస్తుంది అన్న బాధలేదు. అందరం ఒక తాటిమీద నడవాలనే అనుకొని అలాగే నడుచుకొంటున్నాం. గిరిజకి మాత్రం ఏమీ బాగోలేదు. రాత్రయేసరికి పిచ్చిదానిలా అయిపోతోంది. మందిమ్మంటుంది. డాక్టర్ ఇచ్చిన టాబ్లెట్లు ఇస్తే విసిరి పారేస్తుంది. ఏవో పిచ్చిపిచ్చిగా వాగి, ఏడ్చి ఏడ్చి అలాగే నిద్రపోతుంది. తెల్లవారి మామూలుగా లేచి బాగా తిరుగు తూంటుంది. కానీ–అలసత్వం, నిర్లిప్తత, నిరుత్సాహంవల్ల ఏం చెయ్యలేకపోతోంది. డాక్టరు మందులు మార్చి మార్చి ఇచ్చారు గానీ ఏమీ గుణం కనబడలేదు" నెమ్మ దిగా చెప్పింది సరస్వతి.

"ఆమెని హాస్పిటల్‌కి తీసుకువెళ్లి టెస్ట్లు చేయించాలి. ఆవిడ మెంటల్‌గా డిప్రెస్ అయిపోయింది మిస్! సడన్‌గా వాతావరణం ఛేంజ్ అయ్యేసరికి ఇలా జరిగి వుంటుంది. బహుశా ఇది పిచ్చిలోకి దించు తుందేమోమరి" గబగబా రిపోర్టు ఇచ్చాడు మిత్రా.

"అలాగా...అయితే మీకు తెలిసిన డాక్టరు ఎవరన్నావుంటే ప్రయివేటు క్లినిక్‌కు తీసుకువెళ్ళండి. ఏం చెప్తారో చూసి అలా చేద్దాం. ఈ విషయం గిరిజ దగ్గర అనకుండా చెయ్యండి. సరే! ఇంకే మిటి సంగతి?"

"ఈమధ్య మగవాళ్లు ఎక్కువగా వస్తున్నారు. అందులో ఎవరికో మాలో ఎవరో తెలిసినట్లుంది. దాంతో అలుసుగా తీసుకుని ప్రవర్తిస్తున్నారు. ఆడవాళ్లు మాత్రం 'మీరెందుకు ఇక్కడే వుండిపోతు న్నారు? మీకు ఇళ్ళు, మీవాళ్లు లేరా? అసలు మీరంతా ఎవరు?' అంటూ ప్రశ్ని స్తున్నారు. సాధ్యమైనంతవరకూ జవా బులు చెప్తున్నాను. కానీ...కానీ...వాళ్ళ కేదో అనుమానం. వాళ్ల మగాళ్లు పాడయి

పోతారని భయం" గబగబా చెప్పింది సరస్వతి.

"ఇది పరిష్కారంలేని సమస్య. జవాబులేని ప్రశ్న. ఏం చేస్తాం? గూర్ఖా వున్నాడుగా...అంతగా మిమ్మల్ని ఎవరేమయినా అంటే నాకు కబురుపెట్టండి. సాధ్యమైనంతవరకూ మీరు జాగ్రత్తగా ఉండండి" అని చెప్పి వెళ్ళడానికుద్యుక్తురాలవుతూ లేచింది. మిత్రా మరోసారి అందర్నీ చూసి ఇవ్వవలసినవాళ్లకు మందులిచ్చి లేచి నిలబడ్డాడు. అందరి కన్నుల్లో ఆరాధన! బాదంకాయల్లాంటి కోల కళ్ళ నిండా అంతులేని ఆరాధనతో మిత్రాను చూస్తోంది సరస్వతి.

"డాక్టర్! మన కృషి ఎంతవరకు ఫలించిందంటారు?"

ఇంటికి రాగానే అడిగింది స్మిత.

"శ్రమపడినందుకు ఫలితం బాగానే దక్కించారు. ఆరోగ్యాలు కూడా ఇంచుమించు బాగున్నట్టే. వాళ్ల కాళ్ళ మీద వాళ్లు నిలబడగలిగే శక్తి సంపాదించుకున్నారు. ఇంతకన్నా ఏం కావాలి? మన





కృషి ఫలించిందనడానికి వాళ్ళ కళ్ళల్లో వెలిగే ఆనందమే కొలబద్ద" అన్నాడు మిత్రా.

"ఏమిటో డాక్టర్! ఇంతయినా నాకేదో అసంతృప్తిగానే వుంది. ఆ అమ్మాయ్-ఆ విలాసిని అన్న మాటలు నన్ను సవాల్ చేస్తున్నట్లున్నాయి. వీళ్లు ఇలా ఉండి పోవడమేనా ? బతికివున్నన్నాళ్లు తిండి, బట్టకు సంతృప్తిపడి వూరుకొంటారా? వాళ్ళ భవిష్యత్తేమిటి? వాళ్ళలో అసంతృప్తి చెలరేగకూడదు. చెలరేగిందంటే మన ప్రయత్నమంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది" నిస్పృహగా అంది స్మిత.

"అంటే ! ఇంకేం చెయ్యాలని మీ ఉద్దేశ్యం!" ఆశ్చర్యంగా అర్థంకానట్లు అడిగాడు.

"మీకర్థంకాలేదా? మరకతం, రజనీ వాళ్ళంటే బాగా అనుభవించి జీవిత మూడో భాగంలో అడుగు పెట్టబోతున్న వాళ్లు. కానీ...ఇంకా యవ్వనంలో వున్న సరస్వతి, వాణిలాంటివాళ్లు ఆ చీకటి తెరల్ని తొలగించుకుని వెలుగును చూడబోతున్న వాళ్ళ భవిష్యత్తేమిటి ? పని చేసుకొని తిండి, బట్ట గడుపుకొంటూ, ఏ మాధుర్యంలేని జీవితం గడిపెయ్యగలరా అనిపిస్తోంది. వాళ్ళకోసం ఏం చెయ్యలేమా ? ఆడదాని జీవితానికి ఆనందమైన, సంతృప్తికరమైన ముగింపు నిచ్చేది తల్లిపాత్ర. ఆపాత్రనిచ్చే అవకాశం



వస్తుందా అని చూస్తున్నాను" నిస్సహాగా వెనక్కి వాలుతూ అంది స్మిత.

స్మిత కళ్ళలో గూడుకట్టుకున్న నిరాశ, మొహంలోని దీనత్వం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. అయినా దానికి సమాధానం లేనట్లు మౌనంగా వుండి పోయాడు మిత్రా!

అతన్నుండి సమాధానాన్నాశించిన స్మితకు అతని మౌనం బాధాకరమే అయ్యింది.

నిట్టూరుస్తూ లేచి నిలబడింది.

"వస్తానండి" అంటూ వెళ్ళిపోయాడు మిత్రా.

* * *

"స్మితా! ఇదుగో నా వెడ్డింగ్‌కార్డ్" ఒళ్ళో పడేట్లు విసిరాడు అరవింద్.

"కంగ్రాచ్యులేషన్స్" సంతోషంగా అంది కార్డు తీసి చూస్తూ.

"అది నిన్ను రమ్మని పిలవడానికివ్వలేదు. నువ్వు రావలసినచోటు కాదు" హేళనగా అన్నాడు.

నవ్వింది స్మిత. పిచ్చివాడిని చూసి జాలితో నవ్వినట్లు నవ్వింది.

"అరవింద్! ఏదిరాకూడనిచోటో నాకు బాగా తెలుసు. నువ్వన్నట్లు ఒప్పుకుంటే దీనిమీద నా పేరుండేదికదూ? ఈ పెళ్ళి ఇలా జరిగేదా? అరవింద్! చిన్నప్పటి నుండి నన్ను నీ కోసం వాడుకొన్నావ్ కదూ! ఇంతవరకూ పెళ్ళి పేరు చెప్పి నా నోరు మూయించి నన్ను నీ బిజినెస్‌కి కాపిటల్‌గా పెట్టుకొందామనుకున్నావ్. కానీ అదేమిటోచిన్నప్పటి నుండీ నీ ఆలోచనలన్నీ చదివినట్లుగా నన్ను నేను దక్కించుకొన్నాను, నీ వూబిలో పడకుండా ఈ రోజు నన్ను ఇన్‌సల్ట్ చేస్తున్నాననుకొంటున్నావ్ కదూ! మానావమానాలు నాకు లేనేలేవు. ఇంక అవమానం చేసేదేముంది. ఇక్కడితో నన్నా ఈ కథ ముగిసిపోనీ!

"నువ్వెన్ని చేసినా, ఎన్ని అన్నా చిన్ననాటి స్నేహితుడవని, ఈ జీవన సౌధానికి మొదటి సోపానానివని ఎప్పటికీ మరచిపోను. నువ్వే మరచిపోతావ్... మరచిపోవాలి. ఇకనైనా పాత జీవితానికి స్వస్తి చెప్పి కొత్త జీవితానికి స్వాగతం పలుకు. నీ సహచరిణిగా వస్తున్న కొత్త అమ్మాయికి జీవితం తీయనిదనిపించు. అంతే!"

"స్మితా! నువ్వు కావాలి! నీతో గడిపిన ఆ తొలి అనుభవం కావాలి స్మితా! నాలో ఏదో బలహీనత నన్నలా అనిపింపచేస్తోంది. నీకు తెలీదు స్మితా! ఆనాటి నీ రూపు, నాతో పంచుకొన్న ఆ తొలి అనుభవం నాలో సజీవంగా వుండి నాకు ఊపిరి పోస్తుంది. నేనిపుడు నీకు దుర్మార్గుడిగా కనుపించొచ్చు. కానీ నిన్ను స్వంతం చేసుకోలేని అసమర్థత నన్నలా అనిపించింది. అంతే! చిన్నప్పటి నుండీ నీకేం చెయ్యలేకపోయాను. నీ పరిస్థితులను అలుసుగా తీసుకొని నా కోర్కెకు బలిచేసాను నిన్ను. నిన్ను అందుకోలేనంత దూరం నేనే చేసుకున్నాను" సంవత్సరాల తరబడి అహం అనే ముసుగులో దాగిన ఆవేదన ఆ చివరి క్షణంలో వెల్లువలా వురికింది.

అది చూడలేనట్లు కళ్ళు మూసుకొంది స్మిత.

"లేదు అరవింద్! నాకు నేనే ఈ ప్రయాణానికి టిక్కెట్టుకొనుక్కున్నాను. నువ్వేం చెయ్యలేదు. ఈ సమాజానికో సవాల్‌గా నా బ్రతుకును నేనే తీర్చి





దిద్దుకున్నాను. ఏదో చేద్దామని, ఇంకేదో సాధిద్దామని చేతనయినంత చేస్తున్నాను. ఇంకా చేస్తాను. అసలు నా ఈ వుద్యోగానికి మొదటిసారి జీతం నీ దగ్గరే తీసుకొన్నాను. చిన్ననాటి స్నేహితుడివి, నా మీద కాంక్ష పెట్టుకొన్న వాడివి అన్న ధైర్యం నన్ను నీ ముందు మొట్టమొదటిసారిగా నిలబెట్టింది. ఆ తరువాత చేయూతనిచ్చి నిలబెట్టి రక్షిస్తానన్నా రాలేకపోయాను. ఎందుకంటె నా జీవిత ధ్యేయం అది కాదు కనుక! నాలాంటి అభాగినులు ఈ సంఘంలో తయారవకూడదని నా కోరిక, ధ్యేయం. అంతే!"

ఇంక చెప్పవలసిందేమీ లేదన్నట్లు ఒక్క క్షణం మౌనం దాల్చింది. ఆ వెంటనే ఏదో గుర్తు వచ్చిందాన్లా "మీ ఆవిడ బావుంటుందా?" అంది అతని మొహంలోకి చూస్తూ! మెల్లగా మంద్రంగా మొదలయిన ఆ మాటల వరవడి గంభీరంగా సాగి సాగి ఆగిపోయి చివరి మాటకు చిందులు వేసింది.

"ఇదిగో!" జేబులో వున్న ఫొటో తీసి చూపించాడు.

"చాలా బావుంది అరవింద్! నీ బతుకులో వెన్నెల పూలే పూస్తాయి" తిరిగి ఇచ్చేస్తూ నిర్లిప్తంగా అంది.

కాసేపు మౌనంగా భాషించుకొన్న ఆ రెండు హృదయాలు మధురస్మృతుల మత్తు నుండి తేరుకుని విడిపోయాయి! అరవింద్ అది భరించలేనట్లు లేచి వడివడిగా వెళ్ళిపోయాడు.

విషాదంగా నవ్వుకొంది స్మిత.

ఒక అధ్యాయం ముగిసిపోయింది. ఇంక కనుపించడు బహుశ. చిన్నపిల్లాడిలా అసమానం, మారాం చేసే అరవింద్ మరిరాడు. అతడిప్పుడు గౌరవనీయుడైన గృహస్థు కాబోతున్నాడు. అంతే!

అతను వెళ్ళిపోయినా అతనన్న మాటలోని ఆవేదన సంజీవనిలా గతాన్ని తట్టి లేపింది స్మిత జ్ఞాపకాల్లోంచి.




ఆ రోజు ... ఆ రోజు పట్టుమని పది రూపాయల కోసం పది చోట్లకు తిరిగితే, ప్రతివారూ ప్రతిఫలం లేని అప్పు లేదన్నట్లుగానే మొండి చెయ్యి చూపారు. అప్పుడు తను నిజంగానే ఏడ్చింది. ఎస్.ఎస్.ఎల్.సి. చదువుతూన్న తన అందానికి, యవ్వనానికి పదిరూపాయలు విలువ కట్టిన మగాళ్ళనందర్నీ షూట్ చేసి పారెయ్యాలనీ, దిగంబరుల్ని చేసి మంచులో కూరెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఆఖరుకి ఎదురింట్లోంచి తన కోసం కాంక్షతో, ఆకలితో చూస్తుండే తోటి విద్యార్థి, అందగాడు అరవింద్ ముందు తను ఓడిపోయింది.

"అరవింద్ ! నా కర్జంటుగా పది రూపాయలు కావాలి!" అనడిగినపుడు...

"నాకేమిస్తావ్ మరి !" వేళాకోళంగా అన్నట్లున్నా కాంక్షతో వణుకుతున్న గొంతు నదిమిపెడుతూనే అన్నాడా మాటలు.

"మొగమాటం ఎందుకు? నీకా

వలసింది నేనే కదా!

సరేగానీ అలా అయితే పాతిక రూపాయ లవుతుంది!''

బేరంలోకి దిగుతున్న తనను భయంతో చూసాడు అరవింద్! అది చూసి పిచ్చిగా నవ్వింది తను.

అంతవరకూ మనసులో అగ్నిలా రగులుతున్న కసి, ద్వేషం కాలనాగుల్లా బుసలు కొట్టాయి ఆ క్షణంలో.

"అరవింద్ ! ఆలోచించటానికి వ్యవధి లేదు. ఎదురుగా మిఠాయిని చూస్తూ ఆశతో తినాలని నిలుచున్న కుర్రవానిలా ఇన్నాళ్ళూ నా వేపు చూస్తూ కూడా ఏమీ చెయ్యలేకపోయావ్! ఈ రోజు నాకు నేనుగా నీ ముందు నిలుచు న్నాను. అదయినా నీమీద కాంక్షతో, కోరికతో కాదు. నా అవసరం నన్ను తెచ్చి నీ ముందు నిలబెట్టింది. ఇన్నాళ్లూ నా వైపు కన్నెత్తి చూడ్డానికే భయపడి నట్లు చేసిన కవచంలాంటి నా దేవత చావు బతుకుల్లో వుంది. ఎక్కడకు వెళ్లినా 'ఏమిస్తావ్?' అనేవాళ్లే! ఆ ఇచ్చేదేదో ముందుగా నీకే ఇద్దామని, నీతోనే నాంది పలుకుదామని వచ్చాను. నా భవిష్యత్తుకు మొదటి సోపానంగా నిన్నే వేసుకుందా మనుకొని వచ్చాను. అలా అని మీ చుట్టూ తిరిగే అసహాయురాలిగా కాదు. నా చుట్టూ పిచ్చికుక్కల్లా మీ మగజాతిని తిప్పుకునే విధంగా రూపుదిద్దుకుంటాను. నా భవి ష్యత్తుకు పునాది వెయ్యి అరవింద్! రా'' అంటూ ఆవేశంగా అతన్ని అల్లుకు పోయింది. యవ్వనపు తొలి అను భూతిగా, భయంగా, చిత్రంగా గుండె జలదరిస్తుంటే ఆమెను కౌగిలిలోనికి తీసుకున్నాడు. తన మనసపుడా మొదటి సారిగా...అనుభవిస్తున్న ఆ తీయని అను భూతి మీద లేదు. అతనిస్తున్న డబ్బుమీదే వుంది. అదే జీవితంలోని చేదుకాబోలు. తర్వాత డబ్బు తీసుకొని వెళ్ళబోతూ...

''అరవింద్! అందరాడపిల్లల్లా కలలు కనే వయసులో వున్నా నేను మాత్రం కలల్లో లేను. నా ఈ అందాన్ని బజార్లో అంగడి వస్తువుగా పెట్టేముందు ఈడూ జోడూ అయిన నీతో, చిన్ననాటినుండి నన్నారాధిస్తూ నా కడగంటి చూపుకోసం తపించిపోతూ, నిప్పునేమోనన్న భయంతో దూరంగా వుండే నీకు కానుకగా ఇచ్చాను. అదే నాకు మిగిలిన తృప్తి. వస్తా!" అంటూ తలుపు తెరవబోయింది.

"కమలా ! నిన్ను విడిచిపెట్టను కమలా! పెళ్లిచేసుకుంటాను. నాకు నువ్వు కావాలి. కమలా... నువ్వు నా స్వంతం కావాలి" కళ్ళనీళ్ల పర్యంతం అవుతూ చిన్నపిల్లాడు తాయిలం అడుగుతున్నట్లు అడుగుతుంటే తను విసిరికొట్టింది.

"నువ్వా? నన్ను చేసుకుంటావా ? నమ్మేమాటలేనా ఇవి అరవింద్ ! ఇప్పుడే నా రేటు పుచ్చుకున్నాను కదా! అర్థం తెలిసేవుంటుంది. అంతే. అదంతే! నువ్వు నన్నుద్ధరించనక్కరలేదు"అంటూ తెల్లబోయి చూస్తున్న అతని మొహం మీదే తలుపు ధడేల్‌మని వేసి పరుగున ఇంట్లోకి వచ్చిపడింది. ఆరోజే తన ఆశలకోట కూలిపోయింది. తనసింత దాన్ని చేసిన దేవత రాలిపోయింది. మండిపోతున్న గుండెల్లో భవిష్యత్తు మించు పూవులా కాలిపోయింది.

ఆ తరువాత తనెంతో ఆశగా చూసింది-నిజంగా అరవింద్ పెళ్ళిచేసు కొంటాడేమోనని... కొన్నాళ్ళకు తన ఊహలు అబద్ధంకావనీ, ఆశలు నిరాశలనీ, మన సమాజం ఏ మాత్రం ముందడుగు





వెయ్యలేదనీ నిరూపిస్తూ కాలం ముందుకు పరుగు తీసింది.

అందంతో, తెలివితేటలతో, వయసు నేర్పిన అనుభవంతో తను ఓ వెలుగు వెలుగుతున్నప్పుడు మరలా వచ్చాడు అరవింద్. వయసు అతనికి నేర్పిన లోకానుభవాన్ని, ధనదాహాన్ని, తీర్చుకోవడానికి తనని ఫణంగా పెట్టాలనేవచ్చాడు. మొదటినుండి అతని ఆలోచనలు తెలిసిన తనేం తెలివితక్కువదా? అతనికన్నా ఏడాకులు ఎక్కువ చదివింది జీవిత పాఠాన్ని! అందుకే అప్పటికీ, ఇప్పటికీ అతని అవసరంలేకుండానే బిజినెస్‌చేసింది.

'అరవింద్! ఈ గతం అంత బాధాకరం ఇంకోటి వుండదు. ఇంకా ఇంకా గతం తవ్వుకొస్తోంది. ఇంక నేను తట్టుకోలేను ... అబ్బ ... ఆ జ్ఞాపకాలు నా మెదడును జెర్రుల్లా చుట్టివేస్తున్నాయ్...'

ట్రింగ్... ట్రింగ్... ఫోన్ శబ్దం ఆ ఆలోచనలనుండి లేపేసింది. నీరసంగా కళ్లు తెరచింది. సాలెగూడులో చిక్కుకున్న ఈగలా గతం నుండి వర్తమానానికి రావడానికి పెనుగులాడి కొంతసేపటికి బయటకి వచ్చింది మనసు.

"మిస్! ఫోన్" అంటూ ఎలీజా వచ్చి రిసీవర్ అందిస్తుంటే ఎందుకో పిచ్చిగా చూసింది.

"ఎందుకలా ఉన్నారు? మంచి నీళ్ళిచ్చేదా?"

తలూపింది తను కళ్లనిండా నీళ్లతో. తెచ్చిచ్చిన చల్లటి నీళ్లు గటగట తాగేసింది. మరుక్షణంలో వాస్తవానికొచ్చి "హల్లో! స్మితా హియర్!" అంది మౌత్ పీస్ దగ్గరుంచుకొంటూ.

"అదేమిటి అంత నీరసంగా ఉంది గొంతు. ఒంట్లో బాగులేదా?" అన్నాడు శేఠ్ అటునుండి.

"మీరా శేఠ్‌జీ! అదేంలేదే బాగానే ఉన్నాను. ఏం పని?" మామూలుగా అవుతూ అడిగింది.

"ఏంలేదు. ఈ రోజు రాత్రికి మీ ఇంట్లో ఎంగేజ్ చేయాలి. సౌత్ నుండి వచ్చాడు మా పార్టనర్ ఒకతను. ఇద్దరం కలిసివస్తాం. అతన్ని అప్పచెప్పి నేను వచ్చేస్తాను. ఓ.కే. స్మితా! నువ్వు అతన్ని స్వర్గసుఖాల్లో తేలించావంటే నువ్వెంత కోరితే అంత ఇవ్వగలడు" అన్నాడు శేఠ్.

"నా సంగతి మీకు బాగా తెలుసు గదా!" నవ్వింది స్మిత.

"అందుకేకదా నీ దగ్గరకు పంపిస్తున్నాను. ఇంతకు ముందే సఫైర్‌లో కొత్త అమ్మాయి ఉందని ఫోన్‌చేసాడు ప్రొప్రయిటర్. కాని, నిన్ను మించిన సుందరాంగులెవరున్నారు" అంటూ మరోమారు పొగిడేసి "ఉంటాను మరి. ఎనిమిదింటికల్లా అక్కడ ఉంటాం సరేనా!" అంటూ ఫోన్ పెట్టేసాడు.

ఫోన్ క్రెడిల్ మీదుంచి గట్టిగా నిశ్వసిస్తూ వెనక్కి వాలింది. అంతలో గుర్తొచ్చిందాన్లా...

"ఎలీజా! రాత్రికి గెస్టులు వస్తున్నారు. రూమ్ అంతా మార్చేసెయ్. నాకు కొత్త మోడల్ డ్రెస్ వచ్చిందేమో కనుక్కొని వస్తే తీసుకురా. ఫ్రిజ్‌లో అన్నీ రెడీచేసి పెట్టు" అంది.

"ఎస్ మిస్!" అంటూ లోపలికి వెళ్లిపోయింది ఎలీజా. అన్నీమరచి సోఫాలో అలాగే వాలిపోయింది స్మిత.

* * *

మర్నాడు శేఠ్ పంపిన చెక్‌చూసి కళ్లు తళతళలాడాయి. అప్పుడే స్నాన

మడిచేసి తీరిగ్గా కూర్చుంది. సోఫాలో పుస్తకం తిరగేస్తూ! స్టీరియో నెమ్మదిగా, మంద్రంగా వెస్టరన్ మ్యూజిక్ విని పిస్తోంది. షాంపూ చేసిన తల నెమ్మదిగా గాలికి కదులుతూ సన్నని సువాసన వెదజల్లుతోంది. శరీరంనుండి వెలువడు తున్న ఫారిన్ సెంట్ పరిమళం గదంతా వ్యాపించి, మంద్రంగా తీయని ఊహలు రేపి అలసటను దూరం చేస్తోంది. పుస్తకం టీపాయ్‌మీద పడేసి లేచి నిలుచుంది. ఎంతో ఉత్సాహంగా, గర్వంగా, ఆనం దంగా ఉంది. ఏం చెయ్యాలో తోచడం లేదు. అలా ఎక్కడికన్నా వెళ్దామను కొంది.

అంతలో 'బాలు' వచ్చాడు మహిళా విహార్‌నుండి "ఎవరో వచ్చారంటూ!"

"ఏం బాలూ! ఏమిటి సంగతి" ఆత్రంగా అడిగింది.

"ఎవరో వచ్చారు మీరుంటే తీసుక రమ్మన్నారు సరస్వతమ్మగారు"

"ఆడవాళ్లా, మగవాళ్లా?" హడావుడి పడిపోతూ అంది.

"ఆడవాళ్లేనండీ!" అనేసరికి కొంత స్థిమితపడింది.

"సరే పద! ఆటో పిలు" వాడిని పంపి తను డ్రెస్ చేసుకోవడానికి లోపలికి వెళ్ళింది.

"ఎలీజా! నేను మహిళావిహార్‌కి వెళ్లి వస్తాను. తరువాత ఫోంచేస్తాను. తలుపు వేసుకో" అనిచెప్పి ఆటో ఎక్కింది.

ఆటో మహిళావిహార్ ముందు ఆగ గానే స్మితకు ఎదురొచ్చింది సరస్వతి.

''ఎవరొచ్చారు సరస్వతీ! ఎందు కొచ్చారు?'' ఆత్రుత అణచుకోలేక గేటు దగ్గరే అడిగేసింది సరస్వతిని.

"ఎవరో మహిళాసమాజం వాళ్లట. 'ఇదెవరు నడుపుతున్నారు? ప్రెసిడెంటు ఎవరు? మీరంతా ఎప్పుడూ ఇక్కడే వుంటారేమిటి?' అంటూ అడుగుతుంటే ఏం చెప్పాలో తెలీక మీకు కబురు చేసాను!" అంది లోపలికి నడుస్తూ. ముందు హాల్లో చాపమీద కూర్చున్నా రిద్దరు. మరో ఇద్దరు కింద కూర్చోవడా నికిబ్బంది పడుతున్నట్టుగా నిలబడే ఉన్నారు.

స్మితను చూడగానే కూర్చున్న ఇద్దరూ లేచి నిలబడ్డారు. అతిగా అలంక రించుకొని, ఉన్న నగలన్నీ దిగేసుకొచ్చి నట్లు ఇద్దరూ, సింపుల్‌గా వున్నామంటూ ఖరీదయిన నగలు, చీరలు కట్టుకొని ఇద్దరూను. వారు స్మితను ఎగాదిగా చూస్తూ నిలబడిపోయారు. ఆమె సౌందర్యానికి విభ్రాంతులయినట్లు స్థంభాల్లా నిలబడి పోయారానలుగురూ.

"ఎవరండీ మీరు? కూర్చోండి!" అంటూ స్మిత చనువుగా చాపమీద కూర్చునేసరికి తప్పదన్నట్లు తామూ కూర్చున్నారు.

"మేము అభ్యుదయ మహిళామండలి వాళ్లం. మాది గవర్నమెంట్ రికగ్న యిజ్డ్. ఇక్కడ కొత్తబోర్డు చూసి వచ్చాం. ప్రెసిడెంటు ఎవరో, ఎలా నడు స్తుందో చూసివెళ్దామని వచ్చాం. మీరే నన్నమాట ప్రెసిడెంట్. మీవారేం చేస్తుం టారు? మీరు ఏ క్లబ్బు మెంబరు? దీనికి మీరొక్కరేనా, ఇంకెవరయినా అసి స్టెంట్లు వున్నారా?" ఊపిరాడకుండా ప్రశ్నల వర్షం కురిపించేసారు ఒకొక్కరే వంతులవారీగా.

"నేను ఏ క్లబ్బులోనూ మెంబర్ని కాను. దీనికి ప్రెసిడెంటునూ కాను. సాటి





స్త్రీగా అనాథలకు ఏదో చేయాలనిపించి వారి సహకారంతో ఏదో చేస్తున్నాను. అంతే! మీ సమాజంవాళ్లు ఏం చేస్తుంటారు?" అడిగింది స్మిత.

"మా ప్రెసిడెంటు, మేము కలిసి పదిహేను రోజులకో మీటింగు పెట్టుకొంటాం. ఆటల పోటీలు అవీ నిర్వహిస్తుంటాం. లైబ్రరీ మెయింటేన్ చేస్తున్నాం. అప్పుడప్పుడు పిక్నిక్‌లు, పార్టీలు చేసుకుంటాం. బీదలకు అన్నదానం చేస్తుంటాం. కొత్త కళాకారిణులతో ప్రోగ్రామ్స్ ఏర్పాటుచేసి వాళ్ళనుత్సాహపరుస్తుంటాం. మొన్న వరదల్లో బాధపడినవాళ్ళకు బట్టలవీ సేకరించి తిండి గింజలతోపాటు మా సమాజం తరపున సప్లయి చేసాం. పేపర్లో పడిందే, మీరు చూళ్లేదా?" ఏకధాటిగా ఉపన్యాసమిచ్చింది ఒకామె.

సెక్రటరీ కాబోలనుకొంది స్మిత.

"మీరెందుకు వచ్చారో తెలుసుకో వచ్చా?" కుతూహలంగా అంది స్మిత.

"అబ్బే ఏం లేదు. ఊళ్ళోకల్లా పెద్ద మహిళా సంస్థ మాది. ఇటువంటి చిన్న చిన్న సంస్థలు ఏర్పడినప్పుడు మేము వాటికి కావలసిన ఆర్థిక సహాయం అందచేసి మా అనుబంధ సంస్థగా చేసుకొంటాం. అలా అయితే మెజారిటీ వుండి ఏం చెయ్యడానికైనా బాగుంటుంది. ఇంతకీ ఎవరు వాళ్ళు.. అనాధలా?ఎక్కడినుండివచ్చారు? మీకిటువంటి ఉద్దేశం ఎలా కలిగింది?"

"పిళ్లా...పిళ్లు... నిజం చెప్తే మీరు భరించలేరేమో! వీళ్ళు నిజంగా అనాధలే. వీళ్లని ఒక బ్రోతల్ హౌస్‌నుండి తెచ్చాను. వాళ్ళకిష్టంలేని పనిని వాళ్ళతో బలవంతంగా చేయిస్తూ డబ్బు సంపాదించే యంత్రాల్లా వాడుకుంటున్న యజమాని నుండి విడదీసి తెచ్చి ఈ ఏర్పాటు చేసాను. ప్రస్తుతం బాగానే వున్నారు" స్మిత మాట్లాడుతుండగానే లేచారు వాళ్లు వెళ్ళడానికుద్యుక్తులవుతూ.

ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోవడం స్మిత వంతయింది ఈసారి.

"క్షమించండి. ఇటువంటి వాళ్ళతో చేతులు కలిపి మా సంస్థ అభివృద్ధికి నిరోధకులం కాలేం. ఇంతకూ మీరెలా వెళ్ళగలిగారక్కడికి? ఏ సంసారి అడుగు పెడుతుంది ఆ కొంపల్లో. మీవారొప్పుకున్నారా?" అంది సెక్రటరీలా ఉన్నామె.

'ఇంతకీ ఇదీ అలాంటి సరుకే కాదు కదా?!' అన్నట్లు చూశారు మిగతావారు సంజ్ఞలు చేసుకుంటూనే. ఒకావిడ అననే అంది "మీకాకొంపలతో బాగా పరిచయం ఉందా?" అని వ్యంగ్యంగా.

"ప్లీజ్ గో ఎవే! సభలు, సమావేశాలు చేస్తారట. ఫేషన్ పెరేడ్లుచేస్తూ పదవులకోసం మీలో మీరు తన్నుకుచచ్చే మీరా నన్నవమానపరచేది! మీ అభివృద్ధి అంతా చీరల్లో, ఫాషన్లలో, అందాల పోటీల్లో చూపించుకుంటున్నారు అంతేనా? మీతో నాకు ఏ అవసరంలేదు. మరో నిజం చెప్పనా? నేనూ వాళ్లలాంటిదాన్నే! కాకపోతే కాస్త పెద్ద బిజినెస్ చేసేదాన్ని. మీ భర్తల్ని అడిగితే నా గురించి తెలుస్తుంది. నేనలాంటిదాన్ని గనుకే నా జాతి వాళ్లను నేను కాపాడుకొంటున్నాను. ఇక మీరు వెళ్లొచ్చు" అంటూ లేచిన స్మితను చూస్తే భయం వేసినా ఆఖరు మాటకి వాళ్ల మొహాలు పాలిపోయాయి. ఎవరో వెంట తరుముతున్న వాళ్ళలా హడావుడిగా బయటకు నడిచారు.

"దొంగా దొంగే. అందుకే అలా కబుర్లు చెప్తోంది. అసలా సునీతననాలి ఇలాంటి కొంప గురించి గొప్పగా చెప్పి నందుకు" రుసరుసలాడుతూ, తిట్టుకుంటూ గేటుదాటారు వాళ్లు.

ఆవేశంలో కందిపోయిన స్మిత మొహంలో ఎరుపుదనం ఇంకా తగ్గలేదు. అసమిస్తున్న భానుడిలా వాళ్ళు వెళ్ళిన వేపే చూస్తూ "హు! ఇలాంటి మహిళా సమాజాలుండబట్టే మహిళల అభివృద్ధి ఇలా ఏడుస్తోంది" అంది వాళ్లకు విన పడేలా కాస్త విసురుగా.

ఎంతో ఆహ్లాదంగా వున్న మనసంతా చేదు మాత్ర మింగినట్లు అయిపోయింది.

ఈ సంఘటనతో మాటలే కరువైనట్లు మూగగా ఉండిపోయారంతా.

"రజని ఏది?" అకస్మాత్తుగా గుర్తు వచ్చినదాన్లా అడిగింది స్మిత.

"లోపల పడుకొంది" చెప్పింది మేనక.

వెంటనే లోపలికి వెళ్ళి చూసింది స్మిత. అక్కడున్న ఒకే ఒక్క మంచం మీద అస్తవ్యస్తంగా పడివుంది.

పీక్కుపోయిన మొహంలో అస్థిమితంగా కదిలే మూసిన రెప్పల కింద కనుపాపలు, అశాంతిగా నిద్ర పట్టనట్లుగా

కదిలే తల, వడలిన శరీరంతో దయనీయంగా పడివుంది. ఆ అమ్మాయినా స్థితిలో చూసిన స్మిత కళ్లల్లో నీళ్లు తిరిగాయి. చప్పున అవి తుడుచుకొంటూ...

"డాక్టరుగారు రాగానే హాస్పిటల్‌కి తీసుకు వెళ్తానంటే పంపండి" అంటూ వెళ్ళడానికి ఉద్యుక్తురాలవుతూండగా మరకతం, వాణి వంట ముగించుకు వచ్చి చేతులు తుడుచుకుంటూ నిలబడ్డారు.

"వంటయిందా? ఏంకూర చేసారు?" నవ్వుతూ అడిగింది స్మిత.

"తోటకూర పులుసు చేసి, బెండకాయలు వేపుడు చేసాం" జంటగా చెప్పారు ఉత్సాహంగా.

"అన్నీ మన పెరట్లో పండించినవే" అంది మేనక.

"వెరీగుడ్ ఇంకేం!" అంటూ బయలుదేరింది స్మిత.

* * *

కాలం నత్తగుల్లలా సాగిపోతోంది. సరస్వతి, వాణి, మేనకలకు చదువుకోవాలనుంది. ఆ మాట ఒకసారి స్మితతో చెప్పారు.

"ఓ...అంతకంటేనా? నాకు చాలా రోజులనుండి ఉంది ఆ ఉద్దేశ్యం. కానీ పరిస్థితులు అనుకూలించడం లేదు. ఇంటికి వచ్చి చెప్పడానికి ఆడవాళ్ళు ఒప్పు

కోవడంలేదు. మగవాళ్ళను పెట్టాలంటే పరిస్థితులు ఎటునుండి ఎటు తిరిగిపోతాయోనని భయం. అయినా ఆలోచిద్దాం" అంది. తరువాత మిత్రా వస్తే ఆలోచించి ట్యుటోరియల్ కాలేజిలో చేర్పించింది. కానీ వీళ్ళ గతం తెలుసుకొన్నందు వల్ల ఆ కాలేజీలో ఎంతోకాలం సాగలేదు వాళ్ల చదువు. "అయ్యో ఎందుకు వచ్చాం చదువుకొనేందుకు!'' అన్నంత బాధపడి చివరికి ఆ ప్రయత్నానికి స్వస్తి చెప్పారు.

'ఈ సంఘంలో స్త్రీకి రక్షణ లేదా? బూజుపట్టిన భావాలకు అంతంలేదా? స్త్రీ ప్రగతికి స్త్రీయే అడ్డుపడుతూందేమిటి? దీనికి మూలం ఎక్కడుంది?' ఇలా ఆలోచిస్తూ ఎంత సేపుండిపోయిందో స్మిత. మిత్రా రాకతో తెలివి తెచ్చుకొంది.

''ఏం డాక్టర్! ఎంతవరకూ వచ్చింది మీ ప్రయత్నం?"

'ఏం కాలేదన్నట్టు' సిగ్గుగా తలదించు కొన్నాడు.

"పరీక్షకు కట్టి పాసయితే ఏదన్నా వుద్యోగం చేసుకుని బతుకుతారేమో నన్న ఆశ నాకూ, వాళ్ళకూ కూడా వుంది డాక్టర్! ఆలోచన బాగానే వుంది గానీ ఆచరణే సాధ్యం కావడంలేదు. కొన్ని కొన్ని పనులు ఆలోచనలవరకూ అమోఘంగా వుంటాయి. వాటికి ఓ రూపం ఇద్దామనుకొనేవేళకు శిలాసదృశాలవుతాయి. ప్రతి మనిషికి ఏవేవో సమస్యలుంటూనే వుంటాయ్. జీవితమే సమస్యలపుట్ట. కొందరు కోరి సమస్యలను సృష్టించుకొంటారు. అలాగే నేను కావాలనే వీటిని సృష్టించుకొని మన శ్శాంతి లేకుండా చేసుకొన్నానేమో అనిపిస్తుంటుంది ఒక్కోసారి'' నిర్వేదంగా అంటున్న స్మితను మౌనంగా చూస్తూండిపోవడం తప్ప ఏమీ అనలేకపోయాడు మిత్రా.

* * *

ఊళ్ళోకి కొత్త డి.యస్.పి. వచ్చాడు. వచ్చిన దగ్గరనుండి రెయిడింగ్స్ ఎక్కువయ్యాయి. ఏమాత్రం ఆలోచించకుండా కేసు బుక్ చేసేసుకోమని ఆర్డర్స్ జారీ చేసాడట. దాంతో భయపడి ఏ హోటల్ ప్రొప్రయిటరు ధైర్యంచేసి పిలవడంలేదు స్మితను. సాగర్‌కి మాత్రం అప్పుడప్పుడు డాన్స్ ప్రోగ్రాంకు వెళ్లి వస్తోంది. పైగా పాతరోత అనుకున్న కొత్తవాళ్ళంతా కొత్త కొత్త మొహాలను చూసుకోవటం సహజం. అయినా స్మిత ఒంపుసొంపులమీద, ఆట పాట మీద మోజు తగ్గించుకోలేని పాతవాళ్ళు కబుర్లు పెడుతూనే ఉన్నారు. అంచేత అప్పుడప్పుడు తప్ప రోజూ పని వుండడంలేదు. మిత్రా హాస్పిటల్ వర్క్‌లోపడి ఎక్కువగా రావడంలేదు. ఉన్న ఈ అరడజను మందికి ఏదో దారి చూపిగానీ కొత్తవాళ్లను తేవాలనుకోవడంలేదు. అంచేత అటు వేపులకు వెళ్లేపని లేకపోతోంది. అప్పుడప్పుడు మహిళా విహార్‌కి వెళ్ళి వాళ్ళ బాగోగులు చూసి వస్తోంది అంతే! రజని మాత్రం అలౌకికానందం పొందే జగత్తుకు వెళ్లిపోయింది 'అందరికన్నా అదృష్టవంతుడు పిచ్చివాడే' అన్నట్లు రజని మెంటల్ హాస్పిటల్‌లో వుండిపోయింది.

ఆమెకిప్పుడు ఏ బాదరబందీలేదు.

ఓ రోజు బద్ధకంగా పడుకొని ఆలోచిస్తున్న స్మిత ఎవరో లేడీ వచ్చారని చెప్తే ఆశ్చర్యంగా లేచివెళ్లింది.

ఆ వచ్చిన యువతి హాలు నిశితంగా పరిశీలిస్తోంది. స్మితను చూసి చేతులు





జోడిస్తూ నిలబడింది.

స్మితకు ఒళ్ళంతా జలదరించినట్ల యింది. పాతిక ముప్ఫయి ఏళ్ళమధ్య నున్న ఆ యువతి సంస్కారం ఆకర్ష ణీయంగా వుంది. "కూర్చోండి" తనూ చేతులు జోడిస్తూ అంది స్మిత.

సోఫాలో కూర్చుని స్మితను కన్నార్ప కుండా చూస్తుండిపోయిందామె ఒక్క క్షణం.

"మీరు..." అంటూ అర్ధోక్తిలో ఆగి పోయింది స్మిత, ఆ చూపులకు ఇబ్బం దిగా ఫీల్ అవుతూ.

"ఓహ్! అయామ్ సారీ! నా పేరు సునీత. మిమ్మల్ని చూస్తూ కూర్చుంటే మాట్లాడాలనిపించడంలేదు. నేను అభ్యు దయ మహిళామండలిలో మెంబర్ని. మా వాళ్ళు మీ దగ్గరకు వచ్చారనుకొంటాను" అంది తనను తాను పరిచయం చేసు కుంటూ.

ఆ మాట వినగానే తాడు పామై వచ్చి కరవబోయినట్లనిపించింది. ఆమె వచ్చి నప్పటినుండి మనసులో పొంగుతున్న స్నేహభావాన్ని తుడిచివేస్తున్నట్లు అసహ నంగా లేచి నిలబడిపోయింది స్మిత.

"దయచేసి కూర్చోండి. నన్నపార్థం చేసుకోకండి. ఆరోజు జరిగింది విన్నాను. క్షమాపణ చెప్పుకుందామనే వచ్చాను" కూర్చున్న చోటునుండి కదలకుండా స్థిరంగా, గంభీరంగా అంది సునీత.

ఆమె వైఖరి చూసిన స్మిత తప్ప దన్నట్లు కూర్చుంది. కాసేపు మౌనంగా వుండి గదిని, స్మితను నిశితంగా పరికిం చిన సునీత గొంతు విప్పింది. తను చెప్పింది వినడానికి సిద్ధంగా కూర్చున్న స్మితను చూసేసరికి మనసు పులకించింది.

ఆమె గొంతులోని ఏదో మాధుర్యం గదంతా వ్యాపించి వెన్నెట్లో ఏటి ఒడ్డున కూర్చుని మధుర గీతం వింటున్న అను భూతి కలిగింది స్మితకు.

"నేను మొదటినుండీ అంటే ఊహ తెలిసిన దగ్గరనుండి ఆదర్శాలను వల్లె వేసుకుంటూ, స్వేచ్ఛావాయువులు పీల్చు కుంటూ చదువు ముగించాను మా నాన్న, అన్నయ్యల అండతో. బహుశా ఆయన ఆశయాలు నాలో రూపుదిద్దుకొన్నా యనే కాబోలు దేనికీ అడ్డుచెప్పలేదు. నా వివాహం కూడా నా ఆశయాలకు, ఆశలకు అనుగుణంగానే జరిగింది. అంటే జీవితం వడ్డించిన విస్తరి అయింది అనుకోండి. నా గొప్పతనం చాటుకోవాలని మీకు చెప్పటం కాదు. ఏదన్నా సంఘసంస్కరణ చెయ్యాలని, ఈ వ్యభిచారాన్ని రూపుమాపి ఆడది అంటే ఆటబొమ్మ కాదనీ, కాకూడ దనీ, మోసపోయిన అబల జీవితం ఆత్మ హత్యతో అంతం కాకూడదనీ, శీలాన్ని చౌకబారుగా అమ్ముకోకూడదనీ, ఆ పద్ధతికి స్వస్తి చెప్పాలనీ-ఇలాంటి ఆశ యాలు ఎన్నో వుండేవి. కానీ, నేనేమీ చెయ్యలేకపోయాను. కనీసం ఒక్క అమ్మాయినన్నా చేరదీసి ఆపని మాన్పించి సక్రమమైన మార్గంలో వుంచలేక పోయాను..."

చెప్పి ఊపిరి తీసుకోవడానికన్నట్టు ఆగింది. అంతలో ఎలీజా రెండుగ్లాసుల్లో ఏపిల్ జ్యూస్ తెచ్చిచ్చింది. అది తాగాక కొంచెం స్థిమితపడి మళ్ళీ మొద లెట్టింది.

"మహిళామండలిలో చేరాను. కానీ అక్కడ నేనూహించినదొకటి, జరిగింది మరొకటి అయ్యింది. డబ్బు, హోదా ఉన్నవాళ్ళకే అక్కడ స్థానం కాని ఏదో

చేతిపనులు నేర్చుకొని బతుకుతెరువు మార్గం కోసం వచ్చినవాళ్ళకు విలువ తక్కువ. నాకు వీలయినంత వరకూ మనస్ఫూర్తిగా పనిచేస్తున్నాను. ఎప్పటి కయినా 'అలాంటి అవకాశం రాక పోతుందా?' అని ఎదురుచూస్తున్నాను. అంతలో మీ హోమ్ చూసాను. మా వాళ్ళకు చెప్పి పంపాను. కానీ...అజ్ఞానం అనే గుల్లతో నత్తల్లా ముడుచుకొన్న మూర్ఖులు వాళ్ల. అందుకే అలా అన్నారు. మీకే సహాయం కావలసినా చెయ్యడానికి నేను సిద్ధంగా వున్నాను. మీరు తలపెట్టిన ఈ మహత్కార్యానికి వుడతా సహాయం చేస్తాను. నా అనుభవాలు, ఆశలు అన్నీ మీకు చెప్పేసాను. ఇంక వెళ్ళమంటారా? మళ్ళీ రమ్మంటారా ?" నవ్వుతూ అడిగింది సునీత.

చిత్తరువులా వింటున్న స్మిత ఆ నవ్వుకు జీవం వచ్చినదాన్లా...

"భలేవారే!" అంటూ తనూ నవ్వేసింది.

"మీరెలా చెయ్యగలిగారు? అసలు మీకీ వూహ ఎలా వచ్చింది? ఎలా వాళ్ళను తీసుకురాగలిగారు? ఇప్పుడేం చెయ్యాలనుకొంటున్నారు?" నెమ్మదిగా అడిగింది సునీత.

"నా గురించేం చెప్పలేదా మీవాళ్ళు? చెప్పివుండరు. లేకపోతే ఇంత తీరిగ్గా ఇల్లు వెతుక్కుంటూ రారు! అవునా?" అంది స్మిత.

"అహ! అదేం కాదు. వాళ్లేదో చెప్పారనుకోండి! అయినా మిమ్మల్ని స్వయంగా కలుసుకోవాలని వచ్చాను. వాళ్ళు అన్నది నిజమే అయితే ఇది ఆశ్చర్యకరమైనదే! మీరూ అదే పని చేస్తూ ఇంకొకళ్లని రక్షించడమన్నది వింతయిన విషయమే! మీరెందుకలా చేస్తున్నారు? ఒక మాట అంటాను మరేం అనుకోకండి. మనం సక్రమంగా ఆచరించదగిననాడు ఇంకొకరికి చెప్పే అర్హత కలిగి వుంటాం! మీరెందుకీ మార్గాన్ని ఎన్నుకొన్నారు?" నెమ్మదిగా మొదలయిన గొంతు కొంచెం తీవ్ర స్థాయిలో, ఆవేశంగా పలికింది చివరికి.

నవ్వింది స్మిత. "మీరు కనీసం ఒక్కమ్మాయినన్నా రక్షించాలనుకొన్నారు. కానీ మీకది సాధ్యం కాలేదు. మీరు ప్రయాణం చేసే మార్గం అందుకు భిన్నం అయినది. మీ దారి వదిలి ఇందులోకి వచ్చారంటే ముళ్ల డొంకలో ఇరుక్కున్నట్టే అవుతుంది. అవునా? మీ డబ్బు, సంఘం, గౌరవం వేరు. అవి వదిలి తెగించి ఇలాంటి పనులు చెయ్యలేరు. మీ చుట్టూ వున్నవాళ్ళు చెయ్యనివ్వరు. ఒక్క రోజన్నా మారుమూలనున్న ఏ బ్రోతల్ హౌస్‌కు అయినా వెళ్లారా? వాళ్ళ కష్టసుఖాలు తెలుసుకోగలిగారా? లేదు. ఎందువలన? అటువంటి చోటులో అడుగుపెట్టాలంటే మీకు భయం. సంఘం మీ కేరెక్టర్ మీద ఎక్కడ ముద్ర వేస్తుందోనని. ఒక జాతి పక్షి ఇంకో జాతి పక్షిని చేరనివ్వదు కదా! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలనే సూక్తిని వినలేదా? నేను మీలాంటి రాజబాటనే ఎంచుకుంటే నన్ను నేను సంఘం అనే పంజరంలో బంధించుకొన్నదాన్నవుతాను. ఆ శృంఖలాలు తెంచుకొనే నేర్పు, ఓర్పు నాకూ వుండవు. అందుకే సులభంగా, సునాయాసంగా వెళ్లిరాగలుగుతున్నాను. వెళ్ళిరాగల మార్గాన్ని నేనే ఏర్పరచు




కొన్నాను. మీలా భయం లేదు నాకు. అందువల్లనే ఆ కొంపల్లో తిరిగి తిరిగి, ఇష్టం లేకుండా బలవంతంగా ఆ వూబిలో కూరుకుపోతున్నవాళ్ళను డబ్బుపారేసి విడిపించుకొచ్చాను. తరువాత ఆర్థిక సమస్యఒకటి. నేనేదో ఉద్యోగం చేస్తూ సంపాదించుకొంటూ ఒంటరిగా ఈ సంఘంలో నిలబడి ఇలాంటి పనులు చెయ్యగలనా? ఆ వుద్యోగం సంపాదన ఏ మూల ? అందుకే నేనీ మార్గాన్ని ఎన్నుకున్నాను. సాధించాను. ఇంకా సాధిస్తాను !"

దృఢంగా స్థిర చిత్తంతో అంటున్న స్మితను ఆరాధనగా చూసింది సునీత.

"మిమ్మల్నిలా చెయ్యమని పురికొల్పిన పరిస్థితులెంత బలీయమైనవో! ఏదయినా ఒక ఆశయం సాధించడానికి వెనుక బలవత్తరమైన కారణం వుంటుందని నా విశ్వాసం" అంది సునీత.

"నిజమే అనుకోండి ! ఆదా ... అదంతా ఓ పీడ కల. అయినా నన్నెవరూ మోసం చెయ్యలేదు. నాకు నేనే నిర్ణయించుకుని ప్రారంభించాను. ఇంతకూ మీరేంచేస్తున్నారు? మీరేమయినా సహాయం చెయ్యగలిగితే, మీకేం అభ్యంతరంలేదనుకొంటేనే...బాగా ఆలోచించు కొని చెప్పండి."

"ఏమిటో చెప్పండి. నాకు చేతనయిన సహాయం చేస్తాను. నేను ఇక్కడ ఉమెన్స్ కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్‌గా పని చేస్తున్నాను. చెప్పండి"ఉత్సాహంగా అంది సునీత.

"మరేంలేదు. మాహోమ్‌లో ఇద్దరమ్మాయిల్ని మెట్రిక్ పరీక్షకు పంపాలనుకొంటున్నాను. వాళ్ళకి ఇంట్రస్టుగా ఉంది. కానీ ట్యూషన్ కుదరడంలేదు. లేడీటీచర్లు అంగీకరించడం లేదు. మగవాళ్ళను పెట్టడం ఇష్టం లేదు. మీకభ్యంతరం లేక పోతే మీ యింటికి వాళ్ళను పంపిస్తాను. కోచింగ్ ఇవ్వగలరా?"

"ఓ! తప్పకుండా. ఆ మాత్రం చెయ్య గలిగితే నాకెంతో తృప్తిగా ఉంటుంది. తప్పక చేస్తాను" అంది సునీత.

"బాగా ఆలోచించండి. తొందరపడి మాట ఇవ్వకండి. మీవారు ఏమన్నా అబ్జక్ట్ చేస్తారేమో! ఇరుగు, పొరుగు..."అంటూ అర్ధోక్తిలో ఆగిపోయింది.

"ఇందాకటి సంఘటన చెప్పాకకూడా మా వారిమీద నమ్మకం కలగలేదా? ఇక ఇరుగు, పొరుగు అంటారా...లెఖ్ఖచేసే తత్వంకాదు నాది"

"మీ ఇల్లు ఎక్కడ ?"

"మీ హోమ్‌కు దగ్గరే మా ఇల్లు"

"ఏ టైములో పంపమంటారు ?"

"సాయంత్రం ఆరునుండి ఏడువరకూ చెపాను. అక్కడికివెళ్ళి నా అడ్రసు ఇస్తాను వాళ్ళకి. మనం మళ్లీ కలిసే దెప్పుడు?" అంది లేవబోతూ.

"అరే ! కూర్చోండి వెళ్ళురుగాని. మళ్లీ మళ్లీ నా యింటికి వస్తారో రారో, నా జీవితంలో అపురూపమైన ఈ కాలాన్ని మరి కాస్త పొడిగించండి. ఈ మధురక్షణం నా గుండెల్లో దాచుకొంటాను ఎంతో గుపంగా!" నెమ్మదిగా మృదువుగా వెలువడుతున్న ఆ మాటలు ఏదో లోకంలో నున్నట్లున్న స్మిత హృదయపు లోతుల్లో నుండి వచ్చినట్లున్నాయి! చలించిపోయింది సునీత ఆ ఆప్యాయతకు.

"ఛ...ఛ... అలా అనకండి. నా అంతట నేను కావాలని వచ్చాను మిమ్మల్ని చూడాలని. చూశాక యింక ఎలా

రాకుండా వుంటాను" నిర్మలంగా నవ్వుతూ అంది.

"అహ...అహ...వద్దు,వద్దు. మీరిక్కడకు అసలు రావద్దు. ఏమన్నా మాట్లాడాలంటే ఫోన్ చేస్తే నేనే విహార్‌కి వస్తాను. మాట్లాడుకొందాం. నేను మీ యింటికి రాను. మీకు తెలీదు సునీతా! ఈ మనుషులు చాలా దుర్మార్గులు. మంచితనాన్ని అలుసుగా తీసుకొని మనసులు విరిచే 'కుసంస్కారులు'. మల్లెవంటి మనసులనయినా మసిచేసి మాడ్చేస్తారు. ఈ రాకపోకలు మీ జీవితంమీద ఎటువంటి ప్రభావం చూపి చీకటి చెయ్యకూడదు. మీలాంటి వాళ్లు కోటికొక్కళ్ళున్నా ఇలాంటి అభాగినుల సంఖ్య తగ్గించవచ్చు. ఎందుకన్నా మంచిది మీ వారితో ఒకసారి చెప్పి అప్పుడుసరస్వతికిచెప్పండి. ఫీజుకూడా!" ఉద్విగ్నతనిండిన కంఠంతో అంది స్మిత.

"భలేవారు. ఫీజు తీసుకొని చెప్పనా? పుణ్యం అంతా మీరే మూటకట్టేసుకోవాలనుకొంటున్నారా? నాకిటువంటి అవకాశం వచ్చినందుకే ఎంతో ఆనందంగా ఉంది. ఆ అవకాశం ఇచ్చినందుకు మీకు నా కృతజ్ఞతాభివందనములు!" అంటూ రెండుచేతులు జోడించి లేచింది సునీత.

అంతలో ఎలీజా రెండు కప్పులతో టీ తెచ్చి ఇచ్చింది.

"ఇపుడేకదండీ జ్యూస్ తీసుకున్నాను."

"మన మాటల్లో టైము తెలీలేదు కానీ అరుగంటల టైము తీసుకొంది" అంటూ టీ కప్పు సునీతకు అందించింది. టీ తీసుకొని మరొక్కసారి మనసారా వీడ్కోలు పలికి మెట్లు దిగింది సునీత.

కనుమరుగయ్యేంత వరకూ చూస్తూ నిలుచుండిపోయిన స్మితకు ఆత్మీయులెవరో దూరమైపోతున్న అనుభూతి కలిగింది.

'ఒక పెద్ద సమస్యకి పరిష్కారం దొరికింది. సరస్వతి, వాణి మెట్రిక్ పాసవుతారు. సునీత ఇలాంటి కొద్దిమంది సహకారమైనాలేకపోతే తనేంచెయ్యగలదు? దేవుడు దయామయుడు. వాళ్లకో దారి చూపిస్తున్నాడు. భగవాన్, నా ఆశయాన్ని సాధించానన్న తృప్తి చివరి క్షణంల్లోనైనా నాకు ప్రసాదించు! అంతే నేను కోరుకునేది!' వెనక్కివాలి మంచంమీద పడుకున్న స్మిత మెదడులో ఆలోచనలు గిరగిర తిరగసాగాయి — ఆ గదిలోని సీలింగ్‌ఫాన్‌లాగ!

* * *

"మిస్! డాక్టరుగారు వచ్చారు" ఎలీజా మాటకు ఉలిక్కిపడి సర్దుకుని కూర్చుంది.

విష్‌చేసి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు మిత్రా.

"ఏమిటి సంగతి, ఎలా ఉన్నారు? బాగా బిజీగా వున్నట్లున్నారు" ఆనందం తొణికిసలాడే గొంతుతో అంది స్మిత.

సిగ్గు పడుతున్నట్లు తల దించుకొన్నాడు చిన్నగా నవ్వుతూ.

"మీకో గుడ్‌న్యూస్ చెప్పనా? సునీత అని ఎకనామిక్స్ లెక్చరర్, అభ్యుదయ మహిళామండలి మెంబరు తనకు తానే తెలుసుకొని నా దగ్గరకు వచ్చింది. మన వాళ్ళకు ట్యూషన్ చెప్పి పరీక్షకు పంపే పూచీ తనది అని ఒప్పుకొంది. నిజంగా నాకెంతో సంతోషంగా వుంది డాక్టర్. మీలాంటివాళ్ళ సహకారం ఉంటే ఏమన్నా చెయ్యగలనన్న ధైర్యం నాకుంది" అంటూ ఆనందోత్సాహాలతో అంటున్న స్మిత కళ్లల్లోని మెరుపు తీగెలతో దండలల్లుకొంటున్న మిత్రా మొహంలోఅవ్యక్తమైన భావస్పందన రేగింది.





"ఏమిటలా చూస్తున్నారు? మీరసలు వింటున్నట్లు లేదు" గోముగా అంది స్మిత.

తొలకరి తాకిన భూమాతలా పులకించిన దేహాన్ని అదుపులో పెట్టుకొంటూ నవ్వేసాడు.

"అహ! లేదు. వింటున్నాను" తడబడుతూ అన్నాడు.

కిలకిల నవ్వింది స్మిత.

"ఇంతకూ మీ లీలపెళ్ళి విషయం ఏమయింది?" మాట మారుస్తూ అంది.

"అదే! ఆ విషయం మీతో చెప్దామనే వచ్చాను. సంబంధం కుదిరిపోయింది" సంతోషంగా అన్నాడు.

"కట్నం ఎంత?"

"పదివేలు"

"అంతకట్నమే. ఎలా మరి?"

"ఏముంది, కాస్త అప్పు చెయ్యడమే! ఏదో విధంగా దాని బాధ్యత తీరిపోతే ఇంట్లో అందరికి మనశ్శాంతి" అన్నాడు.

"పెళ్లెపుడు?" అంది స్మిత.

"వచ్చే నెలలో! ముహూర్తం పెట్టుకొని వెళ్లిపోయారు. సరిగ్గా ఇరవై అయిదు దినాలుంది. సరేగానీ మొన్న హోమ్‌కి వెళ్ళివచ్చాను. అందరూ బాగున్నా రజనిలో మాత్రం ఏమీ మార్పు రాలేదు. నన్నేం చెయ్యమంటారు? ఒకసారి అలా వెళ్దామంటారా?"

"సరే! పదండి. నాకూ ఏం తోచడం లేదు" అంటూ బయలుదేరింది స్మిత. విలాసిని ఎలా ఉందో చూడాలన్న కోర్కె కూడా ఉంది మనసులో.

తిన్నగా పంకజం ఇంట్లో అడుగు పెట్టారు. పంకజం అలా మంచంపట్టే ఉంది. అమ్మాయిలు వచ్చి మందులు తీసుకొని వెళ్ళిపోయారు. విలాసిని గురించి అడిగింది.

"ఎవరో చంపిపారేశారమ్మా!" విషాదంగా అంది పంకజం.

ఛెళ్ళున కొరడాతో కొట్టినట్లయింది. "ఎలా? ఎవరు? ఎప్పుడు?" ఆతృతగా అడిగేసింది స్మిత.

"బేరం చూసుకొని వస్తుంటే దారిలో ఎవరో అడ్డుకొని నానా హంగామా చేసి చంపేసారు. రిక్షా బంగారయ్య భయపడి పరుగెత్తుకు వచ్చిచెప్పాడు. మనోడు వెళ్ళేసరికే అంతా అయిపోయింది. గప్‌చిప్‌గా నోరు మూసుకు వచ్చేసాడు. ఎవరు పడతారమ్మా ఈ పోలీసోళ్ళ, కేసులు? నాకు చూస్తే బాగులేదు. ఎలాగొచ్చిందో అలాగే పోయింది. అయితే అంత అందమైనది, సుకుమారమైన పిల్ల ఇంతవరకూ ఈ ఇంటికి రాలేదనుకో. ఈ మందంతా వున్నారంటే బాగా తినడానికే!" అంటూ కళ్ళు వత్తుకొంది. మాట రానట్లు వుండిపోయింది స్మిత కొంతసేపు. పది రోజుల క్రితం.. ఎవరో అమ్మాయిని అమానుషంగా హత్య చేసారని పేపర్లో చదివిన సంఘటన గుర్తొచ్చింది. సవాల్ చేస్తున్న విలాసిని అందమైన మొహం కళ్ళముందు కదిలి ఒళ్ళు జలదరించింది. ఇక అక్కడ కూర్చోలేక వెంటనే బయలుదేరిపోయింది. మిత్రా మస్తాని ఇంట్లో వుంటే అక్కడకు వెళ్లి లాక్కొచ్చి టాక్సీలో కూలబడింది. మనసంతా దిగులు గూడు కట్టుకొని అప్రయత్నంగా కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. రుమాలుతో మొహం కప్పేసుకుంది.

ఈ సంగతి తెలియని మిత్రా కంగారు పడిపోయి "ఏం జరిగింది? ఎందుకేడుస్తున్నారు? అక్కడ మిమ్మల్ని ఎవరయినా ఏమయినా అన్నారా?" కంగా



రుగా అడిగాడు, మొహం మీద రుమాలు తీసేస్తూ!

కళ్లు ఎర్రగా అయి వుబ్బి వున్నాయి.

చలించిపోయాడు మిత్రా!

“ఏమయింది? చెప్పండి!” రెట్టించి అడిగాడు.

“డాక్టర్! విలాసిని హత్య చెయ్యబడింది... దుర్మార్గులెవరో బలవంతంగా చంపేసారట!” దుఃఖాన్నాపుకొంటూ అంది స్మిత.

“అరే!” ఆశ్చర్యంగా వుండిపోయాడు.

ఎట్లాగో ఇంటికొచ్చారు. మిత్రా కూడా లోపలికి వచ్చి కూర్చున్నాడు. కానీ మనసు నిండిన వేదన వాతావరణాన్నలముకొని ఇద్దరి గొంతులు మూగపోయాయి. ఓ గంట అలాగే కూర్చుని వెళ్లిపోయాడు మిత్రా!

మిత్రా వెళ్లిపోయాక బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయి ఎన్నడూ లేనిది డ్రింక్ తీసుకొని మంచం మీద వాలిపోయింది.

ఆశ్చర్యపోయింది ఎలీజా! ఏదో అప్పుడప్పుడు కంపెనీ కోసం లైట్‌గా తీసుకోవడమే కానీ ఇలా తాగడం తనకు తెలీదు ఇన్నేళ్లుగా!

స్మిత తెలివి లేకుండా పడుకుని వుండడం చూసి... విలాసిని మరణం ఆమె మీద ఎంత దెబ్బ తీసిందో ఆలోచిస్తూ వుండిపోయింది.

* * *

“డాక్టర్! మీకు ఫోన్ వచ్చింది” సిస్టర్ వచ్చి చెప్పగానే సెలైన్ నీడిల్ ఎక్కిస్తున్న మిత్రా ఆ పని పూర్తిచేసి వచ్చి రిసీవర్ అందుకొన్నాడు. అవతల నుండి పెద్ద తమ్ముడు హరీంద్ర గొంతు.

“అన్నయ్యా! నువ్వు అర్జంటుగా రావాలి! నాన్నగారు పడిపోయారు” ఆత్రంగా పలికింది.

“సరే వస్తున్నాను. తలకింద బాగా




ఎత్తు పెట్టండి" హడావిడిగా చెప్పి లీవ్ లెటర్ రాసి పెట్టేసి వెళ్లిపోయాడు.

ఇంటికి వచ్చేసరికి బిక్క మొహాలతో మంచం చుట్టూ వున్నారు. మిత్రాను చూడగానే ఏడ్చి ఏడ్చి దానిమ్మపువ్వుల్లా ఎర్రబారిన కళ్ళను ఎత్తి ఒక్కసారి నిరసనగా చూసి పక్కకు తప్పుకొన్న తల్లిని ఆశ్చర్యంగా చూసాడు.



"అం జరిగిందమ్మా! ఎలా పడి పోయారు పల్స్ చూస్తూ అడిగాడు ఆతృతగా.

తల్లి సమాధానం చెప్పకపోయే సరికి "ఏం, ఏం చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?" ఇంజక్షన్ సిద్ధం చేస్తూ విసుగ్గా అడిగా

"ఓ గంటవుతుంది!" అంది లీల.

ఇంజక్షన్ చేసి హార్ట్ బీట్ చూస్తూ పక్కనే కూర్చున్నాడు. ఓ పావుగంట కంతా నార్మల్‌కి రావడం చూసి కొంచెం స్థిమితపడ్డాడు.

"ఏం జరిగింది లీలా-సడన్‌గా ఎందుకిలా జరిగింది?" నెమ్మదిగా అడిగాడు పక్కకు పిల్చి.

"ఇదిగో! ఈ ఉత్తరం చదుతూనే వెనక్కి పడిపోయారు" అంటూ తండ్రి తలగడ కింద దాచిన ఉత్తరం చదవమని ఇచ్చింది.

'అంతా సిద్ధమయిపోయింది. ఇంకా పదిహేను దినాలుంది పెళ్లి! ఇలా పడిపోవలసినంత బలపత్తరమైన సంఘటన ఏముంది?' ఆలోచించుకుంటూ ఉత్తరం మడత విప్పాడు.

"మీ అబ్బాయికి ఎవరో క్లబ్బు డాన్సర్‌తో సంబంధం వుందట. దాంతో కలిసి ఊరుమీద తిరుగుతుంటాడట. తెలిసి తెలిసి ఇటువంటి సంబంధం చేసుకోలేం" - అది అందులోని సారాంశం. మిత్రా పిడికిళ్లు బిగుసుకొన్నాయి. తల్లి చూసిన చూపు గుర్తొచ్చింది.

తండ్రి కొద్దిగా కదలడంతో ఆవేశాణ్ణనచుకొంటూ చూసాడు. పల్స్ నార్మల్‌కి వచ్చాయి. వెంటనే నిద్రపట్టడానికో ఇంజక్షన్ ఇచ్చి ఇవతలకు వచ్చాడు. ఆ నిమిషంలో తండ్రి కళ్లు తెరుస్తే తను ఎదురుగా కనబడితే ఇంకేం లేదు.. ప్రయాస అంతా వృధాఅవుతుంది. ఇంజక్షనిచ్చి తన గదిలోకి వెళ్లి కూర్చున్నాడు. తల పగిలిపోతోంది. జుట్టు పీక్కుని పిచ్చివాడిలా గెంతాలన్పిస్తోంది.

'ఇదేం న్యాయం? వాళ్లు చేసుకునేది లీలనా, తననా? రంగుటద్దాలు వేసుకొన్నవాడికి లోకమంతా రంగులమయంగా కనుపిస్తుంది. తను మనసా వాచా ఒక సంఘ సంస్కర్తకి చిన్నసాయం చేస్తే దానికిదా ప్రతిఫలం? పోనీ, తను ఎవరినో ఉద్ధరించాలనుకొని అయినవాళ్ల భవిష్యత్తుని కాలరాస్తున్నాడా? దానిలో తన ప్రమేయం ఎంతవరకూ వుంది? ఎంత మూర్ఖులీ మనుషులు?

ఎక్కడ నాగరికత పెరుగుతోంది? ఎక్కడ మానవత వికసిస్తోంది? కాలం ఎటుపోతోంది? స్టేజిలమీద ఉపన్యాసాలిచ్చేవరకే పెరిగింది నవనాగరికత. చివరకు పదివేలు కట్నం తీసుకొన్న ఆ బలిపశువుకు కూడా తోచలేదా? ఛీ... ఛీ... ఏం మనుషులు..' మెదడంతా వేడెక్కిపోతోంది.

"అన్నయ్యా! భోజనానికి రా" హరీంద్ర పిలుపుతో ఈ లోకంలో కొచ్చాడు.

"వద్దురా! ఆకలి లేదని చెప్పు. నాన్న లేచారా?" అంటూ గదిలోకి వెళ్ళి చూశాడు. నిశ్చలంగా ఇంటిపైకప్పువైపు చూస్తున్న తండ్రి చూపులు తనమీద పడగానే కుంచించుకుపోతూ తలదించేసుకున్నాడు. అసహనంగా చూపులు తిప్పేసుకున్నా రాయన.

చివుక్కుమన్న మనసు అదుపులో పెట్టుకొంటూ వెళ్లి చేతినందుకున్నాడు పల్స్ చూడాలని.

"ఎందుకురా నన్ను బతికిస్తావ్! ఇంకొకప్పుడయితే నా రక్తం ధారపోసి చదివించిన నా డాక్టర్ కొడుకు నన్ను బతికిస్తుంటే ఎంతో సంతోషించేవాడిని. కానీ ఇప్పుడు నీ చేతుల్లో నాకు చావే ఆనందంగా వుంటుంది. నిన్ను తలంచు





కొని ఒకనాడు ఎంతో గర్వించాను. ఇప్పుడు... ఇప్పుడు..." ఆయాసంగా ఆగారు. "ఈ కష్టనిష్ఠూరాలు బాధ్యతగా భరించినప్పుడు నా కోరిక ఎంత సమంజస మైనదో నీకే తెలుస్తుంది" అన్నారు నిరసనగా.

"నాన్నా! మీ ముందు తలవంచుకొని, మీరు తలవంచుకునేంత సిగ్గుమాలిన పని నేనేమీ చెయ్యలేదు. అంత తెలివితక్కువ వాడిని, చిన్నవాడిని కాదు. అయితే ఆమెతో కలిసి వెళ్ళడం నిజమే. అది డ్యూటీ వరకే. నాకీ ఉద్యోగం రాక ముందు ఒకరింట్లో ఫామిలీ డాక్టరుగా వున్నానని చెప్పానే, జీతం తెచ్చిచ్చే వాడినే.. అదయినా సంస్కరణ పేరుతో దారిద్ర్యపు బాధలోపడి డబ్బుకు అమ్ముడుపోయి మనసు చంపుకొని చేసాను. ప్రతిఫలం తీసుకునే చేశాను. అదే తప్పయితే, నన్ను క్షమించండి. ఆ పనే ఈ ఇంటికి మచ్చ తెచ్చి లీల సంబంధం పాడయిందంటే నా మనస్సెంత క్షోభ పడుతోందో మీకెలా చెప్పాలి? ఎలా చెప్తే అర్థమవు తుంది?"

ఆ నిముషంలో తండ్రి పరిస్థితిగాని, అప్పుడు చెప్పొచ్చా చెప్పకూడదా అనిగాని తోచలేదు. అతని మనసులో రగిలే ఆవేదన ఆవిరి రూపంలో కళ్ళలో నీరు నిలిచింది. విచక్షణా జ్ఞానాన్ని పోగొట్టింది.

ఆ చెప్తున్న మాటలతో ఏసంబంధమూ లేనట్లు నిర్లిప్తంగా కళ్ళుమూసుకు పడుకున్న తండ్రిని మరోసారి తీక్షగా, మౌనంగా చూసి బయటకు నడిచాడు.

వంటింట్లో వున్న లీలను పిలిచి కొన్ని మాత్రలు ఇచ్చి ఎలా వెయ్యాలో చెప్పి, చెప్పులు వేసుకుని గబగబ వీధిలోకి వెళ్లిపోయాడు. అతని మనసంతా చిక్కులు పడిన దారపుండలా అయింది. అప్రయత్నంగానే స్మిత ఇంటి వైపు కాళ్లు లాక్కు వెళ్లాయి.

తలుపు తీసిన ఎలీజా ... "మిస్‌కి ఫీవర్ పడుకొన్నారు" అంది పక్కకు తప్పుకుంటూ! ఆ మాట అతని మనసు నావరించియున్న చికాకును పారద్రోలి ఆతృతను నింపింది.

"ఎప్పటినుండి? ఎలా వుంది?" ఆతృతగా బెడ్‌రూమ్‌లో అడుగు పెట్టాడు అనాలోచితంగా!

లోపలికడుగు పెట్టిన మిత్రా కళ్లు చెదిరాయి ఒక నిముషం. అతనెప్పుడూ ఆ గదిలో అడుగు పెట్టలేదు. తెల్లని మబ్బు తునకల మీద వుయ్యాలలూగు తూన్న దేవకన్యలా వుంది స్మిత— తెల్లని మల్లెపూవులాంటి దుప్పటి పరచిన మంచంమీద.

చప్పుడుకు కళ్ళుతెరచిన స్మిత...

'కూర్చొండి' అన్నట్లు సైగచేసింది. ఎదురుగావున్న సోఫాలో కూర్చున్నాడు కన్నార్పకుండా ఆమెనే చూస్తూ! కాసేపు తను డాక్టరునన్న విషయం కూడా మరచిపోయాడు.

"ఏమిటలా వున్నారు? మీకు వంట్లో బాగులేదా?" నెమ్మదిగా అడిగింది స్మిత.

అప్పుడు కర్తవ్యం గుర్తొచ్చింది.

"బాగానే వున్నాను. ఇంతకూ మీ కెలావుంది? ఎవరికన్నా చూపించు కొన్నారా?" పల్స్ చూస్తూ అడిగాడు.

"రాత్రి నుండే జ్వరం — వళ్లునొప్పు లుగా వుంది. ఏదో మీ సాహచర్యంవల్ల కొన్నికొన్ని వైద్యాలు నాకు తెలిసాయి కదా! టేబ్లెట్లు తెప్పించి వేసుకున్నాను.

కాస్త తగ్గినట్టే అనిపించింది కానీ మళ్లీ ఇప్పుడే వచ్చినట్లుగా వుంది. మీరున్నారుగా, నేనింకెవరి దగ్గరకు వెళ్తాను" అంది స్మిత.

ఆ మాటకు గాలిలో తేలిపోయినట్లయింది అతని మనసు! వెంటనే టెంపరేచరు చూసి టేబ్‌లెట్స్ రాసాడు. అంతలో ఎలీజా బార్లీ పట్టుకు వస్తే తాగి లేచి కూర్చుంది.

కాళీ గ్లాసు, మందుల చీటీ పట్టుకొని వెళ్ళిపోయింది ఎలీజా.

"మీరేం అలా వున్నారు?" మరలా అంది.

ఆ గది అందాన్ని పరిశీలిస్తున్న మిత్రా...చూపులు ఆమె మీదనిలుపుతూ అన్నాడు—

"ఎలా వున్నాను?"

"ఏదో పెద్ద అపరేషన్ చేసి అలసిపోయి వచ్చినట్లు బాగా అలసటగా వున్నారు"

"ఏంలేదు, మానాన్నగారికి కొద్దిగా హార్ట్ ఎటాక్ వచ్చింది. ఆయనకు ఎటెండయి వస్తున్నాను" అన్నాడు కొంచెం హీనస్వరంతో తలవంచుకొని.

"ఉహు! అదికాదు... మీరేదో దాస్తున్నారు" అంది పెదవి బిగిస్తూ తల అడ్డంగా తిప్పుతూ!

ఆశ్చర్యంగా తలెత్తి చూసాడు.

"కేవలం అదే అయితే మీ మొహంలో చికాకు, అలసట వుండవు. భయం, ఆందోళన వుంటాయి. అవునా?" నిశితంగా అతన్నే చూస్తూ అంది.

"మీరు... మీరు... మీకేమన్నా ఎస్ట్రాలజీ తెలుసునా?" ఇంకా ఆశ్చర్యపోతూ అన్నాడు.

"అమాత్రం మనుషుల మనసుల్ని అర్థం చేసుకోకపోతే ఈ మహారణ్యంలో ఎలా బతుకుతున్నాను" తిరిగి ప్రశ్నిస్తూ నవ్వేసింది.

"నిజమే మీరన్నది" పైపంటితో కింది పెదవిని నొక్కుకుంటూ తలదించుకున్నాడు.

"లీల సంబంధం తప్పిపోయింది!" నిశ్శబ్దాన్ని పేలుస్తూ తుపాకి గుండులా వెలువడిందా మాట.

"అరే! ఎలా? ముహూర్తం చాలా దగ్గర్లో వుందే!" విలవిల్లాడుతూ అంది స్మిత.

"కాన్సిల్ అయిపోయింది. అంతే! అది అంతే. పెళ్ళి ఆగిపోతుంది! నేను...ఎవరితోనో తిరుగుతున్నానట. నా కేరెక్టరు మంచిదికాదట. కనుక నా చెల్లి పెళ్ళికి అనర్హురాలట. చూసారా ఎలా వుందో?" ఉద్రేకంగా అన్నాడు.

అర్థమయిపోయింది స్మితకు నిట్టూరుస్తూ వెనక్కి వాలిపోయింది.

స్మితనుండి మౌనమే సమాధానమయేసరికి వుద్వేగపడిపోయాడు.

"ఛీ...ఛీ...ఇలాంటి వాళ్ళనందర్నీ షూట్ చేసెయ్యాలి. నా యిష్టంవచ్చినట్లు నేను తిరుగుతాను. దానికి, దీనికి సంబంధమేమిటి? అసలలాంటి జ్ఞానంలేని పశువుకిచ్చేబదులు పెళ్లిచెయ్యకుండా వుంటే మంచిది" ఆవేశంగా అన్నాడు.

"మిత్రా! ఇది ప్రపంచం...మనం సంఘజీవులం. ఇటువంటివన్నీ తట్టుకొని నిలబడగలిగేదే నిజమైన మానవత్వం, సంస్కారం. స్టేజిలమీద వుపన్యాసం ఇవ్వడంకాదు. సంఘానికి ఎదురు నిలిచి పనిచేసి చూపించాలి. కానీ మన నీతి, రీతి ఎలా వుంటాయంటే మనం చేసేపని

మనతో నేపోదు. దాపి ప్రభావం ఇతరుల జీవితం మీద ప్రతిబింబిస్తుంది. అదే చిక్కు! అదే ఫారిన్ కంట్రీస్ వున్నా యంటే చూడండి...అక్కడ ఎవరి జీవితం వారిదే! ఎవరి నీతి, నిజాయితీ వారిదే! ఎవరి ప్రవర్తన, వ్యక్తిత్వం వారిదే! మన హిందూసమాజం వుమ్మడి కుటుంబం లాంటిది. దాని వలన లాభం లేదు కానీ నష్టంమాత్రం కావలసినంత వుంది. ఒక మంచిపని చెయ్యడానికి సంఘం చేయూతనివ్వదు కానీ దాన్ని విమర్శించడానికి అందరూ పెద్దలే! ఏది ఏమయినా నా మూలంగా లీల పెళ్ళి తప్పిపోవడం నాకు చాలా బాధగావుంది. మాకు ఒకరిమొహాలొకరికితెలీవు.అయినా నా జీవన విధానం ఆమెమీద ఎంతటి ప్రభావం చూపిందో చూసారా?" నిర్వే దంగా అంది.

"నో...నో...అదేంలేదు. ఇందులో మీరు బాధపడవలసిందిలేదు. అసలు ఎవరం బాధపడక్కరలేదు. నేనేమీ సంస్కరణాభిలాషతో మీతో రాలేదు. జస్ట్ డ్యూటీ. నిరుద్యోగిగా, బాధ్యతా రహితంగా తిరుగుతోన్న నాకు ఇంత ఉపాధి కల్పించారు. జీతం తీసుకొన్నాను, పని చేసాను. అంతే! అదే ఆయనతో చెప్పాను. ఇంట్లో అంతా నన్ను ఓ రాక్ష సుణ్ని చూసినట్టు భయపడుతూ, పురు గును విదిలించినట్లు చూస్తున్నారు. అందుకే భరించలేక చెప్పేసాను. అయినా అదంతా నిజమేకదా! ఎవరి మనస్సాక్షి వాళ్ళకుండాలికాని ఒకరికి భయపడ్డం దేనికి స్మితా! ఇక నేనెవరికీ భయపడను. మీలాంటి దేవతకు ఏ సేవలు చెయ్య గలను!" వశం తప్పుతున్న గొంతుతో గొణుక్కుంటూన్నట్లు అంటున్న అతనినే చూస్తున్న స్మితకు కళ్ళల్లో సన్నటి నీటి పొర. ఏదో 'నిజం' తెలిపిన రహస్యం.

ఎలీజా టేబ్లెట్స్ తీసుకురావడంతో ఆగిపోయింది సంభాషణ.

అవి ఎలా వేసుకోవాలోచెప్పి, మరో సారి టెంపరేచర్ చూసి వెళ్ళడానికి లేచాడు. తదేకంగా స్మితనే చూస్తున్న ఆ చూపుల్లో ఆరాధన స్పష్టంగా, నిర్భ యంగా మెరుస్తోంది. దాన్నిప్పుడు దాచు కోవాలని అతడు ప్రయత్నించడంలేదు. స్మితకి ఇబ్బందిగా వుంది ఎన్నడూలేని ఈ పరిణామానికి!

"ఉదయమే వస్తాను. అంతగా అవసర మైతే పక్కింటి ఫోనునెంబరిస్తాను. ఫోను చెయ్యండి" అని చెప్పి వెనుదిరిగాడు.

"వస్తాను స్మితా! ఏమీ ఆలోచించ కుండా బాగా రెస్ట్ తీసుకోండి. యువిల్‌బి ఆల్‌రైట్" గుమ్మందగ్గర కర్టెను తొల గించి చిరునవ్వు నవ్వుతూ గది దాటాడు. ఎందుకో అతనలా వెళ్ళిపోతుంటే ఎవరో ఆత్మీయులు దూరమైపోతున్నట్లు అను భూతి కలిగింది. అతనా రాత్రంతా తన తలదగ్గర కూర్చుని టెంపరేచరు చూస్తూ, కబుర్లుచెప్తూ మందులిస్తూ దగ్గరే వుండా లని మనసు ఆక్రోశించింది. 'ఛ...చ... ఎన్నడూలేందివాళ ఇలా ఆలోచిస్తోందేం? ఎప్పుడయినా తలనొప్పన్నా ఎరగని తనకిలా రావడం ఏమిటి? తన మనసిలా ఆలోచించటమేమిటి?ఇన్నాళ్ళు పదిమందిలో వున్నా ఒంటరితనంతో మనసు పదిలంగా చుట్టచుట్టుకొని ముడుచుకునే వుంది. ఈనాడు వంటరితనం కుబుసం విడిచినట్లు బాధపెడుతోందేం ? అతని భావనలో, చూపుల్లో, ఆ మాటల్లో ఏదో మత్తు ఆవరించినట్లవుతోంది. అసలు అతనికా

ధైర్యం ఎలా వచ్చింది? భగవాన్...నాకు మనస్థైర్యాన్ని ప్రసాదించు.

ఇన్నాళ్లు జయించుకొస్తున్న మనసును నా ఆధీనంనుండి తప్పించకు. నా ధ్యేయాన్ని నెరవేర్చుకోనీ! కనబడని దేవునికి మనసులోనే దణ్ణం పెట్టుకొని కళ్లుమూసుకొంది అసవ్యస్తంగా వస్తున్న ఆలోచనలతో ఆరేయి గడిచి నిదురే కరువయింది. దాని ఫలితంగా తెల్లవారేసరికి జ్వరం ఎక్కువయి కన్ను తెరవకుండా పడి వుంది స్మిత.

ఉదయం హాస్పిటల్‌కు వెళ్తూ స్మితను చూద్దామని వచ్చాడు మిత్రా. విపరీతమైన జ్వరంతో తెలివిలేకుండా పడివున్న స్మితను వదిలిపెట్టి పోవడానికి మనసొప్పలేదు మిత్రాకు ! ఆ నిముషంలో ముందు రోజు జరిగిన సంఘటనగానీ, తండ్రి అనారోగ్యంగానీ ఏమీ గుర్తు రాలేదు. మదిలో గుప్తంగా దాచుకొన్న అనురాగం వరదలై పొంగుతోంది. చెలియలి కట్టలాంటి మొహమాటాన్ని దాటుకొని పురకలు వేస్తోంది. దగ్గరుండి సేవ చెయ్యాలనే కోర్కెను, అదుపులో పెట్టుకోలేని నిస్సహాయతను లెఖ్ఖచేసేట్టు లేదు. అందుకే హాస్పిటల్‌కి వెళ్ళి సెలవు పెట్టి కావలసిన మందులు కొని, కొన్ని ఇంజక్షనులు కూడా తీసుకొని తిరిగి వచ్చాడు. ఎలీజా సహాయంతో ఇంజక్షన్ చేసి టేబ్‌లెట్ మింగించాడు. అరగంటకు అరగంటకు టెంపరేచర్ చూస్తూ కూర్చున్నాడు.

జ్వరతాపంతో కమిలిన గుండ్రని మొహం వడలిన ఎర్ర గులాబిలా ఉంది. మూసుకొన్న విశాలమైన కనురెప్పలు పరచిన నీడలు చంపమామలో మచ్చలా వున్నాయి. ఎత్తుగా, పొడుగ్గా, స్థిరంగా సాగిన ముక్కు ఆమె జీవితంతో చేసిన సవాలులా వుంది. తదేకంగా ఆమెనే చూస్తున్న మిత్రా టైమ్ గమనించనే లేదు.

"డాక్టర్! భోజనానికి రండి'' ఎలీజా పిలుపుకి ఉలిక్కిపడి వాచీ చూసుకొన్నాడు. పన్నెండయింది. మూడు గంటల కాలం కేవలం ఆమెను చూస్తూ గడిపేసానన్న సత్యం అతన్ని ఆశ్చర్యచకితుణ్ని చేసింది.

''ఊహు...వద్దు ఎలీజా! అంతగా ఆకలి అనిపిస్తే స్మితకు తెలివి వచ్చాక తింటాను'' కదలకుండా స్థిరంగా, గంభీరంగా అంటున్న అతన్ని జాలిగా చూసి వెళ్ళిపోయింది.

అతని మనసు ఎన్నో అనుభూతులకు లోనవుతోంది. ఏవేవో జ్ఞాపకాలు మెదడును తొలుస్తున్నాయి. ఎదురుగా నిశ్చింతగా మంచంమీదపడి నిర్వికారంగా ఉన్న స్మితను చూస్తుంటే ఆరోజు క్లబ్బులో డాన్సుచేసిన స్మిత రూపం కళ్ల ముందు మెదిలి కళ్లు చెమర్చాయి. స్మితతో పరిచయం కళ్ళముందు కదిలింది.

హౌస్ సర్జన్సీ అయిపోయాక ఎక్కడా జాబ్ లేక చీఫ్ దగ్గర జీతం, భత్యంలేని అసిస్టెంట్‌గా వుండేవాడు ఆయన ప్రయివేటు క్లినిక్‌లో. జనరల్ చెక్‌అప్‌కి అక్కడికి వచ్చిన స్మిత తన పరిస్థితి చూసి ఇంటికివచ్చి కలవమని అడ్రసిచ్చి వెళ్లిపోయింది ఎవరూ చూడకుండా.తనకప్పటికి తెలీదు ఆమె సంగతి. ఏదో ఆశతో వెళ్లాడు. ఇంట్లో అడుగు పెట్టిన క్షణం ఈ వైభవం చూసి కాళ్లు వణికాయి. అప్పుడు చెప్పింది అసలు సంగతి. ఆమె చెప్తున్నదంతా నోరు




తెరుచుకొని విన్నాడు. కలో, వాస్తవమో అర్థంకాలేదు. అర్థం అయిన క్షణం ఆమె ముందు తను ఎంత అల్పుడో అను కొన్నాడు. ఏమీ సమాధానం చెప్పని తననుద్దేశించి —

"మీకు కావలసిన జీతం ఇస్తాను. మీకు జాబ్ దొరికితే నిరభ్యంతరంగా వెళ్లి పోవచ్చు. మీకు అభ్యంతరం లేక పోతేనే! ఆలోచించండి. వాళ్లు శరీరాల్ని అమ్మి డబ్బు చేసుకునేవాళ్ళే! వాళ్ళకి ఏదయినా అనారోగ్యం వస్తే పట్టించు కోకుండా విసరిపారేస్తారు.ఎంగిలివిస్తరిలా అలా రోడ్లమీద ఎగిరి ఎగిరి పోవలసిందే! నా కళ్ళముందు నా తోటివాళ్లు అలా మగ్గి పోవడం నాకు బాధగా వుంది. అందుకే ఈ ప్రయత్నం. కొంతమందినన్నా రక్షించగలనేమోనన్న ఆశ. నేనొక్కర్తిని అనుకొన్నంతలో ఏమవుతుంది. మీలాంటి వాళ్ల సహకారం లేకపోతే నేనేం చెయ్య గలను? మీరు ఆలోచించుకొని చెప్పండి" అన్న ఆమె మాటలకు తనలో నిద్రాణంగా వున్న సంస్కారం తల వంచింది. మరేమీ ఆలోచించకుండా ఒప్పుకున్నాడు. ముఖ్యంగా ఆమె ఇస్తా నన్న జీతం అతన్నింకేమీ ఆలోచించ నివ్వలేదు. అప్పటినుండి ఆమెపట్ల అభి మానం పెరుగుతూ వచ్చింది అతనికి తెలీకుండానే. అందరూ చూసే దృష్టితో తనకెప్పుడూ కనబడలేదు. స్మిత మెల్లగా కదిలింది. ఆ కదలిక అతని ఆలోచనల నాపింది. ఆత్రంగా లేచి దగ్గరకు వెళ్ళి నుదుటిమీద చెయ్యివేసి చూసాడు. కాస్త తగ్గిందనడానికి నిదర్శనంగా మెల్లగా కళ్లు విప్పి చూసింది. తన మీదకు వంగి చూస్తున్న అతని మొహంలో పోటీపడు తున్న ఆతృత, అభిమానం ఆమె కళ్ళు విప్పార్చుకొనేలా చేసాయి. ఆనందంతో కళ్ళల్లో నీళ్ళూరాయి. మళ్ళీ మగతలోకి జారిపోయింది.

అలా...అలా...ఆ జ్వరం టైఫా యిడ్‌లోకి దించింది. మిత్రా, ఎలీజా రాత్రి పగలు సేవచేసి కాపాడుకొన్నారు. హోమ్‌లోవాళ్ళంతా దిగాలు మొహాలతో స్మిత ఆరోగ్యం కోసం తాపత్రయ పడ్డారు. సునీత కూడా చాలా ఆందోళన చెంది తరుచూ వచ్చి చూస్తూండేది.

ఎలాగయితేనేం అందరి ఆపరాభి మానాలతో పునీతమైన స్మిత ఇరవయ్యో రోజున లేచి కూర్చుంది.

తనకోసం ఇంత మంది బాధపడు తున్నారని, ఇంతమంది అభిమానం, ఆదరణతో తనీ రోజు లేచి కూర్చుందనీ తలచుకొన్న స్మిత ఒళ్లు గగుర్పొడిచింది. ఎదురుగా మిత్రా.. వాడిపోయి నీరసించి పోయిన మొహంలో స్మిత లేచి కూర్చుం దన్న ఆనందాన్ని దాచలేక వెలిగిపో తున్న కళ్లతో మిత్రా! అతని చూపుల్లో చూపులు కలపడానికి సిగ్గుపడి చప్పున కళ్లు దించుకొంది. ఏమిటో ఈ సిగ్గు. ఇవన్నీ కొత్తగా అనిపిస్తున్నాయి. నెమ్మ దిగా కూర్చోబెట్టి గ్లూకోజ్ కలిపిన బార్లీ వాటరు తాగిస్తుంటే మిత్రా చేతుల్లో కొత్తగా, హాయిగా వుంది. ఇంతవరకూ ఎప్పుడూ పొందని కొత్త అనుభూతి పొందింది.

ఈ ఇరవై రోజులు మిత్రా సరిగ్గా ఇంటికి వెళ్లడం లేదు. వెళ్ళినా వాళ్ల చూపుల్ని ఎదుర్కోలేని పిరికితనం ఆవ రించింది. తరుచు ఇటునుండిటే హాస్పి టల్‌కి వెళ్లివస్తుండేవాడు. అతనికి తెలియకుండానే ఆమె దగ్గర చనువు


చతుర ... లీల

ఏర్పడిపోయింది. ఆ చనువు, ఏకవచన సంభోదన స్మితకు ఎంతో హాయిగా వుంది.

* * *

మరో వారం రోజులు పోయాక ఎవరితోనో ఫోన్‌లో మాట్లాడుతున్న స్మితను చూసి నుదురు చిట్లించాడు మిత్రా

"ఎవరితో మాట్లాడుతున్నావ్?"

"బ్లూ డెమండ్ ప్రొప్రయిటర్" రిసీవర్ పెట్టేస్తూ అంది.

"స్మితా! ఒక్క విషయం చెప్పడం మరిచాను. ఏమిటంటే...ఏంలేదు... మరో రెండు నెలలపాటు ఏ ప్రోగ్రామ్స్ లేకుండా వుంటే మంచిది. లేకపోతే ఈ నీరసం మీద వెంటనే ఎఫెక్టు ఇస్తుంది" గడగడ పాఠం అప్పచెప్పినట్లు చెప్తున్న అతన్ని చూస్తూ నిట్టూర్చింది.

"ప్చ్! అదేం లేదు. ఎలా వుందోనని అడుగుతున్నాడు. మొన్ననే తెలిసిందట" సంజాయిషీ చెప్తున్నట్లు అంది. ఆ తరువాత తనకి తనే ఆశ్చర్యపోయింది.

"ఇదేమిటి! అతనికి నేనిలా భయపడుతున్నాను, భర్తకు భార్య సంజాయిషీ చెప్తున్నట్లు. ఇద్దరి మధ్యా ఈ చనువు ఇటువంటి భావాన్ని కలిగిస్తోందా? అయినా నాకు కోపం రావడం లేదేం? ఈ అథారిటీనే కోరుకుంటోందా నా మనసు? ఇన్నేళ్ళుగా లేంది ఇప్పుడు నా హృదయం ఇటువంటి స్పందనకు లోనవుతోందేం? ఎందరితోనో, ఎన్నో రాత్రులు సునాయాసంగా గడిపిన ఈ శరీరం ఈ రోజు కొత్తగా స్పందనకు లోనవుతోందేమిటి? ఒక స్త్రీకి ఒక పురుషుడు జీవితంలో ఎప్పుడో ఎక్కడో తారసపడి స్త్రీత్వాన్ని మేలుకొలుపుతాడని ఎందులోనో చదివింది. అది ఇదేనేమో!'





"ఏమిటలా వుండిపోయారు? టానిక్ వేసుకొన్నారా? రేపటి నుండి ఇంజక్షన్స్ ఆపెయ్యొచ్చు. బాగా తినడం, రెస్ట్ తీసుకోవడం రెండే పనులు చెయ్యాలి" నవ్వుతూ ఎదురుగా కూర్చున్నాడు.



అప్రయత్నంగా టీపాయ్‌మీదున్న బత్తాయి పండు ఒలవడం మొదలు పెట్టాడు హాస్పిటల్ కబుర్లు చెపూ!

"నిన్న ఏమయిందో తెలుసా? అవుట్ పేషెంట్ ఒకామె వచ్చింది. గర్భిణి. ఎన్నో నెలమ్మా అంటే తెలీదుట. ఏమన్నా అడిగితే తెలీదు తెలీదు అని చెప్పి ఆఖర్న నీ భర్త ఎవరు, ఏం పేరు అంటే అదీ తెలీదు అనేసరికి అందరూ పక్కున నవ్వారు. పాపం బిక్కమొహం వేసుకొని ఉన్నాడండీ అవతల అంటూ

'బావోయ్' అంటూ ఒక్క కేక వేసింది. అంతే ! రయ్యిమని దూసుకువచ్చాడు తారాజువ్వలాగ — 'ఎందుకయ్యా' అంటూ"

నవ్వి నవ్వి ఒక్కసారిగా ఆపాడు. ఎప్పుడు ఎలా వలచిన తొనలు అందిస్తున్నాడో, స్మిత ఎలా తినేసిందో ఇద్దరూ గ్రహించలేదు. ఇద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు. అంతే ! సిగ్గుపడిపోయింది స్మిత. ఆ సిగ్గును అపురూపంగా చూస్తూ కూర్చున్నాడు మిత్రా. ఆ తరువాత గొంతులో ఏదో అడ్డుపడ్డట్లు కొంతవరకూ మాట పెగల్లేదు ఇద్దరి నోటి నుండి. పండంతా అయిపోయింది. లేచి వెళ్ళి చేతులు కడుక్కువచ్చాడు.

"మరి నే వస్తాను ! రేపే రావటం. సాయంత్రం పడదు" అంటూ లేచాడు.

సిగ్గుతో బరువెక్కిన కళ్లతోనే వీడుకోలు చెప్పింది.

* * *

హోటల్ సరోవర్ నుండి ఫోన్ వచ్చింది. వస్తానని మాటయిచ్చింది. ఈ మధ్యంతా మరో రంగుల ప్రపంచంలో నివసించినట్లు, వాస్తవాన్ని మరచి విహరించింది. ఇపుడీ ఫోను ఒక్కసారి గతాన్ని తట్టిలేపి తనేమిటో తనకు తెలిసి వచ్చేలా చేసిందా పిలుపు.

దాంతో బ్బుర గిర్రున తిరిగింది. తనెంత పొరపాటుగా ఆలోచిస్తోంది. తన ధ్యేయం నుండి ఎంత దూరంగా జరిగి పోతోందో గుర్తుచేసుకొని వణికిపోయింది.

'మిత్రా ! ప్రేమ ఇంత అందమైన సాలెగూడు అనుకోలేదు. నన్ను నేనే అందులో బంధించుకోవాలని, నాకు నేనే అందులో ఇరుక్కుపోవాలనుకొని ఎంత పొరపాటు చేసాను. నన్ను నేను మోసం చేసుకొంటూ నీ జీవితం నాశనం అవుతుందని గ్రహించలేని మూర్ఖురాలనయ్యాను. అలా కాకూడదు.. ఈ స్మిత ఏ ఒక్కరి సొత్తు కాకూడదు. నా జీవితంలో నీలినీడలు ఎవరిమీదా పడకూడదు. నా తోటి సోదరీమణులకు నేను చెయ్యగలిగినంతా చెయ్యాలి. దాని కోసమే బలిచేసుకున్న నా బతుకులో ఇపుడీ సందడి ఏమిటి? నో... నెవ్వర్! నేనెప్పటికీ స్మిత అనే అంగడి బొమ్మను, ఆడే బొమ్మను! అంతే ! మిత్రా నీకేమీ కాను. నా కోసం ఒక్క ఆలోచన కూడా వేస్టు చెయ్యకు. ఒక్క ఊహకు రూపం ఇవ్వకు నన్ను నేను క్షమించుకోలేని స్థితికి రానివ్వకు' ఆక్రోశిస్తున్న హృదయాన్ని అదుపులో పెట్టుకొని శిలాసదృశ్యమైన మనసుతో అలాగే ఉండిపోయింది.

కాలింగ్ బెల్ విని తలుపుతీసిన ఎలీజా ఎదురుగా ఉన్న సునీతను చూసి పక్కకు తప్పుకుంటూ, "కాలేజీ లేదా?" అడిగింది.

"ఊహూ లేదు! స్మిత వున్నారా?" అంటూ సోఫాలో కూర్చుంది.

ఆ మాటలకు బెడ్‌రూమ్ నుండి బయటకు వచ్చిన స్మిత కళ్లు తేజోవంతమైనాయి సునీతను చూడగానే.

"ఏమిటింత అదృష్టం ఈ వేళ" వచ్చి పక్కనే కూర్చుంది.

"స్మితా!" అంటూ బావురుమంది.

"ఏం జరిగింది? మా అమ్మవు కదూ. చెప్పకపోతే ఎలా తెలుస్తుంది" గెడ్డం పట్టుకుని బతిమాలుతున్నట్లు అంది.

"మా కాలేజీలో నా క్లాసమ్మాయి సూయిసైడ్ చేసుకొంది స్మితా! ఎందుకో తెలుసా? ఏ వెధవో మోసం చేసాడట!





అభిమానంతో ఆత్మహత్య చేసుకొంది. దుఃఖంతో వణికిపోతూ అంది సునీత.

ప్రతి తల్లిదండ్రులు అమ్మాయిని చదివిస్తున్నామని, కాలేజీకి పంపిస్తున్నామని, స్కూలుకు వెళ్ళొస్తోందని అనుకొంటారేగానీ వయసొచ్చి వికసించే ఆ అమ్మాయి మనసుని గ్రహించరు. కొందరు తెలియక, కొందరు ఓపికలేక, కొందరికి తీరికలేక, కొంతమంది అమ్మాయిల మీద నమ్మకంతో ఇలా వదిలేస్తున్నారు. హైస్కూల్స్‌లో గానీ, కాలేజీల్లోగానీ ఇటువంటి విషయాలు చెప్పడానికి ఒక్క పిరియడ్ అన్నా వుందా? ఈ చదువులు ఏ జీవిత పాఠాల్ని నేర్పుతున్నాయి. ఒకరి నుండి మరొకరు తప్పించుకోలేని ఆకర్షణలు, వేషభాషలు నేర్చుకొంటున్నారు. ఫారిన్ కంట్రీస్‌లోలా మనకి సెక్స్ విజ్ఞానం కూడా ఒక భాగం వుండాలి కాలేజీల్లో. అపుడు మనకీ అవకాశాలుండవు" ఆవేశంగా అంది స్మిత.

చాలా సేపు అమ్మాయిల మనస్తత్వాలు, వాళ్ళ ప్రవర్తనలు, దాని కోసం వాళ్ళు ఏం చేయగలరో-అన్ని విషయాలు మాట్లాడుకొన్నారు ఆవేశంగా!

"స్మితా! ఒక్కపని చెయ్యకూడదూ! మా ప్రిన్స్‌పల్ పర్మిషన్ తెస్తాను. కాలేజీలో ఒక మీటింగ్ కండక్ట్ చేస్తాం. దానికి నువ్వు అధ్యక్షత వహించి ఈ విషయాలన్నీ చెప్పాలి" అంది సునీత.

"నేనా? భలేదానివే! ఏదో సామెత చెప్పినట్లుంటుంది" నవ్వుతూ అంది.

"అహ...అలా నవ్వకు! నీలాంటి వాళ్లే చెప్పాలి, చెప్పగలరు! నీ విషయం వాళ్ళకు తెలియవలసిన అవసరం ఏముంది? ఏదో మహిళామండలి ప్రెసిడెంటుగా పరిచయం చేస్తాను. నా మాట కాదనకు. మా ప్రిన్స్‌పల్ కాదనరు. ప్రోగ్రాం ఫిక్స్ చేసి చెపుతాను. ఇటువంటి ప్రయత్నం వల్ల నూటికో అమ్మాయి అన్నా నైతిక విలువ అంటే ఏమిటో ప్రేమంటే ఏమిటో, సెక్స్ అంటే ఏమిటో - వాటి మధ్య తేడా ఏమిటో, తెలుసుకోగలిగితే చాలు" వుద్రేకంగా అంది సునీత.

"సునీతా! నువ్వేదో వూహించేసుకొని, నన్నేదో చేసెయ్యమంటున్నావు. అంతమంది విద్యావేత్తలు, పెద్ద వాళ్ళ ముందు నేనేం మాట్లాడగలను. వాళ్ళకు నేచెప్పేదేముంటుంది" సునీతను వారిస్తూ అంది స్మిత.

ఫక్కున నవ్వింది సునీత. ఏడ్చి, ఎర్రబారిన కళ్ళలో ఒకలాంటి మెరుపు కనిపించింది. సాధించగలను అన్న ధీమా సూటిగా వున్న ముక్కులో ప్రతిఫలించింది.

"విద్యావేత్తలా? అంటే డిగ్రీలున్న వాళ్ళు. అంతే! ఆ డిగ్రీల వలన వాళ్ళు నేర్చుకొన్న దేవిటో అడగొద్దు. ఉద్యోగం కోసం డిగ్రీలు అంతే! అలాగని అందరూ కాదు. కొంతమందివిద్యతోపాటువిజ్ఞానం, సంస్కారం నేర్చుకొన్నవారున్నారు. ఇక నువ్వు చెప్పే జీవిత పాఠాలు వాళ్లెన్నడూ తిరగేసి వుండరు. మేము చెప్పే చదువులు వుద్యోగం లేక పెళ్లి చదువులు, అంతే! అందుకని ఇంకేం అడ్డు చెప్పొద్దు. డేట్ కుదరగానే ఫోన్ చేస్తాను. మరి నేవెళ్ళొస్తాను. సరస్వతి, వాణి బాగా చదువుతున్నారు. పరీక్షలు దగ్గరవుతున్నాయిగా, పాసవుతారనే నమ్మకం వుంది" అంటూ లేచింది సునీత. గుమ్మం వరకూ సాగనంపి చిరునవ్వుతో వీడ్కోలిచ్చింది.



మనస్సంతా తేలిగ్గా, హాయిగా వుంది. సాయంత్రం కోసం ఉత్సాహంగా తయారవసాగింది-రాబోయే డబ్బుతో మహిళా విహార్‌కి ఏం చెయ్యాలో ఆలోచిస్తూ!




"హల్లో! సునీతను మాట్లాడుతున్నాను. రేపు సాయంత్రం మూడు గంటలకు కాలేజీ దగ్గరకు వచ్చేయండి. నేను అక్కడే వుంటాను" అంటూ వారం పోయాక ఫోను చేసింది. అందుకొన్న స్మిత...

"ఏమిటో సునీతా! నా మీద పెద్ద బాధ్యత పెడుతున్నావు నాకేదో భయంగా వుంది. నేనెవరో తెలిస్తే, నా గాలన్నా సోకనివ్వని ప్రపంచంలోకి నన్నాహ్వానిస్తున్నావు. అక్కడ వూపిరాడకవుక్కిరి బిక్కిరి అవుతానేమో!" బెరుగ్గా అంది స్మిత.

"నో... నో! అదేం లేదు. మీరేదో వూహించుకొని భయపడుతున్నారు. ఇక్కడ మీ ఉనికిని గురించిఎవరికీతెలీదు. ఇంకేం అడ్డుచెప్పొద్దు. రేపు ఎదురు చూస్తుంటాను" ఫోన్ పెట్టేసింది సునీత.

ఏదో భావసంచలనంతో మనసు నిండిపోగా 'ఏం మాట్లాడాలి' అన్న ప్రశ్న రిహార్సల్‌లా పదే పదే అనిపిస్తుంటే అలా కూర్చుండిపోయింది సోఫాలో!

* * *

అనుకొన్న రోజున వంగపండు రంగుకి ఎర్రని బార్డరున్న పట్టు చీర, అదే రంగు పట్టు జాకెట్టు వేసుకొని ముత్యాలదండ వేసుకుంది. సిగచుట్టుకొని పక్కగా పసుపు గులాబి కనీకనిపించనట్లు పెట్టుకొంది. నుదుట ఎర్రని సింధూరంతో కందిగింజంత బొట్టు పెట్టుకొని అద్దంలో చూసుకొంది. సంతృప్తిగా అనిపించింది. ఇన్నేళ్ల క్రమశిక్షణతో అదుపు తప్పని శరీరం, పచ్చని మేని ఛాయ స్మితను హుందాగా, పూజ్యభావంతో చూసేలా, ఆరాధించాలనిపించేటట్లు చేసాయి. టాక్సీలో కూర్చుని ఒక్కసారి దీర్ఘంగా నిశ్వసించింది.

కాలేజీ దగ్గర ఒక్క కుదుపుతో ఆగిన కారును అయోమయంగా చూసి అంతలోనే గుర్తుకువచ్చినదాన్లా తలుపు తెరచుకొని దిగబోయింది. కానీ, ఏదో గాభరా, భయం ఆమెనా పని చెయ్యనివ్వలేదు. అసహాయంగా డ్రైవర్‌వంక చూసింది. అంతలో సునీత ఎప్పుడు చూసిందో వచ్చి డోర్ తెరిచింది. ఆమె చేత అంత పని చేయించినందుకు సిగ్గుపడినట్లు 'సారీ' అంటూ నెమ్మదిగా దిగింది కర్చీఫ్‌తో మొహం తుడుచుకుంటూ.

"మార్వెలెస్! మిమ్మల్ని చూస్తుంటే అసలు స్పీచ్ అమ్మాయిలు వింటారా అని పిస్తోంది!" అంటూనే టాక్సీ ఫేర్ చెల్లించి వెనుదిరిగింది. మౌనంగా, బిడియంగా ఆమెననుసరించింది స్మిత.

క్లాసుల్లోని అమ్మాయిలంతా తొంగి చూస్తున్నారు. వాళ్ళకు ముందే నోటీస్ వెళ్లింది. ముందుగా స్ప్రింగ్‌డోర్ తెరచు

కొని ప్రిన్స్‌పాల్ రూమ్‌లోకి వెళ్లారు. "ఈవిడే మేడమ్ స్మితానాయుడు....మా ప్రిన్సిపల్ లతాచౌదరి" అంటూ ఒకరి కొకర్ని పరిచయం చేసింది.

"మీ గురించి చాలా చెప్పిందిలెండి సునీత. మీ ఆశయాలు హర్షించదగ్గవే! మీలాంటి ఏ ఒక్కరన్నా ముందుకువస్తే మాలాంటి వాళ్ళకు ఆశాజనకంగా వుంటుంది. మేమేమీ చెయ్యలేమన్న నిస్స హాయ స్థితిలో లేకున్నా ఏమిటో బాధ్య తలు, స్వార్థం మా మనసులు మసిచేస్తుం టాయి. మిమ్మల్ని విధంగా చూడగల గడం అదృష్టంగా భావిస్తున్నాం" అంది స్నేహపూర్వకంగా లతాచౌదరి.

సిగ్గుతో తలవంచుకొంది స్మిత.

"అదేం లేదండి. మీరేదో నన్ను ఆకా శానికెత్తేస్తున్నారు. నాకు వీలయినంత సహాయం నేను చేస్తున్నాను. అంతే!" మొహమాట పడిపోతూ అంది స్మిత.

"జనరల్‌హాల్లో సమావేశపరుచమ్మా! బెల్ కొట్టించు" అంది సునీతనుద్దేశించి స్మితకు కళ్ళతోనే ధైర్యంచెప్పి వెళ్లింది సునీత.

డయాస్‌మీద నిలబడి ఒక్కసారి హాలంతా కలియచూసింది. ముందు వరుసలో లెక్చరర్స్, వెనుక వరుసల్లో పిల్లలు ఆత్రంగా చూస్తున్నారు. ఆమె అందం కొంతమందిలో అసూయను కలి గించింది. మరికొంత మందిలో గర్వాన్ని రేకెత్తించింది. స్మితపక్క మరో కుర్చీలో ప్రిన్సిపాల్. సునీతకోసం కళ్ళు వెతి కాయి. రెండో లైన్‌లోనుండి ధైర్యం చెప్తూన్నట్లు నవ్వి 'కేరీఆన్' అన్నట్లు సైగచేసింది కళ్ళతోనే. ఒక్కక్షణం అదుపుతప్పి వణుకుతున్న గుండెలను అదుపులోకి తెచ్చుకొని కళ్లు మూసు కొంది. అంతా చీకటి! ధైర్యంగా కళ్లు విప్పింది. ఎదురుగా గోడమీద దృష్టి నిలిపింది ఏకాగ్రతగా. తీయని గొంతు సవరించుకొంటూ మొదలుపెట్టింది.

"ప్రిన్సిపాల్‌గార్కి, ఉపాధ్యాయినుల కు నా నమస్కారములు. కలలుకనే కన్నెమనసులకు శుభాశీస్సులు. ఈ రోజు నాకు ఈ అవకాశం యిచ్చినందుకు కృత జ్ఞతా వందనములు మళ్ళీ అర్పిస్తున్నాను" అంటూ ప్రిన్సిపల్ వైపు చూసింది. "నాకు తెలిసిన నాలుగు విషయాలు మీ ముందుంచాలని వచ్చాను. అంటే మీకు తెలియవని కాదు. కానీ ఏ పనికన్నా ఓ పద్ధతి అంటూవుంటే అది మనసుని హత్తుకుంటుంది. ఈరోజు ఈ మీటింగ్ కండక్ట్ చేసి మీకు తెలిసినవే అయినా, మరో వ్యక్తి స్టేజీమీద నిలబడి మీ ఎటెన్షన్ డ్రా చేస్తూ చెప్తే మీ మనసుల్లో ఓ ముద్ర పడుతుంది. తిరిగి సింహావలోకనం చేసుకొంటారు. ఆలోచిస్తారు. అదే నే చెప్పబోయే మాటల ముఖ్యోద్దేశం. ఈమధ్య మీ కాలేజీలో ఓ అమ్మాయి ఆత్మహత్య చేసుకొందని విన్నాను. ఆమె ఆత్మశాంతికి రెండు నిమిషాలు మౌనం పాటిద్దాం" అంటూ కళ్లు మూసుకొంది. అంతా మంత్ర ముగ్ధల్లా లేచి నిలబడ్డారు. తిరిగి కూర్చు న్నాక మొదలు పెట్టింది.

"మొన్నటి వరకూ మీతో కలిసి చదువుకొని మీ మధ్య ఆడి, పాడిన అతి చక్కని అమ్మాయి ఈరోజు మీ కళ్ళ ముందు లేదు అనుకొంటే మీ గుండెలు బరువెక్కడం లేదూ? చావు ప్రతిమనిషికీ సహజమే. ఎప్పటికయినా మానవజన్మకు గమ్యం అదే! చిట్టచివరి మజిలీ అదే! అయితే బాధెందుకు? ఆ అమ్మాయి

జీవితం అంటే ఏమిటో రుచిచూడకుండానే తనకు తాను బలవంతంగా ప్రాణం తీసుకొని మరణవేదన ననుభవించి, అయినవారిని దుఃఖాగ్నికి ఎరచేసిపోయింది. అందుకని మనం బాధపడుతున్నాం. ఎందువలన? పిరికితనం! కేవలం జీవితంతో పోరాడలేనన్న నిస్సహాయత ఆమెనీపనికి పురికొల్పింది. దాని ఫలితం తల్లితండ్రులకీవయసులో మనఃక్షోభ పెట్టి వెళ్లిపోయింది. జీవితంలో ఏ ఆనందం అనుభవించకుండానే భయంతో, వేదనతో, పిరికితనంతో జీవితాన్నంతం చేసుకొంది. దీనికి కారకులెవరు? ఒకటి ఆమె బలహీనత. రెండు పురుషుడు. అతనికేం ఇవన్నీ మరచి హాయిగా, జాలీగా - మరో అమ్మాయి ప్రాణానికి వుచ్చు పన్నుతుంటాడు. అతనిది తప్పు కాదు. ఒక వ్యక్తిత్వం, స్థయిర్యం ఏర్పడని వయసులో అతనూ బలహీనుడే! కేవలం ఆకర్షణ ఇద్దర్నీ దగ్గర చేస్తుంది. దీపపు కాంతి పురుగుని ఆకర్షించినట్లే పురుషుడిచేత స్త్రీ ఆకర్షింపబడి కాలి బూడిదైపోతుంది. ప్రకృతి సిద్ధంగా స్త్రీకి వరం కావలసిన మాతృత్వమే శాపమై దహించి వేస్తోంది. ఏదిఏమైనానష్టపోయేది స్త్రీయే.

వ్యభిచారానికి దరిద్రం కారణమయినా మొదటి మెట్టు వంచన, ఆత్మవిశ్వాసం లేకపోవడమే. ఆకర్షణకి లొంగిపోవడం మరొకటి. చాలామంది తల్లిదండ్రులు తమ పిల్లలు పెద్దవాళ్ళయిపోయారు, వాళ్ళ బాధ్యత తీరిపోయిందనుకొంటారు. కానీ నిజానికి ఇక్కడే ఈ వయసులోనే మొదలవుతుంది సరైన పెంపకం. మీ మనసుల్ని వికసింప చేసుకొని ప్రపంచాన్ని తెలుసుకోండి. ఈ వయసు అనే ప్రవాహానికి ఎదురీది మీది అనే వ్యక్తిత్వం ఏర్పరచుకోండి.అప్పుడు ప్రేమించుకొని,అర్థం చేసుకొని, వివాహం చేసుకొని సంఘంలో గౌరవంగా నిలబడండి. అంతేకానీ తెలిసీ తెలీని వయసు చేసే తొందరలో మిమ్మల్ని మీరు మరచిపోయి ,మగవాడికి, ప్రకృతికి తలవంచి ఆత్మవిశ్వాసం కోల్పోకండి. మిమ్మలను ఆటబొమ్మల్లాగా ఆడించి, హీనపరచే ఈ సంఘంనుండి తరిమివేయబడే స్థితికి దిగజారిపోకండి. హీనమైన సంఘాన్ని ఎదిరించే స్థితిని ధైర్యంగా ఎదుర్కొనండి. ప్రేమించండి, ప్రేమించబడండి. పవిత్రమైన ప్రేమకోసం ఏమైనా చెయ్యండి. అంతేకానీ ఆకర్షణలో పడకండి. కామింపబడకండి! మనసుల్ని చంపే సెక్సు దాహానికి బలి కాకండి.

కలిసి తిరగండి, ఒకర్నొకరు అర్థం చేసుకోండి. కాని, తొందర పడకండి! అంతే నేను చెప్పేది. స్వచ్ఛమైన ప్రేమ నెమ్మదిగా మొదలయి సాగి సాగి గట్టిపడుతుంది. ఇవన్నీ జీవితం నేర్పే పాఠాలే! మీకందరకూ తెలిసినవే. ఎన్నో విన్నారు, వింటున్నారు, చూస్తున్నారు. కానీ, తమవరకూ వచ్చేసరికి విచక్షణా జ్ఞానం పోగొట్టుకొంటున్నారు. అదే ఆ తప్పే మిమ్మల్ని పెడతోవన పట్టిస్తున్నది. కలల ప్రపంచంలో విహరించే కన్నె వయసులు మీవి. ఒక్కసారి కిందకి చూడండి. వ్యక్తిత్వాన్ని అలవరచుకోండి. మీరు సాధించలేనిది ఏదీ వుండదు. నా మాటలు శ్రద్ధగా విన్నందుకు మీకు, నాకీ అవకాశం ఇచ్చినందుకు మీ ప్రిన్సిపాల్




గారికి మరోసారి నా కృతజ్ఞతలు తెలియ చేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను. మీలో ఎవరికన్నా మా హోమ్ చూడాలనిపిస్తే మీ సునీత మేడమ్‌కి తెలుసు. ఆమె ఇంటికి కాస్త దూరంగా వుంది. ఇంకా కొంత మందిని తెచ్చి పెద్దది చెయ్యాలను కొంటున్నాను. మీకు చాతనయితే ఏదయినా సహాయం చెయ్యండి సాటి ఆడపిల్లలకు. అంతే నేను కోరేది!"

రెండు చేతులు జోడిస్తూ నమస్కరించి కూర్చుంది అలసటగా! టేబుల్ మీద పెట్టిన గ్లాసుతో మంచినీళ్లు గటగట తాగి సేదదేరింది.

"డియర్ చిల్డ్రన్ అండ్ స్టాఫ్! ఈరోజు మనకు చాలా సుదినం, స్మితగారు పరిచయం అవడం చాలా అదృష్టం! ఆమె వట్టిమాటలే కాకుండా పనిచేసి చూపిస్తున్నారు. ఆడది కేవలం వంటికి, ఇంటికి, ఆఫీసుకి పరిమితంకాదనీ, స్త్రీ కోసం స్త్రీ చెయ్యవలసింది ఎంతో వుందనీ నిరూపిస్తున్నారు. ఆమె చెప్పిన విషయాలు నాకుగాని, లెక్చరర్స్‌కిగాని తెలియని విషయాలు కావు. కానీ మీకోసం మేమెప్పుడూ ఇలాంటి విషయాలు చెప్పి మిమ్మల్ని హెచ్చరించలేదు. మీరు చిన్నపిల్లలుకారులే, మీ బాధ్యతలు మీరు సక్రమంగా, గౌరవనీయంగా నెరవేర్చుకొంటారనే భావించుతూ నిర్లక్ష్యంగా వుండి మిమ్మల్ని చెప్పనివ్వడంలేదు. స్మితగారు చెప్పినట్లు జీవిత పాఠాలు చెప్పవలసినవీ,చెప్పవలసిందీవయసులోనే! నిజంగా నేనింతవరకూ ఈ విషయమై శ్రద్ధ తీసుకోలేనందుకు సిగ్గుపడుతున్నాను. మనను మనం ముందు సంస్కరించుకుంటే తరువాత పక్కనున్నవాళ్ళను సంస్కరించగలుగుతాం! ఎవరి పరిస్థితులనుబట్టి వారి మనస్థితి వుంటుంది. కానీ అందరూ ఎదుర్కోబోయేది ఆ సమస్యే! ఒకర్ని విమర్శించే ముందు మనమేం చేస్తున్నామూ అన్నది ఆలోచించుకొంటే ఆడదానికిఆడదే శత్రువు అన్న ప్రశ్న ఎదురవుతుంది. మగవాడు ఒక ఆడదాన్ని వెంటాడి వేటాడినప్పుడే మరో ఆడదానికి అంటే భార్యకు అన్యాయం జరుగుతుంది. ఇవన్నీ ఎందుకు ఆలోచించరు ఆడవాళ్లు? మగవాడికి తగిన బుద్ధి ఎందుకు చెప్పరు? ఇక మీదట నుండి లెక్చరర్స్‌గాని, స్టూడెంట్స్‌గాని ఎవరి అనుభవాలైనాసరే, చూసినవి అయినాసరే, మరొకరి ద్వారా తెలుసుకొన్నవైనాసరే ఒక భాగంగా వారానికోసారి ఒక క్లాసుగా తీసుకొని చెప్పుకొంటే బాగుంటుంది. జైహింద్!" అంటూ కూర్చుంది ప్రిన్సిపాల్.

జాతీయగీతంతో పూర్తయింది మీటింగ్!

అంతా బయలుదేరారు. సునీత ఎంత చెప్పినా వినకుండా ఆటోలో వెళ్లిపోయింది స్మిత.

సునీత మొహం వెయ్యి ఓల్టుల బల్బులా ఆనందంగా వెలిగిపోతోంది. అందరి ప్రశ్నలు ''నీకెలా తెలుసు?'' అని. ఒక్కటే సమాధానం ''మహిళా హోమ్‌కి వెళ్తుంటాను!'' అంతే!

ఆ రాత్రి భర్తతో చెప్పి మురిసిపోయింది సునీత.

"మొత్తానికి సంస్కరణోద్యమంలో మెంబరువయ్యావన్నమాట!" అంటూ హాస్యం చేసాడాయన.

* * *

"ఏమిటీ కాలేజీ అమ్మాయిలకి స్పీచ్ లిస్తున్నారట? నిజానికి అక్కడ నుండే మొదలు పెట్టుకుంటూ రావాలి సంస్కరణ'' సోఫాలో కూర్చుంటూ

ఆ అబ్బాయికిష్టమే నిన్ను చేసుకోవడం' అని. 'ఇలా మీనమేషాలు లెక్కిస్తూ, కూర్చుంటే ఈ జన్మకు నీకు పెళ్లి కాదు' అంటూ!

'ఇష్టమే కానీ అమ్మ, నాన్న' అంటూ నసిగింది. 'పెళ్లయి హాయిగా కాపురం చేసుకొంటే వాళ్లే వస్తారు' అని పూరడించాను. ఆ అబ్బాయి వాళ్ళమ్మను పిలిపిస్తానన్నాడు. వస్తే ఏ రిజిస్ట్రార్ ఆఫీసుకో వెళ్ళి ఆ మూడు ముళ్ళు వేయించేస్తాను!" తేలిగ్గా స్థిరంగా అంటున్న మిత్రా మాటలకు ఆశ్చర్యంగా చూసింది.

'నిన్న మొన్నటివరకూ కళ్ళెత్తి చూడ్డానికే భయపడే మిత్రాయేనా ఈ మాటలంటున్నది' అని విచిత్రంగా అతని మొహంలోకి చూసింది.

"చాలా ధైర్యం చేస్తున్నారన్న మాట. గుడ్! అలా మనకు మనమే ముందడుగు వేస్తుంటే కొన్నాళ్లకన్నా ముందుకు పోగలుగుతాం ఈ సమస్యల నుండి. అబ్బాయి మంచివాడే కదా! యు ఆర్ ఫ్రీ నౌ మీకో పెద్ద సమస్య తీరి

పోయింది" తేలిగ్గా నిట్టూరుస్తూ అంది స్మిత.

పిచ్చాపాటి మాట్లాడుతూండగా ఫోన్ మోగింది. "హల్లో! స్మితా హియర్! మీరా లాల్‌జీ! సారీ, ఇంటిదగ్గర లాభం లేదు. మీరెక్కడికి రమ్మంటే అక్కడికి వస్తాను. ఇప్పుడింటికి ఎవర్నీ పిలవడం లేదు. మరోసారి ఆలోచించి చెప్పండి. ఓ.కే. సరే సర్!" అంటూ ఫోన్ పెట్టేసి వెనుదిరిగింది.

తలవంచుకొని చేతిలో రుమాలు మడతలు పెడుతూ తనను తను కంట్రోలు చేసుకొంటున్నట్లు బిగదీసుకొని కూర్చున్న మిత్రాను చూడగానే నిట్టూర్పునణచుకొంటూ వచ్చి ఎదురుగా కూర్చుంది. కాసేపు మాటలే కరువైనట్లు మూగబోయారిద్దరూ. అతని మనసులో ప్రేమకు, ఆవేశానికి, నిస్సహాయ స్థితికి జరుగుతున్న సంఘర్షణ. ఆమె మనసులో అతనిలో జరిగే అలజడిని పసికట్టినా ఏమీ చేయలేని నిస్సహాయత.

"అయితే ఎప్పుడు పెళ్లి చెయ్యాలనుకుంటున్నారు?" నెమ్మదిగా నిశ్శబ్దాన్ని చీలుస్తూ అంది స్మిత.

"అయామ్ సారీ స్మితా! నాకు నువ్వు కావాలి. సారీ! ఐ లవ్ యూ! నిన్ను పెళ్ళిచేసుకొంటాను. నువ్వెక్కడికీ వెళ్ళక్కర్లేదు. మనం కలిసే మన హోమ్ నడుపుదాం. సంపాదన కోసం నువ్వెళ్ళక్కర్లేదు. నీ సహచర్యం నాకు కావాలి. నాకు కావాలి స్మితా! ప్లీజ్! ఐ లవ్‌యూ" పిచ్చివాడిలా ఆమె రెండు చేతులూ పట్టుకొని వున్మత్తుడిలా కన్నీళ్ళు ఒక్కటే తడవాయిగా తనలో పాతుకుపోయిన ఆరాధనా భావం గొంతులో తన్నుకు రాగా బొంగురువోయినకంఠంతో అంటున్న అతన్ని అల్లుకుపోయింది స్మిత.

ఇద్దరికీ కళ్లు అవిరామంగా వర్షిస్తున్నాయి. అతని షర్టు ఆమె కన్నీళ్లతో తడిసిపోతోంది. అతని చేతులామెను చుట్టివేసాయి. ఆ చేతుల్లో ఉద్రేకం లేదు. ఆ మనసులో కోరిక లేదు. కాంక్ష లేదు. ఆ కౌగిలిలో బిగువు లేదు. ఒకర్నొకరు ఓదార్చుకునే ఓదార్పు వుంది.

మూడే నిముషాలు; అంతే! తనను తాను సంబాళించుకొని కళ్లు తుడుచుకుంటూ అతని నుండి విడివడి స్నిగ్ధంగా నవ్వింది. ఎండా వాన కలిసినప్పుడు వెలిసే హరివిల్లులా వుందా నవ్వు.

"మిత్రా! ఇటువంటి పరిస్థితి వస్తుందని ఎప్పుడో తెలుసు. కానీ ఇంత తొందరలో వస్తుందనుకోలేదు. ఈ సమస్యకో సమాధానం ఆలోచించి పెట్టుకొని నన్ను నేను అదుపులో పెట్టుకుందామనుకొన్నాను. కానీ...కానీ... నాకా అవకాశం లేకుండా చేసారు. నాకు కొంత వ్యవధి కావాలి మిత్రా! నాకు ఆలోచించుకునేందుకు టైమ్ కావాలి!"

మంద్రంగా సాగిన ఆ గొంతులోని మాధుర్యానికి కట్టుబడిపోయినట్లు నిస్సహాయంగా నీరసంగా కూర్చుండిపోయాడు. తరువాత ఒక్క మాటన్నా మాట్లాడకుండా లేచి వెళ్లిపోయాడు. కనీసం ఒక్క చూపన్నా చూడకుండా నెమ్మదిగా వెళ్లిపోయాడు. మనసులో రేగే భావతరంగాలను అదుపులో పెట్టలేనట్లు అలాగే నిశ్చలంగా చూస్తూ వుండిపోయింది స్మిత.

* * *

మిత్రా వచ్చి పదిహేను రోజులవు




తోంది. ప్రతిరోజూ అతని రాకకోసం ఎదురుచూస్తూ నిరాశతో గడిపేస్తోంది. తీరా వచ్చేసరికి భయపడుతూ, మనసులో ఏ మూలో మెదిలే ఆందోళనతో క్షణక్షణం అతని రాకను ఆశిస్తూ, నిరాశను భరిస్తూ నరకం అనుభవిస్తోంది. ఒకటి రెండుసార్లు హాస్పిటల్‌కి ఫోన్ చేస్తే దొరకలేదు.

'భగవాన్! నాకెందుకీ పరీక్ష పెట్టావు. నిర్మలంగా ప్రవహించే నదిలో రాయి విసిరినట్లు అయింది. హాయిగా నా పని నేను చేసుకుంటూ అందులోనే ఆనందాన్ని వెతుక్కుంటూ సంతృప్తి పడుతున్న నన్ను ఈ పంజరంలో బంధించావెందుకు? నాకెందుకీ పరీక్ష? ఈ ఆవేదన ఎందుకు? నన్ను త్రిశంకు స్వర్గంలో పడవేయకు. ఈ కోర్కెలనుండి దూరం చెయ్యకుండా వుంటే నా ధ్యేయానికి అర్థమేలేదు. నాకు మనస్థయిర్యాన్ని ప్రసాదించు!'

రోజూ వేడుకునే ఈ వేడుకోళ్ళు ఆలకించినట్లు మిత్రా చాలా వుత్సాహంగా వచ్చాడారోజు.

"స్మితా! లీల పెళ్ళయిపోయింది. ఇప్పుడే వాళ్ళింట్లో దిగబెట్టి వస్తున్నాను" సంతోషంతో వుప్పొంగిపోతూ అన్నాడు.

కళ్ళనిండా నిండిన నీళ్ళతో అతన్ని తదేకంగా చూస్తున్న స్మితకు అతని మాటలేం వినపడ్డంలేదు. పోయిన పెన్నిధి దొరికినట్లు అపురూపంగా చూస్తూనే వుంది. అప్పుడు గమనించాడు మిత్రా!

"స్మితా! ఏమిటిది. ఎందుకీ కన్నీళ్లు? స్మితా! ఇంక మనకు అడ్డులేదు. నీ కన్నీళ్ళు తుడిచే అదృష్టం, నీ నవ్వులు పంచుకునే ఆనందం నాకు కలిగించు" ఆర్ద్రంగా అంటున్న అతని గొంతు పట్టుకొన్నట్లయి ఆగిపోయాడు.

అప్పటికే తేరుకున్న స్మిత కళ్లుతుడుచుకొని ఇప్పుడే వస్తానంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"అలా వెళ్దామా?" అంటూ వచ్చింది-కర్చీఫ్ బాగ్‌లో వేసుకొంటూ.

ఫ్రెష్‌గా తయారయి వచ్చిన ఆమెను చూసి ఆశ్చర్యపోతూ అనుకున్నాడు-

'ఆడవాళ్లు గంటల కొలదీ తయారవుతారని ఎవరన్నారోగానీ వాళ్లంత బుర్రలేనివాళ్లు. ఐదునిమిషాల్లో ఎంత సింపుల్‌గా, ఎంత చక్కగా తయారయి వచ్చింది!' అనుకొంటూ అంగీకారంగా లేచి నిలబడ్డాడు.

ఊరు చివరనున్న నది ఒడ్డుకు రాగానే ఆపాడు టాక్సీ. దిగి చేయి అందించాడు. ఆమె మౌనంగా అనుసరించింది. నిర్మానుష్యంగా ఉన్న ఆ ఏటి ఒడ్డున ఏరులోని అలలు చేసే సందడి తప్ప మరేదీ లేదు. ఆ నిశ్శబ్దంలో గలగలమంటూ లయగా సాగుతున్న శబ్దం ఇద్దరి మనసుల్ని పులకింపజేస్తోంది. ఎత్తుపల్లాలుగా మేటలు వేసిన ఇసుక జీవితంలోని ఒడిదుడుకులను సూచిస్తోంది. ఏటి అవతలవున్న సరుగుడు తోట గాలికి వూగుతూ అనిశ్చితంగావున్న మనసుల్లా వుంది. దినకరుడు తన డ్యూటీ అయిపోయినట్లు హడావుడిగా కొండ దిగిపోతున్నాడు. ఆకాశం సంధ్యాదేవి కౌగిలిలో నలిగి ఎర్రబారుతోంది.

మిత్రాచుట్టూచూసిఎత్తుగావున్న ఇసుకతిన్నెమీదకూర్చుంటూ"స్మితా! ప్రకృతిలో ఎన్ని అందాలున్నాయో చూసావా" ఉత్సాహంగా అన్నాడు. "నాకీరోజు చాలా ఆనందంగా వుంది. నా భుజాలమీదున్న పెద్ద బరువును దింపుకోగలిగాను. నీతో

జీవితం పంచుకోగలనన్న ఆత్మవిశ్వాసంతో మొదటిసారిగా నీతో షికారు వచ్చాను. నా మనసెంతో హాయిగా, తేలిగ్గా వుంది స్మితా! నీ మౌనంతో నా ఆనందాన్ని తుడిచివెయ్యకు. మాట్లాడు స్మితా! మనం పంచుకోబోయే మధుర మైన రోజుల గురించి కమ్మని కలలు విప్పిచెప్పు" ఆమె చెయ్యి పట్టుకొని కూర్చొబెడుతూ అన్నాడు.

అతని అవధులులేని ఆనందం ఆమెను మరింత భయపెడుతూ మూగదాన్ని చేసేస్తోంది.

"మిత్రా! మీకెంతో అందంగా కనిపిస్తున్న ఈ ప్రకృతి దృశ్యం నాకే అనుభూతినీ కలిగించడంలేదు. బహుశా అది మనసునిబట్టి వుంటుందేమో! మీ ఉత్సాహం మీకు అందంగా వుంది. నాలో చెలరేగే సంఘర్షణ నన్నీ అందాలు ఆస్వాదించనీయడంలేదు"

"ఏమిటి స్మితా! అట్లామాట్లాడుతావు" దెబ్బతిన్నట్లు అన్నాడు.

"అవును మిత్రా! మీ వుత్సాహం, ఆనందం చూస్తుంటే అద్దంలో చందమామను చూసి అందుకున్నానని మురిసిపోతున్న పసివాడిలా వుంది. ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో నా కర్థం కావడంలేదు. అన్నీ తెలిసిన మీరే అలా అంటూంటే..." అర్థోక్తిలో ఆగిపోయింది.

"అవును. అన్నీ తెలిసే అడుగుతున్నాను. తప్పా? లీలకు పెళ్ళయిపోయింది. నీ ఆదర్శానికి నేను అంకితమైపోయాను. నీవు చెయ్యాలనుకొన్న పనులకుగాని, నీ హోమ్‌కిగాని నేనేమీ అడ్డు చెప్పడంలేదే! నిన్ను నా సొంతం చేసుకుందామని అడిగాను. తప్పా? ఎవరో ఏదో అనుకొంటారనే భయం నాకు లేదు. ఈ ఊరికి దూరంగా ఎక్కడో మనమేమిటో ఎవరో తెలీనిచోటికి వెళ్ళిపోదాం. అక్కడ కొత్త జీవిత విధానాన్ని ప్రారంభిస్తాం. ఇందులో తెలియాల్సిందేముంది?" ఉద్రేకంగా వుందతనికి. ఎన్ని చెప్పినా కాదనేస్తుందేమోననే భయం వుంది. ఏడుపొస్తోంది. అన్ని భావాలూ కలిపి అతన్ని కసిగా ఉడుకెత్తించి కంపరమెత్తిస్తోంది.

ఆ కంపరం చూసి భయపడిపోయింది. కానీ... తన ధ్యేయం గుర్తుంచుకొని వెంటనే నిగ్రహించుకొంది.

"మిత్రా! నా గతం..."

"గతం.. గతం.. ప్రతివాళ్ళూ పాడే పాత పాటే అది. అయినా నాకు తెలీని నీ గతం ఏమిటి? తెలిసిందాన్ని ఇంకా తెలుసుకోవడం అనవసరం. నాక్కావలసింది భవిష్యత్తు కానీ నీ గతం కాదు" ఉద్రేకంగా అన్నాడు.

"ఒక్క లీల పెళ్ళయిపోగానే సరిపోయిందా? ఇంకా నీ తరువాత వాళ్ళు, తల్లిదండ్రి, కుటుంబ గౌరవం ఇవన్నీ... ఇవన్నీ నా కోసం త్యాగం చేసేస్తానంటారు. అంతేనా? కానీ, నేనందుకుసిద్ధంగా లేను. నా ధ్యేయం వేరు. నా ఊపిరిపోయే వరకూ నేను దానికే అంకితం కావాలి. ఈ పెళ్ళి బంధంలోపడితే మీరేమీ నన్నునకపోవచ్చు. నాకు స్వేచ్ఛ నివ్వొచ్చు. నా ఆశయాలకింత చముదు పోయవచ్చు. కానీ నేనే బలహీనురాలనయిపోతాను. నా స్వార్థం నన్ను సంకెళ్ళతో బంధిస్తుంది. అంతటితో నా ఆశయాలకి తిలోదకాలిచ్చేస్తాను. కేవలం నాతో తిరిగి మీ డ్యూటీ మీరు చేసుకొన్నందుకే మీ వాళ్ళముందు తలవంచుకొని, అవమానాన్ని భరించలేక





పిచ్చివాళ్ళలా తయారయ్యారు. ఇక నన్ను చేసుకొంటే..ఓహ్.. నేనా జీవితం ఊహించలేను మిత్రా! ఇన్నాళ్లు ఆట బొమ్మగా ఆడాను. ఆడించాను. ఎందరికో ఈ శరీరాన్ని ఎన్నో రాత్రులు ఏ అనుభూతి లేకుండా అమ్ముకొన్నాను. నా మనసు తలుపులు మూసుకునే వ్యాపారం చేశాను. ఆ తలుపులు నాకు తెలీకుండానే తెరుచుకొని, నాకు తెలీకుండానే నా స్త్రీత్వాన్ని మేలుకొలిపి నా మనసు చచ్చిపోలేదని, నా అనుభూతి మాసిపోలేదని, నాలో జీవం వుందని నిరూపించారు. నాకీ జన్మకిది చాలు...ఇది చాలు మిత్రా! ఇంకేమీ కోరను. మీరు నన్ను కోరి మీకు దూరంగా పారిపోయేలా చెయ్యకండి. మీరు హృదయపూర్వకంగా దగ్గరకు తీసుకోవచ్చు. కానీ, ఎందరి చేతుల్లోనో నలిగిన ఈ శరీరం సిగ్గుతో, సంకోచంతో ముడుచుకుపోతుంటే, మనసు కమలంలా వికసించి అర్పితమవుతుంటే ఆ నరకం నేనెలా భరించగలను?"

"ఆపు స్మితా ..ఆపు. నన్నెంచుకిలా చిత్రవధ చేసావు. నేను నిన్నేమీ అడగలేదే. నాకు నీ శరీరం పవిత్రంగానే కనిపిస్తోంది. నా మనసుతో చూడు. నీ మనసులాగే నిశ్చలంగా వుంది. నన్ను మోసం చెయ్యకు"

"మిత్రా! మీ ఆరాధన కళ్ళు కప్పి నా గతాన్ని కనిపించనీయకపోవచ్చు. నా గతం మీకు అనవసరం కావచ్చు. కానీ, నాకలా కాదే. మిత్రా! నేనెందుకిలా అయ్యానో నా కథ మీకు చెప్పాలని వుంది. ఇంతవరకూ ఎవరికీ చెప్పకుండా నా గుండెల్లో సమాధి చేసుకొన్న నా గతం తవ్వి మీ ముందు పరుస్తాను.... వినండి. విన్నా మీ కభ్యంతరం లేకపోవచ్చు. స్త్రీ మోసగింపబడితే ఆమెను రక్షించాలి... సంస్కరించాలి. కానీ నేనెవ్వరిచేతా మోసగింపబడలేదు. నా జీవిత ధ్యేయానికి మార్గాన్ని ఎన్నుకొన్నాను. నన్ను మీరేం చేసుకుంటారు"

"స్మితా! నిన్నేదో సంస్కరించాలని, నేనేదో సంస్కర్తననిపించుకోవాలని ఈ పని చెయ్యడంలేదు. నా స్వార్థం నాచేత అడిగిస్తోంది."

"ఏది స్వార్థం? నా శరీరమే కావాలనుకొంటే ఒక్క రాత్రికి రెండు వందలు.."

ఆమె మాటలు నోటినుండి రాకముందే "స్మితా" అన్న అరుపు నోరు నొక్కేసింది.

"ఐ కాంట్ టాలరేట్! ఐ కాంట్! ఇంకేం మాట్లాడొద్దు" ఆజ్ఞాపిస్తున్నట్లు అన్నాడు.

ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి. ఎన్నో సంవత్సరాలుగా ఎండిపోయిన కళ్ళు వూట బావులే అయ్యాయి. ఎందుకో ఈమధ్య ప్రతి చిన్న విషయానికీ ఏడుపొస్తోంది. తనలో ఇంకా జీవం వుందని నిరూపిస్తూ స్పందిస్తున్న మనసుని తలచుకొని నవ్వాలో, ఏడవాలో తెలియని అయోమయావస్థలో పడిపోయింది. వాళ్ళ మనసుల్లోలాగే చుట్టూ చీకటి. చల్లనిగాలి రివ్వున వీస్తూ ఇసుక రేణువులను ఎగరగొడుతోంది. తల మీద నుండి కొంగు కప్పుకొని లేచి నిలబడింది.

ఆమె ననుసరించాడు జీవం లేనట్లు మిత్రా!

"మిత్రా! నాలో ప్రలోభం పెరిగిపోతోంది. నాకేం చెప్పాలో తెలియడం లేదు. మీ ఆరాధన, ప్రేమ నాకు జీవితం కావాలనిపిస్తోంది. నా గతం, నా ధ్యేయం

నన్ను వెనక్కి లాగుతున్నాయి. నేనేం చెయ్యలేను, చెప్పలేను. నన్ను ఆలోచించుకోనివ్వండి. ఇంకా ఆలోచించాలి. ఎందుకు నా జీవితంలో ప్రవేశించి ఇట్లా తుఫాను సృష్టించారు? ఒక్కసారి నన్ను చూడండి. ఈ శరీరం మీద వ్యామోహమే ఉసిగొల్పుతోందా? ఏ వాంఛ లేకుండా పవిత్రమైన ప్రేమకు అసలు సృష్టిలో స్థానం లేదా?" అంటూ ఉద్రేకంగా లేచి ఎదురుగా అడ్డంగా నిలబడింది. రివ్వున వీచిన గాలికి పైట చెంగు ఎగిరిపోయింది. జాకెట్టులో నుండి శరీరపు ఒంపుసొంపులు బయల్పడి కవ్విస్తున్నాయి...!

తన ఎదురుగా అలా నిశ్చలంగా నిలబడిన ఆ స్త్రీమూర్తిని చూస్తుంటే అతనిలో ఏ చలనమూ కలగలేదు.

"నీ ఆలోచనా విధానం మారాలి స్మితా! ఇంత చెప్పినా నీకర్థం కాలేదు. నాక్కావలసింది నీ శరీరం కాదు... అంతే! పద" అంటూ పైటచెంగు ఆమె భుజాల చుట్టూ తిప్పి ఆ చేత్తో అలాగే దగ్గరగా పట్టుకొని నడవసాగాడు.

ఆమె గుండెలు దుఃఖావేశంతో ఎగిరి పడుతున్నాయి.

కార్లో కూర్చోగానే అతని ఒళ్ళో తల పెట్టి సముద్రకెరటాల్లాంటి ఆ దుఃఖంలో కరిగిపోయింది. ఆమె తల నిమురుతూ నిర్లిప్తంగా వుండిపోయాడు సాగిపోతున్న రోడ్డును చూస్తూ!

ఇంటి దగ్గరకు రాగానే లేపి కూర్చోబెట్టాడు. టాక్సీ ఫేర్ చెల్లించి నెమ్మదిగా నడిపించుకుంటూ తీసుకు వచ్చాడు. తలుపు తీసిన ఎలీజా గాభరా పడిపోయింది–'ఏమయిందా' అని.

"ఏం లేదు. నెమ్మదిగా తీసుకెళ్ళి పడుకోబెట్టు" అంటూ ద్వారం దగ్గరే అప్పచెప్పి వెళ్ళిపోబోతున్నవాడి చేతిని పట్టుకొని బేలగా చూసింది స్మిత.

"రేపు సాయంత్రం వస్తాను. బాగా ఆలోచించు! బై...విష్‌యు ఎ పీస్‌ఫుల్ నైట్" ఆ చేతిని అలాగే పెదవుల దగ్గరకు తెచ్చుకొని తేలిగ్గా చిన్న ముద్దు పెట్టుకొని వదిలేసి గబగబా అడుగులేస్తూ వెళ్ళిపోయాడు.

"ఎలీజా!" అంటూ ఆమెను చుట్టుకొని బావురుమంది స్మిత.

కొంతవరకూ అర్థం అయిన ఎలీజా ఆమె భుజం తడుతూ ఓదార్పుగా దగ్గరుండి తీసుకువెళ్ళి మంచం మీద కూర్చోబెట్టి చల్లటి నీరు తెచ్చి ఇచ్చింది. అవి తాగి అలాగే కళ్ళు మూసుకొని చేరబడింది స్మిత. అతని ఆత్మీయత ఓ మత్తులా ఆవరించి మనసు నాక్రమించింది. గాఢంగా అలసిపోయినట్లు ఆ మత్తులో మునిగిపోయింది. శరీరమంతా గాల్లో తేలిపోతున్నట్లుంది! అతని చెయ్యి ఎక్కడో ఆధారంగా భుజాల చుట్టూ బిగుసుకొని కొండంత అండగా హాయిగా మత్తుగొలిపే అనుభూతి.

ఎలీజా భోజనానికి లేపేవరకూ అలా ఆ సుషుప్తావస్థలో అలా కొట్టుకొంటూనే వుంది స్మిత.

* * *

ఎలీజా బలవంతం మీద కాస్త ఎంగిలి పడి వచ్చి మంచం మీద పడిపోయింది మరలా ఆ మత్తుని కోరుకుంటూ...! కానీ అది కరిగిపోయి వాస్తవం ఆలోచనల రూపంతో చుట్టుముట్టింది.

'వస్తున్న బంగారం లాంటి అవకాశం కాలదన్నుకొంటున్నావు. నిన్ను స్త్రీగా గుర్తించి నీ కోసం తన జీవితాన్నే

 

ఘణంగా పెడుతున్నవాడిని కాదనుకొని జీవితాంతం ఏకాకిగా ఎవరికీ కాకుండా వుండిపోతావా?' మనసు నిలదీసింది.

'అవకాశం...ఈ అవకాశం అనుభవయోగ్యమైనది కాదు. నా గతం అతని భవిష్యత్తుకు సమాధి కాకూడదు. దాని వలన అతను బాధపడకూడదు. అయినా ఒక ఆదర్శానికి అమ్ముడుపోయి ఈ జీవితాన్ని చేతులారా ఎన్నుకుని ఈ నరకంలో అపవిత్రమైన ఈ శరీరాన్ని అతనికెలా అర్పించను? ఏ కక్షతో, ఏ కోర్కెతో ఈ బాటలో అడుగుపెట్టానో ఆ దారినుండి వెనక్కి మరలలేనంత దూరం వచ్చేశాను. ఇప్పుడీ పిలుపు నందుకొని దారి తప్పడం తప్ప మరేం లేదు!' మరో మనసు ఆదేశించి సమాధాన పరచింది.

'అలా అని నీ ఒంట్లో అందం ఆరోగ్యం ఉన్నంతవరకూ బాగానే ఉంటుంది. ఆ తరువాత నీకోసం ఒక్కకన్నీటిచుక్క విడిచే నీ వాళ్లెవరు? అందరికీ చెప్పావే, అందర్నీ నిలదీసావే...నీది కావాలనుకొనే ఇల్లు కావాలనిలేదా? ఒక బిడ్డకు తల్లివై, గృహిణివై నీవారికోసం అంకితమై పోవాలని లేదూ? ఎందుకు నిన్ను నువ్వే మభ్యపెట్టుకొంటావ్? అతను ఆవేశంతో కౌగిలించుకొన్నపుడు, ఎన్నో ఏళ్లుగా మగవాడి చేతుల్లో నలిగిపోతున్నా, నీ శరీరం అదే మొదటిసారి పురుషస్పర్శ అన్న అనుభూతి కలగలేదూ!నీ జ్వరంలో నీ కోసం అతను నీ పక్కన ఉండి సేవచేస్తే ఆ క్షణాలు శాశ్వతం కావాలని అనుకోలేదూ? అతను భుజంచుట్టూ చెయ్యివేసి నడిపించినప్పుడు అలాగే జీవితాంతం ఉండిపోతే బావుణ్ణనిపించ లేదూ?' అని మనసు సవాల్ చేస్తుంటే..

'లేదూ! లేదూ!' గట్టిగా అరవాలను కొని నిజం నోరు నొక్కేస్తుంటే నిస్సహాయంగా ఉండిపోయింది.

'నిజమే...అందుకని ఏం చెయ్యను! నా స్వార్థంకోసం నన్ను నమ్ముకొన్న వాళ్లను వదిలేయనా? అతనికి మనస్ఫూర్తిగా అంకితం అవగలనా? లేదు... లేదు...ఎందరో అనాథలు ఆ నరకంలో మగ్గిపోతున్నారు. ఆ నరకం చూడలేక ఆనాడు నేను చేసుకొన్న నా నిశ్చయాన్ని, నా జీవితాశయాన్ని నాశనం చేసుకొని నా ఒకరి సుఖంకోసం బలి చేయను. లేదు అలా చేయను. అతని ఆరాధన పవిత్రమైనది. నా ప్రేమ స్వచ్ఛమైనది. వాటికి ఓ బంధంలేదు. అక్కర లేదు. ఏ బంధం లేకపోయినా ఒకరి కొకరు బంధితులమే ఏనాడూ! నా కోరికగా మిత్రాని ఒకటడుగుతాను. సరస్వతిని చేసుకొని ఆమెకోదారి చూపించమని, ఆమె జీవితం పరిపూర్ణత చెయ్యమని. అప్పుడు నా ఆదర్శం మొగ్గ తొడిగి పుష్పిస్తుంది. నా కోసం, నా ఆఖరి ఘడియల్లో తృప్తిగా ప్రాణం విడిచేందుకు నా వాళ్లంటూ వాళ్ళుంటారు. సరస్వతి కన్నకూతురికన్నా మిన్నగా ఆదరిస్తుంది. వాళ్ళ చల్లని నీడలో నా చరమదశ గడిపివేస్తాను. అవును, అదే నా జీవితానికి ముగింపుకావాలి. మిత్రా! నన్ను క్షమించు. నీ ఆరాధనలో ఒక సమిధనయి పోనీ నన్ను. నీ పాదాల చెంత స్వచ్ఛంగా నీకోసమే రాలిపోనీ. ఈ బంధాల్లో యిరుక్కుపోయి అందులో ఏ మూలో అణిగిపోయిన ఆరాధనతో సామాన్యంగా చచ్చిపోవాలని లేదు. మనసు నిండా నీ తలపులతోనే నీకోసమే నా ఆఖరి వూపిరి కూడా విడవనీ. అంతే

ఫణంగా పెడుతున్నవాడిని కాదనుకొని జీవితాంతం ఏకాకిగా ఎవరికీ కాకుండా వుండిపోతావా?' మనసు నిలదీసింది.

'అవకాశం...ఈ అవకాశం అనుభవయోగ్యమైనది కాదు. నా గతం అతని భవిష్యత్తుకు సమాధి కాకూడదు. దాని వలన అతను బాధపడకూడదు. అయినా ఒక ఆదర్శానికి అమ్ముడుపోయి ఈ జీవితాన్ని చేతులారా ఎన్నుకుని ఈ నరకంలో అపవిత్రమైన ఈ శరీరాన్ని అతనికెలా అర్పించను? ఏ కక్షతో, ఏ కోర్కెతో ఈ బాటలో అడుగుపెట్టానో ఆ దారినుండి వెనక్కి మరలలేనంత దూరం వచ్చేశాను. ఇప్పుడీ పిలుపు సందుకొని దారి తప్పడం తప్ప మరేం లేదు!' మరో మనసు ఆదేశించి సమాధాన పరచింది.

'అలా అని నీ ఒంట్లో అందం ఆరోగ్యం ఉన్నంతవరకూ బాగానే ఉంటుంది. ఆ తరువాత నీకోసం ఒక్కకన్నీటిచుక్క విడిచే నీ వాళ్లెవరు? అందరికీ చెప్పావే, అందర్నీ నిలదీసావే...నీది కావాలనుకొనే ఇల్లు కావాలనిలేదా? ఒక బిడ్డకు తల్లివై, గృహిణివై నీవారికోసం అంకితమై పోవాలని లేదూ? ఎందుకు నిన్ను నువ్వే మభ్యపెట్టుకొంటావ్? అతను ఆవేశంతో కౌగిలించుకొన్నపుడు, ఎన్నో ఏళ్లుగా మగవాడి చేతుల్లో నలిగిపోతున్నా, నీ శరీరం అదే మొదటిసారి పురుషస్పర్శ అన్న అనుభూతి కలగలేదూ?నీ జ్వరంలో నీ కోసం అతను నీ పక్కన ఉండి సేవచేస్తే ఆ క్షణాలు శాశ్వతం కావాలని అనుకోలేదూ? అతను భుజంచుట్టూ చెయ్యివేసి నడిపించినప్పుడు అలాగే జీవితాంతం ఉండిపోతే బావుణ్ణనిపించ లేదూ?' అని మనసు సవాల్ చేస్తుంటే..

'లేదూ! లేదూ!' గట్టిగా అరవాలనుకొని నిజం నోరు నొక్కేస్తుంటే నిస్సహాయంగా ఉండిపోయింది.

'నిజమే...అందుకని ఏం చెయ్యను! నా స్వార్థంకోసం నన్ను నమ్ముకొన్న వాళ్లను వదిలేయనా? అతనికి మనస్ఫూరిగా అంకితం అవగలనా? లేదు... లేదు...ఎందరో అనాథలు ఆ నరకంలో మగ్గిపోతున్నారు. ఆ నరకం చూడలేక ఆనాడు నేను చేసుకొన్న నా నిశ్చయాన్ని, నా జీవితాశయాన్ని నాశనం చేసుకొని నా ఒకరి సుఖంకోసం బలి చేయను. లేదు అలా చేయను. అతని ఆరాధన పవిత్రమైనది. నా ప్రేమ స్వచ్ఛమైనది. వాటికి ఓ బంధంలేదు. అక్కర లేదు. ఏ బంధం లేకపోయినా ఒకరికొకరు బంధితులమే ఏనాడూ! నా కోరికగా మిత్రాని ఒకటడుగుతాను. సరస్వతిని చేసుకొని ఆమెకోదారి చూపించమని, ఆమె జీవితం పరిపూర్ణత చెయ్యమని. అప్పుడు నా ఆదర్శం మొగ్గ తొడిగి పుష్పిస్తుంది. నా కోసం, నా ఆఖరి ఘడియల్లో తృప్తిగా ప్రాణం విడిచేందుకు నా వాళ్లంటూ వాళ్ళుంటారు. సరస్వతి కన్నకూతురికన్నా మిన్నగా ఆదరిస్తుంది. వాళ్ళ చల్లని నీడలో నా చరమదశ గడిపివేస్తాను. అవును, అదే నా జీవితానికి ముగింపుకావాలి. మిత్రా! నన్ను క్షమించు. నీ ఆరాధనలో ఒక సమిధనయి పోనీ నన్ను. నీ పాదాల చెంత స్వచ్ఛంగా నీకోసమే రాలిపోనీ. ఈ బంధాల్లో యిరుక్కుపోయి అందులో ఏ మూలో అణిగిపోయిన ఆరాధనతో సామాన్యంగా చచ్చిపోవాలని లేదు. మనసు నిండా నీ తలపులతోనే నీకోసమే నా ఆఖరి వూపిరి కూడా విడవనీ. అంతే

నేను కోరుకునేది...!'

అలారం మోగడంతో మండుతున్న కళ్ళను వాచీవైపు తిప్పింది.

'అబ్బ! అయిదయిందే టైము. రాత్రి అంతా ఆలోచిస్తూ గడిపేసానన్నమాట. ఒకోరాత్రి నిద్ర కరువు చేసుకోవడం తన కలవాటే కానీ, ఒక మంచి నిర్ణయం తీసుకొని ఈ రాత్రిని పవిత్రం చేసాను. ఇంక నా మనసుకు ఏ మాలిన్యం, ఏ కోర్కె అంటదు. ఇది పవిత్రతతో పునీతమైంది. ఎప్పటికీ నా మనసులో సజీవంగా అతని రూపు, అతని స్పర్శ, అతని ఆత్మీయత, అనురాగం, గుండెల్లో చిరస్థాయిగా నిలపుకొన్నరేయి. స్వామీ! నా ఈ నిర్ణయాన్ని సడలిపోనివ్వకు!' ఎదురుగా ఉన్న కృష్ణ విగ్రహాన్నిచూసి ఉత్సాహం తెచ్చుకుంటూ మంచం దిగింది.

'ఈ రోజు సాయంత్రం మిత్రా వస్తాడు!' అన్నఊహే ఆమెలో చైతన్యం కలిగిస్తూ నిలువనీయకుండా చేస్తోంది.

* * *

సాయంత్రం అయింది. స్నానంచేసి లేత పసుపురంగు ఫుల్‌వాయిల్ చీరమీద ఎర్రరంగు చుక్కలున్నది కట్టుకొని అదేరంగు జాకెట్టు వేసుకొంది. ఎర్రటి సింధూరం గుండ్రంగా నుదుటిమీద దిద్దుకొని చేతులకు ఎర్రని మట్టిగాజులు వేసుకొంది. జారుగా వేసుకొన్న వాలు జడలో ఎర్రని గులాబి ఆకులతో తుంచి పెట్టుకొంది. డాబామీద తివాసీ పరిపించి టేప్‌రికార్డర్ పట్టుకొని పైకివెళ్తూ...

"ఎలీజా! మిత్రా వస్తే పైకితీసుకురా" చెప్పి వెళ్ళిపోయింది.

తివాసీ మీద పడుకుని పుస్తకం తిరగేస్తూ టేపు ఆన్‌చేసింది. లలిత గీతాలన్నీ ఒక టేపులో వున్నాయి. ఆ సాయం సమయంలో, ఆహ్లాదకరమైన వాతావరణంలో వేణువు రవళించినట్లు మృదు మధుర ధ్వని తరంగాలను ప్రసారించింది.

"ఆ రజనీకర మోహనబింబం నీనగు మోమును బోలునటే!" ఎంత చక్కగా రాసాడాకవి. ఎంత ప్రాణం పోసాడా గీతానికి ఘంటసాల. ఆమె పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి. కనులర మోడ్పులయ్యాయి. ఆ గానామృతాస్వాదనలో ప్రపంచాన్నే మరచిపోయిన స్మిత తరువాత పాటలో పాటు మరో గొంతు కలవడంతో వులిక్కిపడింది.

"వెలిగించవే చిన్ని వలపు దీపం,



ఎందుకే నా మీద ఇంత కోపం" మిత్రా కన్నుల్లో కొంచెదనం.

తక్కున ఆఫ్ చెయ్యబోయింది.

ఆ చెయ్యి అలాగే పట్టుకొని కళ్ళ తోనే వారిస్తూ—

"మీరు పాడుతున్నారుగా ఇంకెం దుకు? ఇంత బాగా మీరు పాడతారని నాకు తెలీదే!"

"నాకు మాత్రం తెలుసునా? గుండెలో మెదిలే మాటలే పాటలుగా వస్తుంటే గొంతు దానంతటదే పలికింది"

ఒక్కక్షణం మైమరచిన స్మిత వాస్త వానికొచ్చినదాన్లా టేప్ ఆఫ్ చేసింది.

"అదేం! ఇంకా పాటలున్నట్టు న్నాయిగా?" ఆశ్చర్యంగా అన్నాడు.

"ఉన్నాయ్! తరువాత పెట్టుకొందాం! నా కథ మొదలు పెట్టనా?" తుంచే స్తున్నట్లు అసలు విషయంలోకి దిగుతూ అంది స్మిత.

అయిష్టంగా మొహం పెట్టాడుమిత్రా! అయినా లెఖ్ఖలేనట్లు మొదలు పెట్టింది.

"మాది మధ్యతరగతి కుటుంబం. మా అమ్మను మా నాన్న ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడనే కంటే లేవదీసుకొచ్చా డంటే బాగుంటుందేమో? దాంతో ఎవరితో సంబంధాలు లేకుండాపోయాయి. మా అక్క పుట్టింది. మామూలుగా సాగి పోయాయి రోజులు. నేను పుట్టాక పరిస్థితులు తలకిందులయ్యాయి. నన్ను దురదృష్టవంతురాల్ని చేస్తూ మా నాన్న తాగుడునేర్చుకుని ఆ మైకంలో బస్సు కిందపడి చచ్చిపోయాడు. అప్పటికే చచ్చిపోయిన ప్రేమతో, దారిద్ర్యంతో విసిగిపోయిన అమ్మ పెద్దగా బాధపడ లేదు. మమ్మల్ని తీసుకుని బంధువులను కొనే వాళ్ళెళ్ళన్నీ అభిమానం, సిగ్గు అన్ని పదాలను విడిచిపెట్టి తిరిగింది. వాళ్లు అంతంత మాత్రం వున్నవాళ్లే కనుక మమ్మల్నేం ఆదుకుంటారు. తిరిగి తిరిగి మాగూటికి చేరుకున్నాం. అమ్మ ఒకరింట్లో వంటకి కుదిరింది. మమ్మల్ని చదివించాలని ఆశ. ఎక్కణ్నుండి తెస్తుంది డబ్బు? వీధిబడిలో ఎనిమిదో తరగతి పూర్తిచేసాం. మేం పెద్దవాళ్ల మవుతున్న కొలదీ ఎన్నో సమస్యలు, ఎన్నో ఆలోచనలు, మరెన్నో కోర్కెలు, ఎన్నో భయాలు. అమ్మకు మాగురించి బెంగ ఎక్కువయింది. ఎదుగుతున్న అందమైన ఆడపిల్లలం. ఎలా కాపాడు కోవాలన్నదే మా అమ్మకు తాపత్రయం. మేముసాయంత్రంపూటఅమ్మకు సహాయం చెయ్యడానికి వెళ్ళుండే వాళ్ళం తరువాత అమ్మ వద్దనేసింది. తరువాత తరువాత పూటకు లోటులేకుండా గడచి పోతుండేది. ఎలా అవుతోందో అర్థం అయ్యేదికాదు నాకు. నాన్న చనిపోయాక మొదటిసారిగా అమ్మ మంచాన పడినప్పుడు నాకు భయం వేసింది. అక్క, నేను మంచం దగ్గరే కూర్చుని భయంతో బిగుసుకుపోయి అమ్మదగ్గరేకూర్చున్నాం.

'నాకేం ఫరవాలేదమ్మా! మూడు రోజుల్లో తగ్గిపోతుంది' అంటూ ధైర్యం చెప్పింది. ఆ తరువాత అర్థం అయింది అమ్మ బలవంతాన ఎబార్షన్ చేయించేసు కొందని. అక్క పెద్దయ్యేసరికి అమ్మ అనారోగ్యం పాలయింది. ఒక్కొక్క మెట్టు దిగజారిపోతూ ఈ సంఘానికి దూరంగా జరిగిపోయాం మాకు తెలియ కుండానే. అమ్మను పని మాన్పించేసారు. అక్క ఎక్కడ తిరిగినా పని దొరకలేదు. 'మీ అమ్మచేసిన నిర్వాకంచాలు. ఇంక

మిమ్మల్ని వుసిగొల్పిందన్నమాట మా ఇళ్ళమీదకి!' అంటూ చాలా నీచంగా మాట్లాడేవారు.

'ఎందుకమ్మా అలా చేసావ్?' అక్క, నేను ధైర్యంగా నిలదీసి అడిగాం.

'ఎలా చెప్పమంటారే తల్లీ! ఏ తల్లి చెప్పుకోకూడని మాటలు ఎలా చెప్పనే మీకు. నేను నీతిగా పనిచేసుకొన్నన్నాళ్ళ మన మూడు పొట్టలు గడిచేవి కావు. అయినా నేను బాధపడలేదు. ఆ మాత్రం ప్రాణం నిలుస్తే చాలనుకొని మిమ్మల్ని కాపాడుకొందామనుకొన్నాను. కానీ... ఆరోజు అమ్మగారు లేని సమయంలో నన్ను నాశనం చేసి నా చేతిలో పది రూపాయలు పెట్టాడు. ఆ క్షణంలో నాలో కలిగిన ఆవేశం, కసి, ద్వేషం నన్నిలా చేసాయి. నెలంతా కష్టపడ్డా చేతికిరాని పదిరూపాయలు ఒక్కక్షణం కళ్ళు మూసుకుంటే చాలు అరచేతిలో వాలతాయి. నీతిగా వుంటే కడుపునిండదు అదమ్మా! కలిగే లాభం ఒక్కటి కనిపించింది. కనీసం మీరయినా సుఖంగా తిని బ్రతుకుతారని ఆశపడ్డాను. నా లేమి వాళ్ళకు చులకన అయిపోయింది. నేను డబ్బు తీసుకోకపోయినా నన్ను బలవంతంగా అనుభవించి వదిలేస్తారు. నేనెందుకు ప్రతిఫలం లేకుండా ధారపోయాలి? అందుకే అలా అలవాటు పడిపోయాను. ఎన్నాళ్ళు లోకం కళ్ళు కప్పుతాం. అందరికీ తెలిసింది. అందుకే ఎవరూ ఇళ్ళల్లో పనులకు రానివ్వలేదు. నేనేది సాధించాలనుకొన్నానో అది సాధించలేకపోయాను. మీకేమీ చెయ్యలేకపోయాను. కళ్యాణీ, కమలా, మీరు ఆడపిల్లలు. పేదవాళ్ళు. అందమైనవాళ్ళు. సంఘం మిమ్మల్ని ఎలా వేటాడి చీల్చి చెండాడుతుందో తలచుకొంటే నా గుండె బద్దలయిపోతోంది. కళ్యాణీ! ఓపని చేద్దామే! ఇంత విషం పట్టావే తాగి ముగ్గురం ఓసారే చచ్చిపోదాం! దాంతో మన సమస్య తీరిపోతుంది' ఆయాసపడుతూ ఆగింది అమ్మ! అంతా వింటుంటే నా రక్తం ఉడుకెత్తిపోతోంది. ఎందుకు చావాలి మేము? కేవలం మా దారిద్ర్యం కోసమే చావాలా? వాళ్ళందరికీ అక్కరలేని నీతి మాకెందుకు కావాలి. అమ్మను అనుభవించిన వ్యక్తిని సంఘం, కనీసం వాళ్ళావిడయినా ఎందుకు వదులుకోలేకపోయింది. అమ్మ కావాలని చెయ్యని తప్పుకు మమ్మల్ని వెలి వేస్తున్నారీ మనుషులు ఎందుకు చావాలి? చచ్చి సాధించేదేముంది. మేము బతుకుతాం! ఎలా వీలయితే అలాగే బతుకుతాం! అంతే... ఆనాడు నాలో రేగిన కసి అది.

'అక్కా! మనమెందుకు చనిపోవాలే? నాకు భయం బాబూ నేను మాత్రం చావను. దూరం చేసేది ఈ మనుషులే, దగ్గరయ్యేది ఈ మనుషులే! ఇక్కడ కాకపోతే మరో దగ్గర పని చేసుకు బతకలేమా?' నిరాశగా గోడకు చేరబడి శూన్య దృక్కులతో నిశ్చలంగా వున్న అక్క నా మాటలకు ఉలిక్కిపడింది.

'కమలా! నాకూ భయమేనే చావంటే. ఎలా బతుకుదాం? ఎక్కడన్నా పని చేసుకుని బతుకుదామన్నా అమ్మకు పట్టిన గతే పడుతుంది మనకు. మన లాంటి వాళ్ళను ఆదుకునే దేవుడు ఉండడు' అంటూ నన్ను కౌగలించుకొని ఏడ్చింది అక్క.

'అలా వాద వివాదాలతో వారం గడిచిపోయింది. అమ్మ మంచం మీద నుండి లేవడం లేదు. తినడానికి లేదు.

రెండురోజులు ఏమీతినకుండాగడిపేసాం. ఒకరితో ఒకరు మాట్లాడితే ఏడుపొస్తుం దేమోనని, ఒకరి మొహం ఒకరు చూసుకోకుండానే గడిపివేస్తున్నాము. కాని ఎన్నాళ్లు అలా గడపగలం అనేదే ప్రశ్న. ఆకలితో నిద్రపట్టని అక్క, నేను వెళ్లి ముందు అరుగుమీద కూర్చు న్నాము. చంద్రుడు తనకి బాధ్యతతో ప్రమేయం లేనట్లు అందరికీ వెన్నెల పంచి పెడుతున్నాడు నిర్వికారంగా. అందులో అందాన్ని ఆస్వాదిస్తూ ఆనం దించడానికి మా మనసుల్ని కాలే కడుపు ఎపుడో చంపేసింది. నిర్మానుష్యంగా ఉన్న రోడ్డు వైపు చూస్తూ శిలల్లా కూర్చున్నాం. అంతలో అతనెవరో వెళ్తూ వెళ్తూ వెనక్కి వచ్చి అక్క దగ్గర ఆగాడు. అక్క భయంగా చూస్తోంది. నాలో ఏదో ఉత్సుకత. ఇద్దరం కదల కుండా చూస్తున్నాము. అతను జేబులో నుండి పర్స్ తీసి రెండు నోట్లు చేతిలోకి తీసుకుని తమాషాగా కదిలించాడు. వెన్నెల వెలుగులో ఆ రెండు పది రూపా యల నోట్లని తెలిసి ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయిపోయాను. అయాచితంగా ఇరవయి రూపాయలు! నా ఆకలి నన్ను మరి ఆలోచించనివ్వలేదు. పరు గున వెళ్ళి 'పండక్కి బావ వచ్చినంత' సంబరంగా అమ్మకు చెప్పాను. ఆ మాట వినగానే ఆవేశపడిపోతూ మంచం కోడుకు తలకొట్టుకొంటూ ఏడవడం మొదలు పెట్టింది. నాలోని ఉత్సాహం చప్పగా చల్లారిపోయింది. ఆకలి, కోపం, కసి అన్నీ కలసి ఉవ్వెత్తున చిరాకు కలిగిం చాయి. 'ఎందుకమ్మా ఏడుస్తావు? మనం ఎవరికోసమూ చచ్చిపోనక్కరలేదు. రేపు కూడా తిండి లేకపోతే తప్పకుండా చచ్చి పోతాం. మనల్ని పోషించి పెట్టే వాళ్లెవరూ ఉండరు. అంత దిక్కుమాలిన చావు చావాలని లేదు నాకు' అంటూ కసి రాను. ఆ నిముషంలో అంత తెగింపు, ధైర్యం, నిర్లక్ష్యం ఎలా వచ్చాయో నాకే అర్థంకాదు. అంతవరకూ గుమ్మం దగ్గర నిలబడ్డ అక్క నెమ్మదిగా అతన్ననుస రించింది-పగిలిన అమ్మ గుండెల మీదుగా నడచుకుంటూ నిశీధిలోకి. వాళ్ళ వెనకే పైకి వచ్చిన నేను వాళ్ళిద్దరూ కనబడే వరకు చూస్తూ నిలబడిపోయాను. అతను అక్కను 'ఏదో' చేస్తాడన్న ఊహ రావడం లేదు నాకు. 'అతను చూపించిన నోట్లు ఎపుడు స్వంతం అవుతాయా?' అన్న ఆశతో అక్క రాకకోసం ఎదురు చూస్తూ గుమ్మంలోనే కూర్చున్నాను.

ఎంత టయమయిందో తెలీదు. అక్క తూలుతూ వచ్చి నా చేతిలో నలిగిపోయిన నోట్లు పెట్టి చాపమీద పడిపోయింది. ఆ నోట్లు నాలో ధైర్యాన్ని, ఉత్సాహాన్ని చ్చాయి. నేనా ఆనందంలో ఉండగానే తెల్లవారిపోవడం గమనించి పరుగున కొట్టుకి వెళ్ళి సామాను తెచ్చేశాను. గబ గబ వంట చేసేసాను. అక్కను లేపితే అయోమయంగా లేచి కూర్చుంది. అమ్మ బలవంతాన ఎంగిలి పడింది. మూడు రోజులు ఆకలి బాధను మరచిపోయాము. అక్క మామూలుగా అయిపోయింది. మూడు రోజులు నిశ్చింతగా వండి పెట్టేసిన నాకు 'రేపటికి ఏంలేవు' అన్న నిజం నిలకడ లేకుండా చేసింది.

'అక్కా! రేపటికి పిడికెడు బియ్యం కూడా లేవు' అన్నాను హెచ్చరిస్తు న్నట్లు! భావరాహిత్యమైన చూపులతో నా ప్రశ్నకు సమాధానం చెప్పింది. ఆ రాత్రి మరల అక్క వీధి అరుగుమీద కూర్చుంది

నిశ్చలంగా. ఈ మూడు రోజులు కడుపు నిండడంతో నాలో వివేకం తిరిగి పని చెయ్యనారంభించింది. అక్కపట్ల జాలి కలిగింది. 'అక్కా! నేను చిన్నదాన్ని. లేకుంటే భారాన్ని ధైర్యంగా నేనే వహించే దాన్ని. నిన్ను...నిన్ను...నా తిండికోసం బాధపెట్టేదాన్ని కాదు' ఏడుస్తూ అక్కను చుట్టుకున్నాను.

'కమలా! నువ్వొకటి, నేనొకటినా? నిజానికి బాధ్యత నాదే! నువ్వేమాత్రం అలా అనుకోకు. మంచికో, చెడుకో నేను ఇలా సంపాదిస్తున్నాను. నా సంపాదన నిన్ను నా మనిషిగా నిలబెడితే అంతే చాలు. చదువుకో. రేపటినుండి స్కూలుకి వెళ్ళు... నువ్వు బాగా చదువుకొని ఉద్యోగం చేయాలి కమలా! నన్నా ఆశతో నన్నా బతకనీ!' అంటూ నిశ్చలంగా వెన్నుతట్టి ధైర్యం చెప్పిందక్క. అలా అక్క తన యవ్వనంతో మా కడుపులు నింపడం మొదలుపెట్టింది.

నేను తిరిగి స్కూలుకి వెళ్ళడం మొదలుపెట్టాను. స్కూల్లో అందరూ వేళాకోళం- వెక్కిరింతలు మొదలు పెట్టారు. నేను లెక్కచెయ్యకపోవడం చూసి అరచి అరచి ఊరుకొన్నారు. పట్టుదలగా చదువు మీదే దృష్టి ఉంచే దాన్ని! కొన్నాళ్ళు గడిచాక అక్కను అతను ఓ బ్రోతల్ హౌస్‌కి అప్ప చెప్పాడు - ఎక్కువ రాబడి వస్తుందని!

అక్కడ నుండి అక్కడబ్బు పంపి స్తుంటే అమ్మ,నేను నెట్టుకొస్తుండేవాళ్ళం. అంతలో నేను పెద్దదాన్నయాను. అందరి కళ్ళు నామీద పడసాగాయి. కాని ఆ చూపులు చూస్తుంటే మామూలు ఆడ పిల్లల్లా సిగ్గు, భయం కలిగేవి కాదు. ధైర్యంగా, నిర్లక్ష్యంగా ఎదుర్కొనే శక్తి అలవడింది. జీవచ్ఛవంలా అమ్మమంచంలో తీసుకొని తీసుకొని పోయింది. అక్కకు కబురు తెలిసి వచ్చింది. ఆ వయసులో చావుబతుకుల్ని చూస్తూ భయపడని నా ధైర్యానికి అక్క ఆశ్చర్యపోయింది. అయినా చిన్నదాన్ననే భావం అక్కను దిగులుపడేలా చేసింది.

'ఎందుకక్కా నా గురించి భయపడ తావ్! అమ్మ మన జీవితాలు ఇలా కాకూడదని కోరుకొంటూ తనను తాను బలిచేసుకొంది! మా కోసం నువ్వు తెలిసే కళ్ళు మూసుకుని ముళ్ళబాటలో అడుగు పెట్టావ్! నేను చదువుకొని ఉద్యోగం చేసుకోవాలనీ, మామూలు జీవితం గడ పాలనీ, నామీద ఏ నీడలు పడకూడదనీ అహర్నిశలు నాకోసం కరిగిపోతానంటావ్! కానీ...అక్కా! మన బతుకులకు భద్రత లేదని తెలిసీ భయపడడం అనవసరం. 'ఏదో' దాచుకోవాలన్న తపన, దేన్నో కోల్పోతామేమో నన్న భయం మన బతు కుల్ని మరింత యిరుకుగా చేస్తుంది. మన దగ్గరుండేది 'అందం' అన్న ఆస్తి, శీలం పోతుందన్న భయం. అంతే కదా! పోతేపోనీ, ఈ శీలం ఉండి మాత్రం ఉద్ధరించేదేముంది? గుప్పిట మూసి ఉన్నంతవరకే రహస్యం. తెరిస్తే...ఏదీ లేదు. అందుకని నాగురించి ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకోకు. నాకు చేతనయిన విధంగా నన్ను నేను కాపాడుకొంటాను' అంటూ తిరిగి అక్కకే ధైర్యం చెప్తుంటే, నా ఊహలకు, మాటలకు భీతహరిణిలా చూసిందక్క.

'కమ్మూ! నీకు తెలీదే నేనెంతనరకం అనుభవిస్తున్నానో! గుప్పెట తెరచి నంత తేలికకాదు శీలాన్ని అమ్ముకోవడం. అసలు నీకా ఊహలెందుకు? నేను బతికి

ఉన్నంతవరకూ నీకేలోటూ రాకుండా చూసాను. చదువు అవగానే ఏ ట్రెయినింగో అయి చిన్న ఉద్యోగం సంపాదించుకొన్నావంటే ఏ మహానుభావుడన్నా ముందుకొస్తాడు చేసుకొందుకి. పెళ్లి చేసుకొని పిల్లాపాపలతో హాయిగా ఉండవే! నాకున్న చిన్న తృప్తల్లా ఒక్కటే. నీవు ఉద్యోగం సంపాదించి పెళ్లి చేసుకొని హాయిగా ఉంటావ్! ఆ ఆశే నన్ను బతికిస్తోంది. అందులోనుండి బయట పడతానన్న ఆశలేదు, పడాలన్న కోరికా లేదు! నేనేమయిపోయినా నా ప్రాణం పోయేంత వరకూ సంపాదించి పంపిస్తాను. తొందర పడకు. జాగ్రత్తగా ఉండు' అంటూ ఏడుస్తూ వెళ్లిపోయింది.

గుడిసెలో ఒంటరిగా మిగిలిపోయాను. రాత్రింబవళ్లు నన్ను నేను కాపలా కాసుకొంటూ, నిమిష నిమిషము ఎదురయ్యే పరిస్థితులతో పోరాడుతూ చదువు కొనసాగిస్తుండేదాన్ని. అప్పుడే అరవింద్ పరిచయమయ్యాడు. నాకన్నా ఒక సంవత్సరం సీనియర్ స్కూల్లో. వాళ్ళ మేడ వెనుక నుండే గుడిసెల్లో ఒకటి నాది. అపుడపుడు వాళ్లింటికి వెళ్లి వాళ్ళ అమ్మకు పనుల్లో సహాయపడి, ఆవిడ ద్వారా అరవింద్ దగ్గర పాత నోట్సులు, పుస్తకాలు అడిగి తీసుకొంటూండేదాన్ని. చదువుమీద నాకు గల శ్రద్ధ చూసి ఆవిడెంతో ముచ్చటపడి ఎంతో ఆదుకొనేది. చిన్నవాడయిన అరవింద్, పెద్దవాడయిన అరవింద్ తండ్రి ఒకే దృష్టితో చూసేవారు నన్ను. ఆ చూపుల కర్థాలు చదివి, చదివి వడపోసిన నాలోని నిర్లక్ష్యమే వాళ్ళని దూరంగా ఉంచేది. అపుడపుడు మరీ భయపడిన రోజున, నాకున్న ఒకే ఒక స్నేహితురాలు పద్మ దగ్గర ఉండిపోయేదాన్ని. అలా బతకడం కూడా ఇష్టం లేదన్నట్లు భగవంతుడు నాకు పరీక్ష పెట్టాడు. పరీక్షలకి శ్రద్ధగా చదువుతున్న నేను అక్క దగ్గర నుండి వచ్చిన ఉత్తరం చూసి నీరుకారిపోయాను.

తన పరిస్థితి ఏమీ బాగులేదని, ఎలాగన్నా ఒక్కసారి రావలసిందని ఎడ్రసు ఇస్తూ ఎవరిచేతో రాయించింది. అంతకు ముందు నుండీ సరిగ్గా డబ్బు పంపడం లేదు అక్క. ఈ ఉత్తరం చూసాక కారణం అర్థం అయింది. ఉండలేకపోయాను. పద్మ దగ్గర డబ్బు అప్పు తీసుకొని ఉత్తరంలో రాసిన ప్రకారం వెళ్ళాను. గుమ్మంలో అడుగు పెట్టగానే కనబడిన ఆ దృశ్యం... అబ్బ తల్చుకొంటే ఇప్పటికీ..." అంటూ ఆగిపోయి వెక్కి వెక్కి ఏడవడం ప్రారంభించింది స్మిత.

ఇపుడే జరుగుతున్నది కళ్ళతో చూస్తున్నంత ఇదిగా అందులో లీనమయిపోయి చెప్పుకుపోతున్న స్మిత, ఒక్కసారి ఆగిపోయి ఏడుస్తుంటే... ఆమెతో పాటు ఆ అనుభూతి పొందుతున్న మిత్రా-ఊరడించాలని తెలియని వాడిలా చూస్తుండిపోయాడు బరువెక్కినగుండెతో కాస్సేపటికా ఉధృతం తగ్గి తనను తాను సంభాళించుకొంది స్మిత. కళ్లు తుడుచుకొంటూ తిరిగి చెప్పడం ప్రారంభించింది స్మిత.

"ఒక్క 'ముద్ద' అన్నం పెట్టమని ఏడుస్తూ బతిమాలుతోందక్క.

'పోవే, బయటకి పొమ్మంటేపోవు. నీ తాత సంపాదించినదేమీ లేదిక్కడ

కూర్చోబెట్టి మేపడానికి. కాని సంపాదన లేకపోయినా పూట పూటకీ ముద్ద కావాలి!" ఈసడింపుగా అంటూ కిళ్లీ నములుతూ విలాసంగా కూర్చున్న ఆ రాక్షసిని చూస్తూ ఇక ఆగలేకపోయాను.

'ఎవరి బాబు కూతురు చవగ్గా ఉందని ఇన్నాళ్లు అది సంపాదించినది తిన్నావే! ఇన్నాళ్లు దాన్ని అమ్ముకొని డబ్బు చేసు కొని, ఈనాడు ఒక్క ముద్ద అన్నం పెట్టడానికి ఏడుస్తావా?' అంటూ సుడి గాలిలా అడుగు పెట్టిన నన్ను బిత్తర పోయి చూసింది. ఆ తరువాత పెద్ద పెట్టున నవ్వుతూ—

'నీ అక్క సంపాదన బాగా వంట బట్టినట్లుందే! బొమ్మలా తయారయ్యావు! నీకు పంపిందంతా ఎక్కడిదనుకొన్నావ్? నాకేం ఇచ్చిపడిపోలేదు నీ అక్క. పెద్ద లార్డులా బయలుదేరావుగానీ! పోనీ నువ్వుండకూడదూ? సంపాదించి ఎంచక్కా మీ అక్కకి బాగుచేయించుకో వచ్చు! నీకూ ఆదరువుగా ఉంటుంది' ఆశగా చూస్తూ అందా రాక్షసి.

'నేనా? నేనంత తెలివితక్కువదాన్ని కాదు—సంపాదించినదంతా నీ చేతిలో పోసి, నీ దయా ధర్మం మీద బతక డానికి! అడ్డులే ముందు' అంటూ విదిలించి అక్క చెయ్యి పుచ్చుకొన్నాను. పట్టపగలు కావడంతో అంతా ఎవరిళ్లల్లో వాళ్లున్నారు. బ్రోకర్లు కూడా లేకపోవడంతో, గొడవ పడినా కొంతమంది అమ్మాయిల సపోర్టుతో అక్కను తీసుకొని బయట పడ్డాను.

అలా ఇల్లు చేరుకొన్నాం. మళ్లీ సమస్యలు. అక్క అనారోగ్యం, మందు లేకపోతే గడవని స్థితి. ఆకలి.. డబ్బు.. ఎటుచూసినా, దేనికన్నా డబ్బు కావాలి! ఎలా? మా లెఖ్ఖల మాస్టారికి నేనంటే అభిమానం. ఆయనతో నా పరిస్థితి అంతా చెప్పుకొని ఎక్కడన్నా పనిప్పించమన్నాను. ఆయనకు తెలిసినవాళ్ళింట్లో వంటపని, ఇంటి పని చెయ్యడానికి కుదిర్చారు ఏభయి రూపాయల జీతం మీద. అమ్మ గుర్తొచ్చింది. 'చరిత్ర పునరావృత మవుతుందేమో'ననుకొంటూ పనిలో కుదిరాను. అక్కడా ఆకలి చూపులే! నా యవ్వనం, అందం నాకు శత్రువులైతే నా ధైర్యం, తెలివితేటలు నాకు అంగరక్షకుల్లా నిలిచాయి. వాళ్ళిచ్చిన దాంట్లో కడుపులు నింపుకొని నెట్టుకొస్తున్నా... వచ్చే జీతం పది రోజులకు వచ్చేదికాదు. మందులు మందులు ... ఎన్ని మందులు వేస్తున్నా కొంచెం కూడా తిరుగుమొహం పట్టని అక్క జబ్బు నాకు ఆశ్చర్యంగా ఉండేది. అక్క ఒక్కొక్కసారి మందులు వద్దని భీష్మించుకొని కూర్చునేది. కాని ఎలా? ఎలా వదిలేస్తాను బాధపడుతుంటే? అక్కను అలా చూస్తున్నపుడంతా నాలో తొలుస్తున్న ఒకే సమస్య నాకు నిద్రను కరువు చేసేది.

బాగున్నన్నాళ్లు వ్యాపారం చేయించి సంపాదించినదంతా తీసుకొని దయా ధర్మంగా భోజనం పెట్టిన వాళ్లు, అదే మనిషి ఆరోగ్యం కోసం ఎందుకు శ్రద్ధ తీసుకోరు? ఇన్నేళ్లు సంపాదించినదంతా వృధాయేనా? అక్కడున్న అమ్మాయిలు కూడా ఇలాగే కుళ్ళి కుళ్ళి రాలిపోవల సిందేనా? వాళ్ళు సంపాదించిన దానిలో వాళ్ళకోసం కొంతయినా ఖర్చు పెట్టు కొనే అధికారం ఎందుకు లేదు? ముందు జాగ్రత్త కోసం మందులు వాడితే ఇలా ఎందుకు తయారవుతారు? సంపాదించ

లేనపుడు ఏదో కొంత ఇచ్చి పంపివేయ కుండా అలా చిత్రహింసలు పెడుతూ ఎందుకు బయటకు రానివ్వకుండా చేసారు? పరిస్థితుల ప్రాబల్యం వలన ఏదో మార్గం ఎన్నుకొంటే, దానికిదా ప్రతిఫలం? అక్కలాగే అందరి జీవితాలు ముగియవలసిందేనా? అలా కాకూడదు, అక్కలాంటి కుక్క బతుకులు ఉండ కూడదు! వ్యభిచారం ఓ వృత్తే! దానికి చివర దశ ఇది కాకూడదు! కానీ ఎవరు పట్టించుకొంటారీ విషాదగాథను? ఎవరు కావాలని దిగు తారీ రొంపిలో? ఎవరు వాళ్ళకి వెలుగు చూపిస్తారు?' – ఇదే ఆలోచన...!

తీరిగ్గా ఉన్నపుడంతా అక్క అను భవాలు చెప్పమనేదాన్ని.

'ఎందుకులే కమ్మూ! అవేం తీయని అనుభవాలు కావు – గుర్తు తెచ్చుకొని చెప్పి ఆనందించడానికి! ఆ నరకం తలంచుకొని మళ్ళీ చిత్రవధ ననుభవించ మంటావా? వద్దు...ఆవన్నీ విని నన్ను అసహ్యించుకొంటావు! అది నేను భరించలేను!" అనేది ఏడుస్తూ. ఆ నిమిషంలో నేను తల్లి, అది బిడ్డ! అలా ఫీలయేదాన్ని.

'నిన్ను నేను అసహ్యించుకొంటే నన్ను నేనుఅసహ్యించుకొన్నట్లే. అక్కా! తప్పుచేసే అవినీతిపరులను అసహ్యించు కుంటారు, కాని త్యాగమూర్తులను అస హ్యించుకోవడం ఎక్కడన్నా చూసామా? నాకు తెలియాలి! నన్ను తెలుసుకొనీ అందులో సాధక బాధకాలు"

'ఎందుకు? తెలుసుకొని ఏమిచేస్తావ్? కమలా! తిండి లేకపోతే ధైర్యంచేసి కళ్ళు మూసుకొని గుక్కెడువిషం తాగు. అంతే



గాని... నాలా, నాలాంటి స్థితికి రాకు! నాకే ఆ తెగింపుఉండే ఈనాడిలా కుళ్లిన శవంలా ఉండేదాన్ని కాదు...కాదు!" ఆవేశపడిపోయేది అక్క.

'అదికాదులేవే! నేనెందుకు ఊబిలోకి దిగుతాను ప్రత్యక్షంగా చూస్తూకూడా! కాని నాకు మంచి చెడు తెలియాలిగా!'

అంటూ లాలించి,బుజ్జగించి రాబట్టేదాన్ని. అది చెప్తున్న ఒకొక్క సంఘటన నా రక్తంలో ఒకొక్కక్క రక్త బిందువును ద్వేషంతో నింపేసింది. ఆ బ్రోతల్ హౌస్ వాతావరణం, జీవచ్ఛవాల్లాంటి మనుషుల సంగతి, ఆ హౌస్ నడిపేవాళ్ళ



పెత్తనం, ఒకటేమిటి అన్ని సంగతులూ వింటుంటే నాలో రగిలే అగ్ని పర్వతాలు నన్ను దహించివేయడం మొదలెట్టాయి. రాత్రిళ్లు నిద్రపోకుండా ఆలోచించేదాన్ని.

"నన్నెవరు పెళ్లి చేసుకుంటారు! అందం ఒక్కటే క్వాలిఫికేషన్ కాదే పెళ్లికి! అందులో ఇటువంటి చరిత్ర ఉన్న తనని ఏ కూలివాడూ చేసుకోడు... అయినా పెళ్లి చేసుకొని చేసేదేముంది? సెక్సు సంబంధాలకో లైసెన్సు ఈ పెళ్లి. అంతే! పెళ్లి చేసుకొని వాడితో తన్నులు తింటూ, పిల్లల్ని కంటూ, వండిపెడుతూ ఒక ధ్యేయంలేకుండా జీవితం గడిచిపోవలి సిందే! భగవంతుడి మానవజన్మనిచ్చి నందుకు కొంతయినా సాటివాళ్ళకి ఉప కారం చేయగలిగితే ఆ జన్మ ధన్యమై పోదూ? తన పిచ్చిగాని తననెవరు పెళ్లి చేసుకొంటారు! తనింకెన్నాళ్ళో ఈ జనా రణ్యంలో స్వేచ్ఛగా బతకలేదు! అమ్మ లాగే తన బతుకు అయిపోతుంది. ఇప్పటి వరకు బాగానే ఉంది పనిచేస్తున్న ఇంట్లో. ఇంటాయన తమ్ముడు వచ్చాడు మొన్న. అతని చూపులు ఎంత ఆకలిగా ఉన్నాయ్? తనకు తెలుసు కనుక తట్టుకో గల్గుతూంది.దారితప్పిన లేడిపిల్ల ఎన్నాళ్లు ఏ పులివాత పడకుండా ఉంటుంది? అక్క ఏదో భ్రమపడుతోంది – తను చదువు కొని ఉద్యోగం చేసుకొని పెళ్లి చేసుకొని సుఖంగాబతకాలని,బతుకుతానని. అవన్నీ ఒట్టి అడియాసలే! ఉద్యోగం దొరకడం అంటేమాటలా? దొరికినా వంటరిగా తిరిగే ఆడదాని విలువెంత ఈ సంఘంలో? పోనీ ఎవరన్నా అందం చూసి మోహించి పెళ్లి చేసుకున్నా ఏం అనుభవించాలి? ఆ పరి స్థితులు రావు. వచ్చినా ఎందుకో మనస్సు అంగీకరించడం లేదు! ఏదో చేయాలి అనిపిస్తోంది! పరిస్థితుల ప్రోద్బలంవలన ఈ మురికిలో కూరుకుపోతున్నవాళ్లని పైకి తేవాలి! కనీసం అక్కలాంటి పరిస్థితి రాకుండా చేయాలి? అంతే! అయితే దానికేం చేయాలి? పెళ్లి చేసుకొని ఇల్లు, సంసారంలో పడితే ఇవన్నీ చేయ గలనా? ఉద్యోగం చేసుకుంటూ ఉండి పోగలనా? ఉండిపోయినా ఇలా చేయ గలనా? చెయ్యనివ్వరీ మనుషులు! ఈ చేదు అనుభవాల పుట్టలోనుండి తను నేర్చుకొన్నదిదే! మనుషలను చదవడం వచ్చింది! తెలివితక్కువతో, అక్కలాంటి వాళ్ళు మాడి మసైపోతున్నారు. అలా కాకూడదు. నన్ను నేను కాపాడుకుంటే గదా, ఇంకొకరి కోసం ఏదో చెయ్య గల్గుతాను! అందుకు డబ్బు కావాలి! ఈ అనారోగ్యాన్ని ఆమడదూరాన్నుంచే శక్తి కావాలి. అంతే అలాగే చేయాలి! చుట్టూ చూస్తున్న ఈ బతుకులెంత మురికి గుంటలు! పెళ్లి చేసుకుని ఎంత సుఖపడు తున్నారీ మనుషులు? సమస్యలు, దెబ్బ లాటలు,మనిషిని మనిషి గౌరవించుకోలేని క్రూరత్వము! డబ్బున్నవాళ్ళకే అసుఖం కూడా ఉంటుందేమో? భర్త చాటున సాగించే వ్యవహారాలెన్నో...వాళ్లు చేస్తు న్నది వ్యభిచారము కాదా? పిల్లల్ని కని వాళ్ల కోసం ఏం చేస్తున్నారు? ప్రేమ, అభి మానము చచ్చిపోయి గానుగెద్దుల్లా బతుకుతూ...అబ్బ అదీ ఓ జీవితమే...

ఆలోచనలు... పని చేస్తున్నా ఆలోచనలే! రోజులు గడుస్తున్న కొలది నాలో ఏదో మార్పు! ఏదో చేయాలని తపన! అక్క పడే బాధ చూడలేనపుడు అంతా మనసులో చెలరేగే ప్రభంజనాలు.

వ్యభిచారుల జీవితంతో ఆటలాడుకొనే మగవాళ్ళ నందరిని పిచ్చి కుక్కల్లా తరిమి తరిమి కొట్టాలనే కసి. చుట్టూ తిప్పుకొని, చిటికెన వేళ్ళతో ఆడించాలనే ద్వేషంతో రగిలి పోతుండేది మనసు. పుస్తకాలు మూల పడేశాను! చదువు లేదు. వాళ్ళింట్లో పని చేయడము, ఉన్నది ఇద్దరం సర్దు కొని తినడం, మందులు కొనడము. అక్క బాధకు ఉపశమనము కలగించ లేని మందులు, నా మనసును చిత్రవధ చేసే పరిస్థితులు! నా మనసులో మహా రణ్యాలు తగలబడిపోతున్న ఆలోచ నల మంటలు. ఓ రోజు అక్క శాశ్వతంగా నాకు దూరమైపోయే రోజున బాధతో చుట్టుకుపోతుంటే రిక్షాలో హాస్పిటల్‌కి తీసుకు వెళ్లాను! అక్కవైపు ఈసడింపుగా, అసహ్యంగా చూసిన చూపు నా మీద పడేసరికి ఆకలిగా, కొంటెగా మారిపోయే చూపులు విదలించక అక్కకోసం బతిమాలాను. మందులు, ఇంజక్షన్స్ ఎక్కడ తేను? జీతం అంతా ముందే వాడేసుకొన్న నేను ఏ మొహము పెట్టుకొని అడగను? పద్మ ఊళ్ళో లేదు. అక్కను అక్కడే వదిలేసి వచ్చేశాను. అభిమానము చంపుకొని అడి గాను! నోరు విడిచి డబ్బు ఎపుడయితే అడిగానో ఆక్షణము నేను వాళ్ళ చేతుల్లో చిక్కిపోయాను. నా బలహీనత తెలిసి పోయింది. నా నిర్లక్ష్యం, నిర్భయత్వం, నేనంటే ఉండే భయము ఆ క్షణంలో అంతా పోయింది.

'ఏమిస్తావ్?' అనేవాళ్లే! నాలో రగిలే జ్వాలలు నన్ను వాళ్ళని దహించే టట్లున్నాయి. నాకు తెలిసిపోయింది. ఇన్నాళ్లు అందరి కళ్లు కప్పుతూ తనను తాను రక్షించుకొంటున్న లేడిపిల్ల పులి గుహలోనే అడుగు పెట్టింది. నేనప్పుడు ఆలోచించలేదు. భయపడలేదు. అన్నా ళ్లుగా నా మనసులో రేగుతున్న ఆలోచ నలకొక రూపం వచ్చినట్లనిపించింది 'ఏదో చెయ్యాలి?' 'ఏం చెయ్యాలి?' అన్న ప్రశ్నలకు సమాధానము దొరి కింది. ఆఖరి ప్రయత్నంగా అరవింద్ దగ్గరకు వెళ్ళాను! ఎన్నాళ్ళ నుండో అతని చూపుల వేటనుండి తప్పించు కొంటున్నాను. ఈరోజు అతని దగ్గరకు నేనే వెళ్లాను. మొదట ఏవేవో కబుర్లు చెప్పాడు. పెళ్ళి చేసుకొంటానన్నాడు. ఆరు సంవత్సరాల నుండి అతని ఇంటి ఎదురుగా వుంటూ, ఆ ఇంట్లో తిరుగు తున్న నన్నే అతను మభ్య పెట్టాలను కున్నాడు. అప్పటికే మనుషుల్ని చద వడంలో పట్టా పుచ్చుకొన్న నేనా లొంగుతాను? అందుకే అప్పటికే నిశ్చ యించుకున్న నా బతుకు బాటలో మొదటి పాంథుడు అరవింద్ అయ్యాడు. నా ధైర్యానికి ఆశ్చర్యపోయాడు. ఆ తరువాత అందరూ...!

'ఆ! ఇది మాత్రం ఆ తల్లి పిల్ల కాదూ!' అనేసారు. ఆ సంఘటన కేవ లము నా ఆలోచనలకు రూపం ఇచ్చి నా ఆశయానికి మొదటి మెట్టు అయ్యింది, కాని నా అక్కను బతి కించుకోలేకపోయింది. చనిపోయిన అక్కను హాస్పిటల్‌కే అంకితం చేసేసి ఏకాకిగా మరలా ఈ ప్రపంచంలో అడుగుపెట్టాను. అక్క చెప్పిన అను భవాలు నాకు మంచి పాఠాలయినాయి. నా ఆశయము నన్ను ధైర్యంగా నిల బెట్టింది. నన్నెంతమందో ప్రలోభపరచి మోసం చేయాలని చూసారు! కాని నా

ధైర్యం నన్ను మోసగింపబడకుండా కాపాడింది.

శీలం దాచుకోవాలనే తాపత్రయం, భయం ఉన్న ఆడదాన్ని మోసం చేస్తుందీ ప్రపంచం! దాన్నే అమ్మాలనుకొన్న నాకేం భయం? నేను అందరిలా ధిలో మొచలు పెట్టి వీధిలో రాలిపోవాలనుకోలేదు. అందుకే ఓ రోజు లాడ్జింగ్‌కి వెళ్ళాను! నన్ను నేను పరిచయం చేసుకొన్నాను. ప్రొప్రయిటర్ ఆశ్చర్యంతో నోరు తెరుచుకొని ఉండిపోయేడు. అతనికి నేను ఎక్స్‌ప్లనేషన్ ఇవ్వదలచుకోలేదు. ఉద్యోగాభ్యర్థిగా వెళ్ళాను. నా అందం, నా వయసు అతన్ని ఆలోచించనివ్వలేదు. నా ధైర్యం అతనికి ధైర్యాన్నిచ్చింది. నాకు ఉద్యోగం దొరికింది. నాకు అందాన్నిచ్చి, కనీసం అట్లాగన్నా నా జీవన గమ్యానికో మార్గాన్నిచ్చిన దేవుడికి కృతజ్ఞతలు తెల్పుకొన్నానా రాత్రి.

ఆ రోజే నేను ఉద్యోగంలో చేరిపోయాను. ఆరోజే నేను స్మితనయ్యాను. పెద్ద అనుభవమున్నదాన్లా, నాకు తెలియకుండానే నాలో దాగిన కసేమో నన్నాడించింది... నటింప చేసింది. ఎన్నో జాగ్రత్తలు చెప్పి పంపాడు మేనేజరు నన్ను గదిలోకి! ఎవరో పెద్ద బిజినెస్ మాగ్నెట్! మేనేజర్ తెప్పించిన దుస్తులు, అలంకరణ నా అందానికి మెరుగులుదిద్ది నేనే ఆశ్చర్యపోయేటట్లు చేసాయ్! ఎన్నో సంవత్సరాలుగా అలవాటున్నదాన్లా ఆ గదిలో అడుగుపెట్టాను. భయం లేదు. భావం లేదు. హృదయం లేదు. కదలిక లేదు! కేవలం మస్తిష్కం ఒక్కటే పని చేస్తోంది. దాని ఆజ్ఞమేరకు జ్ఞానేంద్రియాలన్నీ పని చేస్తున్నాయ్! అంతే! ఆఖరికి అతనికేం ఇవ్వకుండా నన్ను నేను మిగుల్చుకొని ఆ రాత్రి కాపాడుకొన్నాను చాకచక్యంగా! తెలతెలవారుతుండగా నాకిచ్చిన గదిలోకి వచ్చేసాను. మర్నాడు చేటంత మొహంతో మేనేజరు నన్ను వుక్కిరిబిక్కిరి చేసాడు.

'అతనెంత మెచ్చుకొన్నాడో నిన్ను, నీ అందాన్ని! సాధారణంగా అతనికెవరూ నచ్చరు. నీ అదృష్టం, మా అదృష్టం! నీ కోసం మరలా వస్తానన్నాడు. అతనెవరో తెలుసా? తల్చుకొంటే ఈ నిముషంలో నిన్ను తీసుకొని పారిస్ వెళ్ళిపోగలడు!' అంటూ ఆనంద పడిపోతుంటే 'పాపం పిచ్చివాడు!' అని నవ్వుకున్నాను.

* * *

మొదటిరోజే నాకు మంచి పేరు రావడంతో నాలో అహంకారం, ధైర్యం, చొరవ మరింత స్థిరపడ్డాయి! నన్ను నేను ఎలా కాపాడుకోవాలో నేర్చుకున్నాను. అపుడపుడు కొందరికి లొంగిపోయినా మొత్తానికి ఆరోగ్యం పాడయిపోయేటంతగా నేనెవ్వరికీ లొంగలేదు. ఆ తరువాత ఈ ఇల్లు, ఆ సి అన్నీ సంపాదించాను. కొంత డబ్బుచేరే వరకు నాలోని ఆలోచన నిద్రాణంగా వుంది. ఆ తరువాత ప్రయత్నాలు మొదలుపెట్టాను. మీరు చేయూతనిచ్చారు. ప్రయత్నంఫలించింది. నేను కొంతయినా చేయగలిగాననే తృప్తి నాకు కలుగుతోంది!

'మిత్రా! ఇప్పుడు చెప్పండి! ఇపుడయినా మీరుచేసుకోవాలనేఅనుకుంటారు. కానీ... నేను ఎలా అనుకొంటాను? నా దొక్కటే కోర్కె! మన మధ్య పెళ్లి అనే బంధం లేకపోతే మీ మనసులో నా

స్థానం చెరిగిపోతుందా? చెప్పండి! నా చివరి దశలో నన్నాదరించే సహనం మీకు లేదా? మీకు మీ పరిస్థితులు అనుకూలించాలి. అందుకే ఒక కోరిక కోరుతున్నాను! సరస్వతికి మీరంటే ఎంతో ఆరాధన! ఆమె నోరు విప్పి చెప్పకపోయినా నాకు తెలుసు! సరస్వతికి మీ జీవన వనంలో చిన్న చోటివ్వండి! ఆమె ఛాయలో నన్ను సేదదీరనివ్వండి! నా చివరి క్షణాలు మీ సమక్షంలో నిర్మలంగా, ఆనందంగా, మీ చిన్నారుల చెంత జరిగిపోనివ్వండి! నామీద ప్రేమకు ఈ వరాన్ని అనుగ్రహించండి.

అంతే నేను కోరేది. నా కోరిక అసమంజసమైందనుకోను. నన్నే చేసుకొని ఈ సంఘంతో పోరాటాన్ని సాగించాలనుకొన్న మీరు సరస్వతిని చేసుకొని బతకలేరా? నాకెంతో గర్వాన్ని, తృప్తిని కలిగించిన వారవుతారు! ఆలోచించండి. మీవాళ్ళకోసం యింతకు ముందు ఎలా ఆలోచించలేదో నా స్థానంలో సరస్వతిని వుంచి ఆలోచించండి. నాకన్నా చెడ్డది కాదు సరస్వతి. నా స్థానంలో సరస్వతిని వుంచి ఆలోచించండి. ఆమె చల్లని నీడలో మీ బతుకు హాయిగా గడచిపోతుంది. ఆ నమ్మకం నాకుంది..." ఆగింది స్మిత.

"మే ఐ కమిన్ మిస్!" అన్న ఎలీజా గొంతు వాళ్ళను డిస్టర్బ్ చేసింది.

"యస్!" అంటూ సర్దుకొని కూర్చొంది స్మిత.

"మిస్! ఫోన్ వచ్చింది" అంది ఎలీజా!

"వస్తున్నాను!" వెనుకే నడిచింది.

ఆ వెన్నెల్లో రెండు చేతులు తలకింద పెట్టుకొని ఆకాశం వంక చూస్తూంటే స్మిత చెప్పినమాటలు అక్కడ రూపం దాల్చి కళ్ళెదురుగా సినిమా రీలులా కనబడుతుంటే, నిశ్చలంగా ఆ బొమ్మల్ని మనోనేత్రంతో తిలకిస్తూ, ఆ బొమ్మలతో పాటు తానూ చలిస్తున్నా మిత్రా ఆ దృశ్యం చెదరిపోయినా ఈ లోకంలోకి రాలేకపోయాడు. ఆఖర్ని స్మిత అభ్యర్థన అతని మనసుకు పట్టలేదు. అతనికి కనుపిస్తున్నదీ, వినిపిస్తున్నదీ, ఒక్కటే! 'స్మిత తన ఒక్కడికి స్వంతంకాదు ఏనాటికి' అంతే!

"భోజనం చేద్దామా?" స్మిత పలకరించినప్పుడు ఈ లోకంలోకొచ్చిన మిత్రా మౌనంగా ఆమె వెంట మెట్లు దిగి తిన్నగా డ్రాయింగ్ రూమ్‌లో కొచ్చి చెప్పులు తొడుక్కొని మరబొమ్మలా బైటికి నడిచాడు. అతని వాలకం చూస్తున్న స్మిత పరుగున పోయి వీధి గుమ్మం దగ్గిర ఆపింది చెయ్యి పట్టుకుని! నిర్వికారంగా ఆ చేతిని తొలగించి నిశ్చలంగా ముందుకి సాగిపోతున్న ఆ మూర్తి స్మిత కళ్ళకు కనబడకుండా కన్నీటి తెర అడ్డుపడింది.




సరస్వతి, గిరిజ మెట్రిక్ పాసయ్యారు! యాంత్రిక జీవితంలో ఓ భాగంగా మిత్రా ఆలోచనలు తినేస్తు

న్నాయి స్మితను. వాళ్లు పాసయిన రోజు మాత్రం యాంత్రికతను పక్కకు నెట్టి ప్రాణం పోసుకొంది జీవితం. గర్వంతో పొంగిపోతున్న మనసుతో వాళ్ళతో కలసిపోయిందారోజు. ఆరోజే వెళ్ళి మరో యిద్దరమ్మాయిల్ని తీసుకువచ్చి సరస్వతి కప్పచెప్పింది స్మిత.

"సరస్వతీ... యింతకు ముందు భయపడేదాన్ని అసలు ముందు మీకు ఆధారం చూపగలనో లేదోనని! ఈరోజు ధైర్యం వచ్చింది. ఇకెంత మందినన్నా తీసుకు వచ్చి బాగుచెయ్యగలననే ధైర్యం వచ్చింది. అదిగో అందుకే వీళ్ళని తీసుకువచ్చాను. నీరజ, అలివేలు! వీళ్ళని నీ చేతుల్లో పెడుతున్నాను. ఏంచేస్తావో చెయ్యి!" అంది.

'ఇది మీరు పెట్టిన భిక్ష. దాన్ని పంచడానికి నాకేం, నేను చేసేదేముంది? వాళ్ళలో నేనొక్కర్తిని! వెనుక మీరుండగా వీళ్ళేకాదు మరో పదిమంది వచ్చినా భయం లేదు" నవ్వుతూ అని వాళ్ళని లోపలికి తీసుకువెళ్లింది సరస్వతి.

ఒకసారి పెరట్లోకి వెళ్ళి చూసింది. అంతా మొక్కలతో పచ్చగా వుంది. కూరగాయలు వాళ్లు వాడుకోవడమే కాక మనిషిని పెట్టి వీధుల్లో అమ్మిస్తున్నారు. మేనక, మరకతం తీరికవేళల్లో వాణి, సరస్వతి అంతాకలసి అప్పడాలు, వడియాలు చేసి కుర్రవాడి చేత అమ్మిస్తున్నారు. ఆ వ్యాపారం లాభసాటిగానే వుంది. ఆపైన మిషన్, ప్లాస్టిక్ బుట్టల అమ్మకం ఒకటేమిటి — మనిషి చెయ్యాలనుకొంటే చెయ్యలేనిది ఏదీలేదనీ, కాస్త వెనుక సాయం వుంటే ఏ వ్యాపారమన్నా చేసి పొట్ట పోసుకోవచ్చుననీ స్మిత ఆశ్చర్యపోయేటట్లు నిరూపించారు ఇవేవి తను సలహాలిచ్చినవిగావు. ఎంతచక్కగా జీవనోపాధి సమకూర్చుకున్నారు వీళ్లు!

'స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్' అంటే ఇదేనేమో! చిన్న అవకాశమిస్తే చాలు పాతుకుపోగలం అని నిరూపిస్తున్నారు. యింక వాళ్ళగురించి తనేం విచారించ నక్కర్లేదు. తనధ్యేయం నెరవేరినట్లే!

ఒక్క నిమిషమన్నా వృధాచెయ్యడం ఇష్టం లేనట్లు ప్రతివాళ్ళూ ఏదో పనిలో మునిగిపోయి నిశ్చింతగా ఉన్నారు. వాళ్లను చూస్తుంటే స్మిత మనసు ఉత్తుంగ తరంగ మయ్యింది. ఉదయం సాయంత్రం ప్రార్థన, రాత్రి పడుకునే ముందు కాసేపు పురాణ పఠనం, ఆధ్యాత్మిక విషయాలపై పుస్తక పఠనం— స్మితకు చాలా ఆనందం కలిగించింది.

"సరస్వతీ! నేను ఊహించిన దాని కన్నా ఎత్తుకు ఎగిరిపోయారు మీరు! మీ దగ్గర నేను నేర్చుకోవలసింది ఎంతో వుందనిపిస్తోంది. మిమ్మల్ని యిలా చూస్తుంటే నా జీవితం వ్యర్థమేమో నన్న చింత దూరంగా పారిపోతోంది. ఒక్క విషయం సరస్వతీ! మీలో ఎవరికన్నా ఈ జీవితం విసుగు కలిగిస్తోందా? యింకేమన్నా కావాలనిపిస్తోందా? ఆ సంగతి కూడా నాకు తెలియాలి!"

"అంటే!" అంది సరస్వతి ఆశ్చర్యంగా అర్థం కానట్లు! అక్కడ సరస్వతి తప్ప మరెవ్వరు లేరు.

"అంటేనా? అర్థం కాలేదా? నువ్వు వాళ్ళ మనస్సు నర్థంచేసుకుని చెప్తావని నీకు చెప్తున్నాను. ఎవరికన్నా పెళ్ళి చేసుకోవాలని వుందా అని!

నా శాయశక్తులా ప్రయత్నిస్తాను ఎవరి కన్నా వుంటే. 'లేదు' అనుకుంటే గొడవలేదు. ఎందుకంటే ఇక్కడ అన్ని రకాల వయసులవాళ్లున్నారు. ఎవర్నీ నిర్బంధించడం నాకిష్టంలేదు! వాళ్లు మరో తప్పు చేసే అవకాశం యివ్వకూడదు" స్మిత మాటలు తలవంచుకుని వింటోంది సరస్వతి.

"మరకతం, మేనక జీవితంలో బాగా విసిగిపోయారు. వాళ్ళకిదే సుఖంగా ఉంది. పోతే వాణి వయస్సులో చిన్నది. తనకింకా ఆశ చావలేదు. ఇక ఇప్పుడు వచ్చిన వాళ్ళ సంగతి కొన్నాళ్లుపోతేగానీ చెప్పలేనుమరి!" నెమ్మదిగా అంది.

"అందరి సంగతి చెప్పావు. మరి నీ సంగతి వదిలేసావేం!" నవ్వుతూ అంది స్మిత.

"నా సంగతా! నాదేముంది?జీవితంలో పెద్ద దెబ్బతిన్నదాన్ని, నాకేం ఆశలు వుంటాయి? నాకీ పెళ్ళిళ్ళమీదా వాటి మీదా నమ్మకంలేదు! అయినా మాతో బతుకును పంచుకోవాలనుకునే మహాత్ములెవరుంటారు? అందుకే అసలా విషయమే మనస్సులోకి రానివ్వకపోతే గొడవే వుండదు. యిప్పటికీ చేదు అనుభవాలు చాలు. పెళ్లి, భర్త అంటేనే భయం వేస్తోంది. ఈసారి మోసపోతే ఈపాటి నీడ కూడా దొరకదు!"

నిర్వేదంగా అంటున్న సరస్వతి మనసు చదవడానికి ప్రయత్నిస్తూ నిశితముగా చూస్తూ కూర్చుంది స్మిత.

'మిత్రా అంటే నీకిష్టమేనా? అతను చేయి అందిస్తే అందుకోవడానికి ఏమన్నా అభ్యంతరమా?' అని ఆ డగాలన్న ఆత్రుతను గొంతులోనే అణుచుకుంది. ఊహకు ప్రాణం పోస్తే చిత్రం అయి ఆ చిత్రం కనులముందు నిలపగా వింత అనుభూతికి లోనై ఆర్ద్రంగా కళ్లు మూసుకుని తృప్తిగా నిట్టూర్చింది.

"సరే నే వస్తాను! నీరజ వాళ్ళకి చదువుకోవాలని ఉంటే సునీతకు కబురు పెట్టు, మీరేం చెయ్యాలనుకుంటున్నారు? వాణి నువ్వు ఇంటర్ పరీక్షలకు వెళ్తారా?" అని అడిగింది.

"వెళ్ళాలనే వుంది. సునీతగారుకూడా కట్టమంటున్నారు!" అంది సరస్వతి.

"అయితే డబ్బు యిదిగో. కావలసిన పుస్తకాలవీ కొనమని సునీతకివ్వు! మరేమన్నా అవసరమయితే ఈ డబ్బు వాడుకోండి" అయిదు వందలు చేతిలో పెడుతుంటే కృతజ్ఞతగా చూసింది సరస్వతి.

కాసేపు మాట్లాడి బయలుదేరింది స్మిత. అందరూ తృప్తిగా సాగనంపారు.

* * *

తెల్లవారుజామున నిద్రలేమితో డాన్స్ చేసి చేసి అలసిన శరీరంతో తూగుతూ కారుదిగి యింట్లోకి నడిచిన స్మిత ఒక్కసారి మత్తువదిలినదాన్లా అయింది—సోఫాలో మిత్రాను చూసి. జారిపోతున్న 'షాల్'ని సరిగ్గా సర్దుకుంటూ అతని చూపులు తప్పించుకుని వడివడిగా బెడ్‌రూమ్‌లోకి వెళ్లి తలుపు వేసుకుంది. బాధ, కోపం, నిస్సహాయత పొంగుకువస్తున్న మనసును నొక్కిపెట్టి షవర్ తిప్పింది. చల్లని నీళ్లు నెత్తిమీద పడుతుంటే తపనంతా ఆవిరియైపోతున్నట్లు అనిపించింది. మండుతున్న ఎర్ర గన్నేరుల్లాంటి కళ్ళతో, చల్లబడ్డ మనసుతో, అప్పుడే విరిసిన కమలంలా వచ్చింది తల తుడుచుకుంటూ. ఎదురుగా కూర్చొని చూసింది. తన ఆందోళనలో గమనించలేదుగాని ఎర్ర

బడ్డ కళ్ళతో, చెదరిన క్రాపుతో శిలలా కూర్చునున్నాడు మిత్రా! కాఫీ పట్టుకొచ్చిన ఎలీజాను కళ్ళతోనే ప్రశ్నించింది.

"వాళ్ళ ఫాదర్ పోయారట!" నెమ్మదిగా అంది.

ఆ మాటకు ఉలిక్కిపడ్డట్టుచూసాడు. ఆకాశంలాంటి దుఃఖము విరుచుకుపడింది. అప్రయత్నంగా అతని పక్కకు వచ్చి కూర్చుంది.

"స్మితా!" ఆమె ఒడిలో తలపెట్టి బావురుమన్నాడు మిత్రా!

"స్మితా! నన్ను....నన్ను ముట్టుకోవద్దన్నారు. లీలను రానివ్వలేదు! నాన్న నా మీద కోపంతోనే పోయారు. ఆయన దగ్గర క్షమాపణ పొందలేకపోయాను. నన్ను ముట్టుకోవద్దని శాసించి చనిపోయా



రట...స్మితా! నాన్న ఎంత దారుణమైన శిక్ష విధించారో చూసావా? నేనేం తప్పు చేసాను..." ఆవేదన కెరటాల్లాదూకు తోంది కళ్ల అంచులు దాటుకొని. స్మిత చేతులు ఓదారుస్తున్నాయి! కళ్ళు వర్షిస్తు న్నాయ్! ఏం చెప్పుంది? ఈ మనుషుల మూర్ఖత్వాన్ని కొలచే సాధనమేముంది? వాళ్ళకు అతని డబ్బు కావాలి కాని అత నక్కరలేదు! అతను శవాన్ని ముట్టుకో కూడదు. శవానికయ్యే ప్రతిపైస అతని సంపాదనే! ఏమిటిది? చనిపోయిన మనిషి మాటకున్న విలువ బతికివున్న మనిషి మనసుకు లేదా? కాదు, లేకుండా చేసాచు బంధువులనే ఈ మూర్ఖులు. ఏమని ఓదారు స్తుంది తను? మనసులో రగులుతున్న ఆవేదన, కసి, దుఃఖంతో కడిగేసి మనసు నిర్మలంగా చేసుకున్నారు. అతనిలో జ్ఞాని మేల్కొన్నాడు. నిశ్చింతగా లేచి కూర్చున్నాడు. కమల బాంధవుని వేడి కిరణాల తాకిడి వాళ్ళ మనసుల్ని ఆర బెట్టింది. పొడి మనసులతో, తడి కళ్ళతో కాలాన్ని కౌగిలించుకుని కూర్చున్నారు.

ఆ మర్నాటివరకు మిత్రా యింటికి వెళ్ళనేలేదు. స్మిత కంటికి రెప్పలా కాప లాగా వుంది. ఏ అనుబంధమో మూగగా కట్టి పడేసింది. మూడో రోజు డ్యూటీకి వెళ్లిపోయాడు.

ఆ రోజు ఉదయంనుండి ముసురు పట్టింది. వచ్చేపోయే చినుకులు చికాగ్గా వున్నాయి. మబ్బులు మనసుకి ముసురు పట్టినట్లు చీకటిని సృష్టించాలని తాపత్రయ పడుతున్నాయి. స్మితకు ఏ పనీ చేయా లనిలేదు. ఆలోచనలు లేవు. ఆచరణలు లేవు. కేవలం తినడానికి పుట్టినట్లు తిని కూర్చోవడమే. వర్షాన్ని చూస్తూ

కూర్చుంది. రోడ్డంతా నగ్నంగా స్నానం చేస్తోంది. 'నింగినుండి నేలకు చేరి మట్టిలో కలసిపోతున్న వర్షబిందువు ఆయువెంత? ఆ బిందువులన్నీ కలిసి ఏరులు, సెల యేరులు, నదులు అయి చివరకు కలిసే సముద్రుడు ఎక్కడ నుండి ఉద్భ వించాడు? లిటిల్ డ్రాప్స్ ఆఫ్ వాటర్ మేక్ ఏన్ ఓషన్! చిన్న చిన్న సంఘట నలు కలిసి జీవితం ఏర్పడింది. సముద్ర మంత గంభీరమైన జీవితము లోతెంత?' ఆలోచనలు కావవి. ఏవో నిజాలు, ఎన్నెన్నో స్మృతుల చిహ్నాలు.

'నిశ్శబ్దాన్ని చీల్చేశక్తి ధ్వనికుంటే, మనసుని చీల్చేశక్తి మాటకి. మనిషివ్యక్తి త్వాన్ని, అస్థిత్వాన్ని పట్టిఇచ్చేమాటలు.. ఎన్నోమాటలు – తీయనివి, చేదువి.... గుర్తుంచుకోవలసిన మాటలు, గతాన్ని గురుకుతెచ్చే మాటలు...' అంతలో ఫోను ఆలోచనల వలయాన్ని ఛేదించుకొని మూగవోయిన వీణను శృతి చేస్తున్నట్లు, నాడులను శృతిచేసి దగ్గరకు రప్పించు కొంది.

"హల్లో!" పలకరింపులో స్తబ్ధత.

"హల్లో...ప్రొప్రయిటర్ నాగార్జున్ హియర్! స్మితా! నువ్వేనా మాట్లాడు తున్నది. ఆహఁ...సరే! అయితే రాత్రికి నీ డాన్స్ ప్రోగ్రామ్ ఏర్పాటు చేసాను. తరువాత 'గెస్ట్‌హౌస్'కి వెళ్ళాలి. రాగలవా? వేరే ఎంగేజ్‌మెంట్ లేకపోతే చెప్పు! నీకు వీల్లేదంటే ఇంకెవరికన్నా చెప్పాలి"

జీవనోపాధి ఇచ్చే మెమొరాండం. దాన్ని కాదనేశక్తిలేని అర్భకత్వం. మన సుని చంపే డబ్బు, కళ్ళముందు కదిలే నోట్లు...!

ఈ వర్షంలో మనస్సంతా శాంతిని వెతుక్కొంటూ, ఏ హిమాలయాలమీదకో వెళ్ళిపోయి మంచుపూవయి పూయాలను కొంటున్న వేళ...కోర్కెల మంటలకు సమిధగా మారాలని ఆహ్వానం! హు! జీవితపు పంజరంలోని బంధి...తప్పదు. వెళ్లాలి...! నిరాశ, నిస్పృహలు నిలువునా చుట్టి ఊపిరాడనీయక ఉక్కిరి బిక్కిరి చేస్తూనే మాట రానివ్వడంలేదు.'

"మాట్లాడవేం స్మితా! ఆలోచిస్తు న్నావా? నువ్వయితే బాగుంటుందని చెప్పాను. తప్పక వస్తావుగా!" 'అవు నని'పించడానికి విసుగుతో కూడిన ప్రయత్నం అటునుండి. అలవాటయిన జవాబునిర్లిప్తంగా...!

"ఏడుగంటలకు రెడీగా ఉండు. కారు పంపిసాను!" విజేత శాసనం.

రిసీవర్ నిర్జీవంగా క్రెడిల్ మీదకు, స్మిత సోఫామీదకు. వరుణుడికి సూర్య భగవానునితో జరిగిన పోటీలో లభించిన విజయానికి సూచనగా మేఘమాలికలు తివాసీలా ఆకాశమంతా పరచుకొన్నాయి. అలసిన దినకరుని గుర్రాలు కొండల చాటుకి పరుగెత్తాయి. హుషారెక్కిన వాన దేవుడు ఉరుములు, మెరుపులతో పండుగ చేసుకొంటున్నాడు. కాలం తెలియని కారు చీకటి! తెలుస్తున్నదొకటే...చుట్టూ మూగుతున్న చీకటి. విద్యుత్ కాంతి మెరుపుకన్నెతో పోటీకోసం వెళ్లిపోయి నట్లుంది. మనిషి జీవితంలా రెపరెపలాడు తున్న కొవ్వొత్తుల వెలుగులో, మన్ను తిన్నపాములా బద్ధకంగా కారుకోసం ఎదురుచూస్తూ కూర్చుంది స్మిత.

తలుపు మీద చప్పుడయితే లేని హుషారు తెచ్చుకోవాలనే విఫల యత్నంలో ఉండగానే, తలుపు తీసింది

 

ఎలీజా. కురుస్తున్న మేఘంలా మిత్రా! తలుపుతీసినందుకు శిక్షగా కొవ్వొత్తి కాంతి గాలిలో కలిసిపోయింది. ఆ మూల నున్న కొవ్వొత్తి నుండి వస్తున్న కాంతి కిరణాలు ఇంతదూరం ప్రయాణం లేనట్లు మధ్యలోనే ఆగిపోతున్నాయి. నిశ్చలంగా కూర్చుని చూస్తున్నస్మిత ఎదురుగా వణు కుతూ నిలబడ్డ మిత్రాను, ఎలీజా ఇచ్చిన పెద్ద టవల్ కాపాడింది. స్మిత చూస్తూనే ఉంది. సొంత ఇంటికివచ్చిన గృహస్తు తువ్వాలు కట్టుకొని ఎదురుగా ఎలీజా ఇచ్చిన వేడి వేడి టీ తాగుతూ వేడిని పుంజు కోవాలని ఉత్సాహపడుతున్న మిత్రా! ఎలీజా వెలిగించి తెచ్చిన కొవ్వొత్తి కొత్త వెలుగు తెచ్చింది. ఒక్కసారిగా తెలివి వచ్చినదాన్లా ఫోను దగ్గరకు వెళ్లింది స్మిత. ఆశ్చర్యంగా చూసాడతను.

"సారీ! నేను రావడం అవదు. ఇంకె వరినన్నా ఎంగేజ్ చేసుకొండి!" అతను వినకూడదన్న తాపత్రయం గొంతులో.

"ఇపుడిలా అంటే ఎలా? ఎవ రొస్తారు?" అటునుండి విసుగు, అధి కారం మిళితమైన స్వరం.

"సారీ అని చెప్పానుగా! ఎంతిచ్చినా సరే రాలేను!" కోపం, నిస్సహాయత! ఫోన్ పెట్టేసి వచ్చి కూర్చుంది. సందర్భం అర్థమయిన అతని మొహం రక్తం గూడు కట్టుకొన్నట్లు నల్లబడింది.

"ఏమిటిలా వచ్చేశారు?" ప్రయత్న లోపంలేని పలకరింపు.

"రావాలనిపించింది ... వచ్చేశాను! ఇంకెక్కడికి వెళ్లను?" 'ఇదే నా ఇల్లు' అన్నంత ధీమా అతని జవాబులో!

మళ్ళీ ఆశ-నిరాశ, ఆరాధన-ఆదర్శం, కలలు — నిజాల మధ్య సంఘర్షణ! జీవితంతో పోరాటం ... సంఘర్షణ.

"స్మితా! నేను ట్రాన్స్ఫర్‌కి పెట్టు కొన్నాను. దూరంగా రాష్ట్రం మారు మూలకు వెళ్ళిపోదామని! అక్కడ ఎవరికీ తెలియని ఏకాంతంలో జీవితాన్ని పండించుకొందామని పెట్టుకొన్నాను. ఆర్డర్స్ వస్తాయి. స్మితా! నీ ఇంట్లోకి నిరాటంకంగా వచ్చే స్వేచ్ఛనివ్వు!" అభ్యర్థన. అదే గొంతు, అవే మాటలు, అదే ఆరాధన.

దాదాపు నెలరోజుల తరువాత కలయిక లోని నిశ్చలత.

'ఏం మనిషి? ఇంత చెప్పినా అర్థం చేసుకోలేనంత వెర్రి ప్రేమలో కొట్టు కొంటున్నాడా? ఏమో? తను బయట పడింది. ఈ ప్రవాహం నుండి అతన్ని ఒడ్డుకు లాగే బాధ్యత తన మీద ఉంది!' వివేకం చేస్తున్న యోచన.

"మిత్రా! నా గతం అంతా మీ ప్రేమ వాహినిలో కొట్టుకుపోయింది. పోతుందని తెలుసు. మీ వాళ్ళకు దూరమయిన మనసు తెగిస్తుందని తెలుసు. అన్ని బంధాలు తెంచుకొని కేవలం డబ్బు అనే వంతెనతో కన్నవాళ్ళను కలుపుకొంటూ దూరంగా పోతున్న మీరు, అక్కడ కొత్త బంధాలల్లుకొని, బందీలయి సేద దీరాలని మీ మనసుపడే ఆరాటం తెలుసు! కానీ... కానీ... మిత్రా! ఐ కాంట్ హెల్ప్ ఇట్! మీ మీద నాకు, నా మీద మీకు శారీరక వాంఛ లేనపుడు నన్నెం దుకు స్వంతం చేసుకోవాలనుకొంటు న్నారు? నాకు తెలుసు, నా భవిష్యత్తును గూర్చిన భయం మీకు బంధం వేస్తోంది. నావాడిగా నిలబడి నన్నుద్ధరించమని ఘోషిస్తోంది. అవునా? మిత్రా! ఇంతకు ముందు చెప్పానే..అలా మీ భార్యగా, మీ

పిల్లలకు తల్లిగా, బంధాలలో ఇరుక్కుని సామాన్య గృహిణిలా చచ్చిపోవాలని లేదు నాకు. మీ గుండెనిండా నిండిన ఆరాధన, మీ భార్య ఆదరణ, మీ పిల్లల అభిమానాల మధ్య నిశ్చింతగా కళ్లు మూయాలని ఉంది. ప్రేమ పెళ్లికి భిన్నమైనది. మిత్రా! మీరు పెళ్ళి చేసుకోండి. జీవితాన్ని పరిపూర్ణం చేసుకోండి. నా కోసం మీ గుండెలో కాస్త చోటుంచండి, అంతేచాలు. అడవికి పోయి తపస్సుచేసి పరమాత్మ దర్శనం పొందేవాడికన్నా, సంసార సాగరంలో ఈదుతూ భగవ ధ్యానం చేసి ఆత్మార్పణ చేసేవాడు గొప్పవాడట! అలా మీరు మీ ఇల్లు, మీ సంసారంలో పడి...నా గురించిన చిన్న జ్ఞాపకం చాలు నన్ను దేవతను చేస్తుంది! మిత్రా...మన ప్రేమ నిస్వార్థము, అమరము. అట్లా అన్నానని మీరు జీవితాంతం బ్రహ్మచారిగా ఉండిపోతానంటే, మీలో స్వార్థం నా ప్రేమను చంపేస్తుంది. మీ దగ్గర నిస్సంకోచంగా, నిర్భయంగా చివరి క్షణాలు గడిపే అవకాశం ఇవ్వండి. నా కోర్కె నెరవేర్చండి. సరస్వతి గురించి ఇంతకు ముందు చెప్పాను. మరల, మరల నా స్వార్థం నా చేత అడిగిస్తోంది! ఓ సంస్కరణ తల పెట్టాము. దాని ఆచరణ మనతోనే మొదలవ్వనివ్వండి. నన్ను చేసుకోవాలనుకొన్న మీ మనసులో సరస్వతి కింత స్థానముండకపోదు. మీరు ఎట్లాగూ పెళ్ళి చేసుకొని స్థిరపడాలని నా వాంఛ. ఆ పెళ్లి అనే బంధం సరస్వతితో పడితే అన్ని విధాల బాగుంటుంది. మన ఆశయ సాధనకో 'చరిత్ర' ఉంటుంది.



నా గుండెల్లో, నా ఊపిరిలో, నా అణువణువున మీపై నిండిన ప్రేమ నన్ను జీవింపచేస్తుంది. ఇంకా ఇంకా సరస్వతులను, వాణిలను తయారు చేస్తాను. నన్ను ఆశీర్వదించండి" అంటూ ఇంకేమీ మాట్లాడలేనట్లు అతని కాళ్ల దగ్గర కూలబడిపోయింది. పైన కురుస్తున్న వర్షం స్మిత కన్నుల్లో చోటు చేసుకుంది.

డోలాయమానసంగా ఉన్న అతనికిప్పుడీ మాటలు స్థిరత్వాన్నిచ్చాయి. అతను ఎదురు చూస్తున్న జవాబే ఇది. నిర్లిప్తత ముసుగులో ముడుచుకొన్న మనసును చేరని జవాబు. ఆ రాత్రంతా ఆలోచన.

అందరాని చందమామ స్మిత చూపిస్తున్న వెన్నెల వెలుగులో బతుకు బాట వెంట గమ్యం చేరడానికి పయనించడమే... తప్పదు. చందమామ పంచే వెన్నెలనాస్వాదించాలిగాని, చందమామనే కోరుకోవడం అవివేకం! అంతే, అంతే! ఎన్నో ఎదురు దెబ్బలు, నిరాశల్లో ఇది ఒకటి. కాలమే తీర్పు చెప్పే భాష్యం తెలియని బంధం వేసుకోవాలి. తప్పదు, స్మితకోసం తప్పదు. ఆమె భవిష్యత్తులోని ఏ చివరి క్షణాలు తనలో భయాన్ని రేకెత్తించాయో, ఆ చివరి క్షణాలు తన దగ్గర నిస్సంకోచంగా గడపాలంటే తప్పదు. కానీ... మనసు? మనసా, వాచా ఆమె తోడిదే లోకం అనుకొంటున్న తను ఎవరి కన్నా ఏమివ్వగలడు?ఇచ్చేటట్లు చేస్తుందా కాలం? ఏమో? ఆమె తన ఆరాధ్య దైవం. ఆమె శాసించినట్లు చెయ్యక తప్పదు. అంతే అంతే!

* * *

మరునాడు అతను చెప్పిన జవాబు ఆమెకు ఎనలేని తృప్తిని, ఆనందాన్ని కలిగించింది. అతను వెళ్లిన వెంటనే

హోమ్‌కి పరుగున వెళ్లింది వార్తను చెప్పి మురిపిద్దామని.

షాక్ తిన్నట్లు చూసింది సరస్వతి ఈ వార్తవినగానే. ఆమె గుండెలో కోటి వీణలు మోగుతున్నాయి. మొదటిసారి స్మిత వెనుకనున్న అతన్ని బాదంకాయల్లాంటి కళ్ళతో భక్తి పురస్సరంగా చూసింది. ఆ భక్తి భావమే ఆరోప్రాణం అయిందన్న సంగతి స్మిత చెప్పే వరకూ గుర్తించనేలేదు. ఏ మూలో చిన్నగా ఒలుకు అపశృతి! స్మిత 'నిజం' చెప్పింది. అతన్ని ప్రేమిస్తున్న నిజం చెప్పింది. సరస్వతి వంచిన తల ఎత్త లేదు.

"అభ్యంతరమా? అనుమానమా?" అడిగింది స్మిత.

చప్పున కాళ్ళ మీద పడిపోయింది సరస్వతి జవాబుగా. సరస్వతిలో సందేహాలు రేకెత్తించి నివారించింది, ప్రశ్నలు కల్పించి జవాబులు చెప్పింది, భయం కల్గించి ధైర్యం చెప్పింది. మనసుని మాలిన్యం పోయేలా కడిగి కడిగి సానబట్టి వజ్రంగా చేసింది. సరస్వతి కన్నుల్లో తడియారని కృతజ్ఞత, ఆనందం చూసి స్మిత నిశ్చింతగా ఇంటికి చేరుకొంది.

* * *

సరస్వతిని జీవితంలోకి ఆహ్వానించడం ద్వారా అయినవాళ్ళకు పూర్తిగా దూరమైన మిత్రా, భారమైన మనసుతో బయలుదేరాడు కొత్త అనుభూతులు వెతుక్కుంటూ. స్టేషన్‌కి వచ్చిన తమ్ముడికి కుటుంబ బాధ్యత అప్పచెప్తూ డబ్బు పంపిస్తానని చెప్పాడు. అతను కాదనలేదు.

"నేను పోయాననుకోండి. లీలతో పాటు నన్నూ మరిచిపోండి" దుఃఖాన్ని అదిమి పెడుతూ అంటే మాట్లాడలేదు తమ్ముడు. నైరాశ్యం పేరుకొన్న మనసు బరువెక్కితే, ఆ భారాన్నంతా స్మిత చిరునవ్వుతో తుడిచేసి ధైర్యంగా సాగనంపింది కొత్త జంటను.

* * *

మళ్ళీ మామూలు జీవితమే... ఫోన్ కాల్స్, డాన్స్ ప్రోగ్రామ్స్, నైట్ షిఫ్టులు, డబ్బు ... మహిళా విహార్‌కి కొత్త అమ్మాయిలు, కొత్త ఖర్చులు, కొత్త ఆశయాలు, ఆశలు, సునీత స్నేహం, మధ్య మధ్య సంఘం చేసే సవాళ్లు, వాటికి జవాబులు...

అంతా మామూలుగా యాంత్రికంగా సాగిపోతోంది. అపుడపుడు సరస్వతి దగ్గర నుండి వచ్చే ఉత్తరాలు అందు కొన్న క్షణాలు–జీవం నింపే క్షణాలు.

వాణి నర్స్ ట్రెయినింగ్‌కి వెళ్ళింది. ఇంటర్ పాసయిన అలివేలు బి.ఏ.కి కడుతోంది. నీరజ సరస్వతి బాధ్యత తీసుకొని, కొత్తగా తెరచిన 'బేబి సిట్టింగ్' బ్రాంచ్ చూస్తోంది. ఇదంతా చూస్తుంటే స్వప్నావిష్టంగా ఉంది స్మితకు. అనుకోని విధంగా జరిగిపోతోంది. స్మితకు అలసట లేదు, వయసులేదు. 'ఆదర్శం ఖరీదు ఆమె ప్రాణం' అన్నట్లుగా కొత్త ఉత్సాహంతో కరిగిపోతున్న కాలం... ఒక్క క్షణం ఆగింది. సరస్వతి ఉత్తరం ఆపింది. తల్లి కాబోతున్నానని సరస్వతి రాసిన సారాంశం ఆపింది! ఆనందంతో ఊపిరి తీసుకోవడం మరచిన స్మిత తేలిగ్గా నిశ్వసించింది మంత్రముగ్ధలా! జ్ఞాపకాలు రేగాయి. ఆగలేకపోయింది.

'వస్తున్నానని' స్మిత ఇచ్చిన

పెళ్ళిగ్రాం చూసిన సరస్వతి హృదయ సరసిలో నవనవోన్మేష కమలాలు విచ్చుకొన్నాయి. మిత్రా మగవాడు, నిండు కుండ, నిండిన అమృత భాండం తొణకలేదు.

* * *

ఆతృతగా ట్రెయిన్ దిగిన స్మిత కళ్ళల్లో మెరుపులు మెరిసాయి. తృప్తిగా, నిండుగా గంగయమునల అడుగున గంభీరంగా త్రివేణి సంగమములో కలిసే సరస్వతీ నదిలా... సరస్వతి. త్రివేణిని తనలో కలుపుకొన్న సాగరునిలా మిత్రా!

ఇల్లు చేరుకొన్నారు. పర్ణశాల... ఊరికి దూరంగా, నిర్మలంగా కొండల గొడుగు కింద పచ్చని పచ్చికలా పచ్చగా, కళకళ్ళాడుతున్న ఇల్లు. ఇంటి ముందు పూల మొక్కలు, ఎన్నెన్నో పూలు, పేరు తెలియని గడ్డి పూలు, పూజకు పనికిరానివని వదిలివేసే పువ్వులు. మిత్రాకు అవే ఇష్టం. అందుకే లోయల్లో, కొండచరియల్లో, రోడ్డు అంచుల్లో నిర్వికారంగా పూసి నిర్దయగా రాలిపోయే ఆ పూల చెట్లను తెచ్చి నాటాడు. అవి తల లూపుతూ ఆనందంగా ఆహ్వానించాయి స్మితను.

సరస్వతి కన్నుల కదలికలో, గర్వపు ఛాయలు పుప్పొడి రేణువుల్లా మెరుస్తూండగా చెప్తుంటే, తీయని రవళికి తలవంచిన ప్రకృతిలా వింటోంది స్మిత. పొద్దుపోయేవరకూ ఇద్దరాడవాళ్ళ మధ్య ఎన్ని కబుర్లో, ఎన్ని కథలో!

ఆ కబుర్లు, కథల్లోని రాకుమారుడు, మహార్ణవంలో కరిగిపోతున్న తరంగంలా ఆలోచనలమధ్య కరిగిపోతున్నాడు. ప్రశాంతంగా ఇంటికి వచ్చిన అతని మనసును పన్నీటిజల్లులా తాకిన నవ్వులు. ఆ తరువాత అంతా ఆనందమే!

* * *

సుప్రభాత సమయాన స్మిత లేచే వేళకే ప్రత్యూషపవనంలా ఆమెకోసం వచ్చిన సరస్వతి. నుదుట పూజ చేసినందుకు గుర్తుగా బొట్టు కింద చిన్న కుంకుమ బొట్టు, జారుసిగలోనుండి తొంగి చూస్తున్న పూలు. నిండుగా పూసిన పొన్నచెట్టులా కాఫీ కప్పుతో ఎదురుగా నిల్చుంది సరస్వతి!

కాలకృత్యాలు ముగించుకుని, పూజ చేద్దామనే తలపుతో మొదటిసారిగా పూజ గదిలో అడుగు పెట్టింది స్మిత. పూజ పీఠం మీద ఇష్టదైవం ఫొటోముందు పెద్ద పెద్ద ఎర్ర తామరలు, ముందున్న గడ్డిపూలు. ఒక్కక్షణం ఆశ్చర్యపోయింది స్మిత.

"సరస్వతీ! దొడ్డిలో అన్ని మందారాలు, నందివర్ధనాలు, అడవిమల్లెలు ఉండగా ఈ గడ్డిపూలతో పూజ చేసావేమిటి?" గదిలోనుండి రాగానే అడిగింది ఆశ్చర్యంగా!

"అదా! ఆయన ఆ పూలతోనే పూజ చేయమంటారు. పూజకు పనికిరాని పూలు అసలు లేవంటారు. ఆ పూలల్లో ఆయనకు, నాకు కనిపించేది నీ రూపమే!" ఆర్ద్రంగా అంది సరస్వతి.

మిత్రా గదిలోకొచ్చి చూసింది. అక్కడ టేబిల్ మీద ఫ్రేమ్‌లో బంధించిన స్మిత ఫొటో, దాని ముందు అపుడే విరిసిన కమలం.

"ఆ పూవు ఆయన రోజూ స్వయంగా కోసుకొచ్చి పెడతారు" తదేకంగా అదే చూస్తున్న స్మితనుద్దేశించి గర్వంగా చెప్పింది సరస్వతి.

ఆశ్చర్యం, ఆనందం మరెన్నో




భావాల సంచలనం ఒక్కసారి తెరలా కప్పివేసి ఉక్కిరి బిక్కిరి చేసింది స్మితను. మాటలకందని భావాలు కన్నుల్లో కదిలాయి. తృప్తిగా నిశ్వసించింది.

"చాలు సరస్వతీ! నేను కోరుకొన్నది సాధించాను. ఇంక నిశ్చింతగా వెళ్లిపోతాను. నీ దగ్గర చోటు ఉందో లేదోనని వెతుక్కొంటూ వచ్చాను. నేను కోరుకున్నదానికన్నా ఎక్కువే ఉందని తెలిసిన నా మనసును పట్టలేకపోతున్నాను. ఇంక నాకేం బెంగలేదు సరస్వతీ! నిశ్చింతగా నీ దగ్గరకొస్తాను" ఆమె కౌగిలిలో ఒదిగి ఉన్న సరస్వతికి ఆ మాటలు వింటూంటే కన్నీళ్లు జలజలా రాలాయి పూజా పుష్పాల్లా.

* * *

మర్నాడే ప్రయాణమౌతున్న స్మితను సరస్వతి మాటలతోనూ, మిత్రా చూపులతోనూ అభ్యర్థించారు ఆగమని.

మనసునిండా పొంగుతున్న ఆనందం అభ్యర్థనను తోసిపుచ్చింది. ఒక్క మాటన్నా మాట్లాడని మిత్రా మనసు చెప్పే కబుర్లు కళ్ళద్వారా వింటూనే వుంది స్మిత. సరస్వతి, స్మిత ఒక రిక్షాలో స్టేషన్‌కి చేరుకున్నారు. వెనగ్గా ఒగరుస్తూ వచ్చిన మిత్రా చేతుల్లో ఎరుపు, తెలుపు కలువపూవుల గుత్తి. పొడవైన కాడల్లోనుండి కారుతున్న నీళ్ళు అతని షర్టుని తడిపేస్తున్నాయి. అయినా ఆ ధ్యాసేలేకుండా తదేకంగా తననే చూస్తున్న స్మితకు అందించాడా గుత్తిని.

అందుకొని గుండెలకు హత్తుకొందా గుత్తిని. నీటి బిందువుల స్పర్శకు ఒళ్ళు జలదరించింది. ఏకాగ్రతగా వాటి వంకే చూస్తూ చెంపకు దగ్గరగా పెట్టుకొని ఆ స్పర్శానుభూతిని పొందింది. పదిలంగా అవి పట్టుకొని ట్రైన్ ఎక్కింది. మరుక్షణంలో ఎనౌన్స్‌మెంటు వినబడింది. మూగగా ఒకర్నొకరు చూస్తూండిపోయారు—మాటలే కరువైనట్లు.

పవిత్రమైన ప్రేమ, శారీరకంగా ఏ కాంక్షలేని ప్రేమ ఎప్పుడూ త్యాగాన్నే కోరుతుంది. ఇద్దరి మనసుల్లోని భావాలు కళ్ళల్లో వేయి జ్యోత్స్నలై ప్రకాశించాయి. ఇదేమీ గమనించని సరస్వతి తన పుట్టబోయే పాప గురించి తీయని కలలు కంటూ ఏదో లోకంలో వుంది.

స్మిత కళ్లు తడితో మెరుస్తున్నాయి.

"సరస్వతీ, జాగ్రత్త! డెలివరీ ముందు అక్కడికే వచ్చేయ్! హోమ్‌లో వుంచి పండంటి పాపాయితో పంపిస్తాను!" ఆ మౌనాన్ని ఛేదిస్తూ మామూలు మనిషవుతూ అంది స్మిత సరదాగా!

'అలాగే!' నన్నట్లు తలూపుతూ జారడానికి సిద్ధంగావున్న కన్నీరు కనబడకూడదన్నట్లు తలవంచుకొంది సరస్వతి.

ట్రైను కదిలింది. కనిపించినంత మేర చేతులు ఊపుతూనే వున్నారు ప్రతిగా.

కనుమరుగవగానే ఆ కలువలను చెంపకు చేర్చుకొంది స్మిత! వాటిల్లో ఏదో అమరసందేశం వినపడింది. మిత్రా హృదయం కనబడింది. ఫలితంగా మూసిన కనురెప్పలను దాటుకుంటూ రెండు నీటిబొట్లు జారి పూరేకులమీద పడి ముత్యాల్లా మెరవసాగాయి.

ట్రైన్ సాగిపోతోంది తన గమ్యం చేరడానికి. 

# మీరైతే ఏం చేస్తారు?



ఈ ఇంట్లో విష్ణుమూర్తి, లక్ష్మి-ఆ ఇంట్లో ఈశ్వరరావు, పార్వతి.... వీళ్ళకో ఇద్దరు పిల్లలు, వాళ్ళకో ఇద్దరు.

ప్రతి విషయానికి ఒకరి కంటే ఒకరు గొప్పగా వుండాలని పోటీ పడతారు.

విష్ణుమూర్తి, ఈశ్వరరావులకు భేదాభిప్రాయాలు లేవు. కాని వారి వారి భార్యామణుల్ని అనుసరించి దర్జాగా నడుస్తున్నారంతే. పెద్దవాళ్లు ఎలావున్నా పిల్లలు మాత్రం కలిసే వుంటారు.

అలా ఉంటూ ఉండంగా ఉండంగా ఓ రోజున విష్ణుమూర్తి దిగులుగా మొహం వేసుకుని ఈశ్వరరావు గుమ్మం తొక్కాడు. ఈశ్వరరావు, పార్వతి ఆశ్చర్యపోయారు—ఎప్పుడూ రాని మనిషి మన ఇంటికి వచ్చాడేవిటా అని.

"రండి, రండి" అంటూ ఆహ్వానించారు. "కూర్చోండి" అని కుర్చీ చూపించారు.

విష్ణుమూర్తి కూర్చున్నాడు. ఈశ్వరరావుకు ఆ తరువాత ఏం అనాలో అర్థం కాలేదు. రెండు నిముషాలు గడిచాయి. "కాఫీ పట్టుకొస్తానుండండి" అంటూ కదిలింది పార్వతి 'తన గుమ్మంలోకి అడుగు పెట్టారు పక్కింటి వాళ్లు. తమతో ఏదో పెద్ద అవసరమే వుంటుంది' అనుకొంటూ!

"ఇప్పుడేం వద్దండి అక్కయ్యగారూ!"

ఆ పిలుపుకు ఇద్దరు మరోసారి మరింత ఆశ్చర్యపోయారు. "ఏమైనా డబ్బు అవసరం వచ్చిందా?" అడిగాడు ఈశ్వరరావు.

"ఫరవాలేదు. మొహమాట పడకండి" అన్నాడు.

"చెబుతాను అసలు విషయం. ఇలాంటిది చాలా రహస్యంగా వుండాలి. బయటకు పొక్కితే పరువు మర్యాదలు మంట కలుస్తాయి" అన్నాడు విష్ణుమూర్తి.

పార్వతి, ఈశ్వరరావుల ఆతృత పెరిగింది. "చెప్పండి, ఆలోచన దేనికి" అన్నారిద్దరు.

"చూడండి ఈశ్వరరావుగారూ! కొన్ని కొన్ని మన చేతుల్లో వుండవండి. ఆ భగవంతుడు అలా రాసిపారేస్తాడు. మనం నిమిత్తమాత్రులం."

"అంతేలెండి! ఇంతకూ ఏమిటి చెప్పేది..."






"చెబుతున్నాను. ఇదంతా ఎందుకంటే విషయం రహస్యంగా వుంచండి అక్కయ్యగారూ!"

"అలాగే. మీరంతగా చెప్పాలా"

"అమ్మాయి రాజ్యంలేదూ..."

"రాజ్యలక్ష్మి... ఏమిటట!"

"నెల తప్పిందండి" తల కిందకు వాల్చేశాడు విష్ణుమూర్తి.

"అయ్యో అదేం పొయ్యేకాలం పిల్లలకు!" పార్వతి బుగ్గలు నొక్కుకుంది.

"ఎవరండి అబ్బాయి?" అన్నాడు ఈశ్వర్రావు ఆతృతగా.

"చెబుతున్నాను. ఇలా జరుగుతుందనుకోలేదండి మా అమ్మాయి చెప్పే వరకు. మీ శేఖరం లేదూ..."

"ఉంటే!?"

"అదే ఇద్దరూ ప్రేమించుకున్నారటండి"

పార్వతి, ఈశ్వర్రావు వులిక్కిపడ్డారు. మొహాలు గంభీరంగా మార్చేశారు. "ఇదా విషయం, చాల్లెండి" అంది పార్వతి కోపంగా.

"మొదట్లో నేనూ నమ్మలేదమ్మా! తర్వాత నమ్మక తప్పింది కాదు. ఈ విషయం బయటకు పొక్కకుండానే మనంమనం..."

"మా అబ్బాయి అటువంటివాడు కాడు" అరిచినట్లు అంది పార్వతి.

"మీ అబ్బాయి ఒప్పుకున్నాడు"

"అసలు మీ అమ్మాయి బుద్ధి మంచిదయితే ఇలా జరగదు"

"మీ అబ్బాయిది కూడా అంతే గదండి!"

"ఇంకా ఇలా ఎంతమందితో ప్రేమనాటకాలు..."

"ఈశ్వర్రావుగారూ" కోపంగా అరిచాడు విష్ణుమూర్తి. ఈశ్వర్రావు జంకి పాకంలోంచి ఆ వాక్యం కట్ చేసుకున్నాడు.

"సరే! నా కొడుకు బియస్సీ చదువుకున్నాడు. ఇంకా చదివించాలనుకుంటున్నాం. ఎన్నో సంబంధాలొస్తున్నాయి. డెబ్బయివేలవరకు కట్నం ఇస్తామంటున్నారు. వాళ్ళే చదివించుకుంటారట. ఇవన్నీ మీరు చెయ్యగలరా? వెళ్ళండి. మీ పిల్లకు తగిన సంబంధం చూసుకోండి. మీరు బెదిరించినంత మాత్రాన భయపడే వాళ్ళంకాము"

"మీరూ అంతేనంటారా అక్కయ్య

గారూ! ఒక ఆడపిల్ల జీవితాన్ని మంట గలుపుతారా? ఒక అమాయకురాలి బతుకును మొగ్గలోనే తుంచేస్తారా?"

"మావారు చెప్పిందే నేనూ చెప్పేది. అంతకన్నా ఏంలేదు. మా అబ్బాయి చదువుకున్నవాడు. బుద్ధిమంతుడు. పంచిన తలె త్తడు.ఇదెలా జరిగిందో మాకు అర్థంకావడంలేదు. ఈ విధంగా వాణ్ని వలలో వేసుకుందామనుకున్నారు. మీరు ఇంతగా మీ అమ్మాయి జీవితం గురించి బాధపడుతూ ఇన్ని మాటలు చెప్పారు కాబట్టి, చాలాకాలంనుంచి తెలుసున్నవాళ్లు కాబట్టి చెబుతున్నాను. మా వారు చెప్పిన కట్నం, ఆపై కానుకలు మీరు ఇవ్వగలిగితే మేం అంగీకరిస్తాం. అంతేగాని మరోలా మీ బెదిరింపులకి భయపడం. ఇకపై ఈ విషయంలో బేరసారాలంటూ పదేపదే మా గుమ్మం తొక్కక్కర్లేదు" పార్వతి ఖచ్చితంగా తెగేసినట్లు చెప్పింది. ఆ చెప్పడంలో ఒక మగ మహారాజుకు తల్లిగా ఠీవి, దర్పం అన్నీ కూడగట్టుకుని మరీ చెప్పింది.

విష్ణుమూర్తి వెనుదిరిగాడు. గుమ్మం బయట ఒక కాలు పెట్టాడు. "వస్తానండి" అన్నాడు.

"మంచిది" అన్నారిద్దరు. విష్ణుమూర్తి అంతతేలిగ్గా వెనుదిరిగినందుకు ఇద్దరూ పొంగిపోయారు. ఎవరెస్టు శిఖరాన్ని అధిరోహించినంతగా పొంగిపోయారు.

"ఒక్కమాట" అన్నాడు విష్ణుమూర్తి రెండోకాలు బయటపెడుతూ.

"అసలు కథ ఇది. ఇప్పటివరకు నేను చెప్పించి అంతా నిజమే. కాకపోతే చిన్న మార్పు. కట్నకానుకలు, మిగతా విషయాలు ఈ పరిస్థితిలో ఎలా బేరం చెయ్యాలో తెలియక అలా మాట్లాడాల్సి వచ్చింది. నెలతప్పింది మా అమ్మాయి రాజ్యం కాదు, మీ అమ్మాయి రాధిక. ప్రేమ వెలగబెట్టింది మా అబ్బాయి చిరంజీవితో. ఈ విషయం మీ వరకు ఇంకా రాలేదు.వచ్చుంటేముందుగా మీరేనాగుమ్మం తొక్కేవారు. మీ అమ్మాయి మా లక్ష్మి దగ్గరకొచ్చి ఏడిస్తే విషయం తెలిసింది. ఈ పరిస్థితిలో మీరైతే ఏం చేస్తారోనని మార్పుచేసి చెప్పానంతే. సంప్రదింపులు మా విషయంలోనూ ఇంతకంటే ఏం తేడాలుండవు. ఆ తరువాత మీ ఇష్టం"

విష్ణుమూర్తి చకచకా వెళ్లిపోయాడు.

—గోటేటి రామకృష్ణారావు

## జ్ఞానోదయం

అప్పారావు నిద్రనుండి లేచేటప్పటికి ఆరు గంటలయ్యింది. అప్పటికి పార్కులో ఎవరూ లేరు. అప్పారావు లేచి బట్టలకి అంటుకున్న దుమ్ము, గడ్డి పరకలు దులుపుకున్నాడు. రోడ్డు మీదకు అడుగు పెట్టాక గానీ అతను గ్రహించలేదు తన కాళ్లకి చెప్పులు లేవని.

ఒక వంక తన మతిమరపుతనాన్ని తిట్టుకుంటూ, ఇంకోవంక అప్పటికయినా గుర్తు తెచ్చుకున్నందుకు తనసితానే అభినందించుకుంటూ పార్కులోకి వెళ్లాడు.

తను పడుకున్న ప్రాంతాన్ని క్షుణ్ణంగా వెతికాడు. చెప్పు కాదుకదా అరిగిపోయిన తోలు ముక్క కూడా లేదు అక్కడ. చుట్టుపక్కల ఉన్న ఇద్దరు ముగ్గుర్ని అడిగి చూశాడు. లాభం లేకపోయింది.

ఇంతకీ తను పార్కులోకి చెప్పుల్తోనే వచ్చానా అని అనుమానం వేసింది.

పోయిన చెప్పులు ఎలాగు పోయాయి.

 



కొత్త చెప్పుల కోసం ఒక్క పైసా కూడా ఖర్చు చేయకూడదు అనుకున్నాడప్పుడు. అయితే చెప్పులు సంపాదించటం ఎలా? అప్పారావుకి వెంటనేస్ఫురించింది-చెప్పుల దుకాణాల తర్వాత విరివిగా చెప్పులు ఉండేస్థలాలు గుళ్లు అని. ఆ అయిడియా తట్టంగానే అప్పారావు నడక వేగాన్ని పుంజుకుంది.

గుడి ముందు ఎన్నో చెప్పుల జతలు అప్పారావుకి స్వాగతం పలికాయి. అయితే చేసున్నది పాపపుపని, అందులోనూ దేవుని ఎదుట కాబట్టి ముందుగా దేవుణ్ని మంచి చేసుకోవాలని గుడిలోకి అడుగు పెట్టాడు అప్పారావు.

గుడిలో స్వామివారు ఒకరు ఉపన్యాసం ఇస్తున్నారు. ఎంతోమంది భక్తులు ఆయన ఉపదేశాలని శ్రద్ధగా వింటు న్నారు. అంత మందిని చూశాక అప్పా రావుకి అర్థం అయింది - గుడి ముందు అన్ని చెప్పులు ఎందుకుఉన్నాయో!

కుతూహలం కొద్దీ అప్పారావు స్వామి వారి ప్రవచనాలు వినసాగాడు. ఆయన ఉపన్యాసం వింటున్నకొద్దీ అప్పారావులో మార్పు రాసాగింది. ఉపన్యాసం అయి పోయాక స్వామివారి కాళ్లమీద పడ్డాడు అప్పారావు.

స్వామివారు "సంగతేమిటి నాయనా?" అన్నారు.

"ఈ పాపిని క్షమించండి! గుళ్లో చెప్పులు కాజేయాలని వచ్చాను స్వామీ! అయితే మీ ఉపన్యాసం విన్నాక ఆ పాపపు ప్రయ త్నాన్ని మానుకున్నాను" అన్నాడు అప్పారావు.

"మంచిదినాయనా!" అన్నారు స్వామి వారు. "అయినా దొంగతనం మహాపాపం అని ఈరోజు నాఉపన్యాసంలో ఎక్కడా చెప్పలేదు కదా! మరి నా మాటలు ఏవి విన్నాక నీలో ఈ మార్పు వచ్చినట్లు?" అనడిగారు స్వామివారు.

"తాగుడు మహాపాపం అని మీరన్న మాటలు విన్నాక రాత్రి నా చెప్పుల్ని నేను ఎక్కడ మర్చిపోయానో గుర్తుకు వచ్చింది. కృతజ్ఞుణ్ని స్వామీ!" అన్నాడు అప్పారావు లేస్తూ.

—కె. శ్రీఉదయిని

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD /402